# 1. తపః ఫలము

శ్రీపెరంబుదూరు శేముషీ భక్తికి
పెరుడు దీర్పుపుణ్యభూమి, తత్పు
రీప్రభాకరుండు బుజువర్తికేశవ
సోమయాజి సీతయహో ంరాజి ॥1॥

అలసెసతికాంతిమతి, సార్థకాఖ్య, సద్గు
ణాభిరామ సుందర సుశోభితాంగి,
చిర్చిల్లిసబొమ్మ, పతివ్రతాఢ్య
వారిద ాయ్యాదిదంపతులవరము ॥2॥

వారిర ఘ నా మెల్లని
గ్గంధ క ు గాచిసశర
దిందుచంద్రిక, లసహృదయాలు చెదరగ
సంతు శాంతిలేక జంటకొలగె ॥3॥

చేయునదిలేక దంపతుల్ చెన్నపురికి
వచ్చి, యిలవేల్పుకులవేల్పుపార్థసార
థిన్ సుదర్శన ప్రెమెవుచే దృష్టిపరుఛ,
స్వప్నమందాప్రభుండు సాక్షాత్కరించె ॥4॥

ంగినీలాల సంద్రమే సేల నిండి
ఆహావాతధ్వనులడగిపోవ
కనులుమిరుమిట్లుగొలిపెడికాంతులెగయ
స్వప్నవీధితరంగాలు సాకృతిగొనె ॥5॥

అలల తరగలనురుగులే యాయినంత
కోటిఫణిఫణవ్రాతమ్మై, గుణగణాన్వి
తస్వరూపంబునై, దిశదశలవెలుఁగ,
వేయిపడగలకాంతియాదోయిఁగలిసె ॥6॥

నాల్గుచేతులురెండయ్యె, నల్లనయ్య
భువనమోహనమూర్తియై ముందునిలచి
చేతిలీలారవిందాన శిరముదువ్వ
భల్లటంచునుతెల్లగాతెల్లవారె ॥7॥

జలధినుండి పైబడు కర్మ సాక్షికరణి
వారు లేచి సుస్నాతులైవచ్చి, ఆల
యాంతరద్వార కక్ష్యాల నధిగమించి,
పార్థసారథిఁ జూచి స్వప్నంబు మెరయ ॥8॥

స్వామి! నీచేతలేమని సన్నుతింప
క్షణమునిలుకడలేని సాగరము నెదుట
నిర్నిమేషుండవై నిల్చునిన్నుజూడ
చంచలజగల్ల భావమే శాశ్వతమగు ॥9॥

కలలోగన్పించెతి, మా
తలలన్ పూజేత తడిమి తనిపితి శేషా
చలఫణిఫణాగ్ర దీప్తులు
ఫలమానో! కనులపంట భాగ్యంబెటులో? ॥10॥

అంతలోనర్చ కుండిచ్చు హారతిగొని
ప్రభుని విడలేక విడలేక వారుభూత
పురిని జేర, నావర్షంబు ముగియుచుండ
కాంతిమతి గర్భవతియయ్యె కలలుపండె ॥11॥

ప్రథిలపింగళినామ వర్షము విశాఖ
శుద్ధపంచమి, గురువార శోభితమ్మ
కటకలగ్నమారుద్ర నక్షత్రమందు
పుత్రుడమృతాంశ తేజస్వి పుట్టెనంత ॥12॥

యామునుల శిష్యుడు, వరదేవాధిరాజ
సుతుడు, శ్రీశైలపూర్ణుడు సోదరిప్రస
వింప మేనల్లుచూడగ వేగవచ్చి
వానిజాతక చక్రంబు వ్రాసి, మురిసి ॥13॥

కాంతి! నీబిడ్డ రూపురేఖలకనువుగ
భావిభాగ్యోదయ శ్రీల బలికెద విను,
వీడుశేషాంశసంభూతు డేడుగడ,మ
హీస్థలికి, మంగళప్రదుండెల్లరకును ॥14॥

అద్భుతంబగువీని గ్రహగతి చూడ
శంకరభగవత్పాదుల సరణితోచె,
నిరువురికి లగ్నమొక్కటే యిరువురికిని
జన్మనక్షత్రమొకటె మాసంబునొకటె ॥15॥

రాహువేకాదశంబున ప్రబలుడయ్యె
రవి బుధ భృగులు దశమకేంద్రస్థులైరి
షష్ఠమందిద్దరికి శని సమము, కాని
వాక్కుటుడు వ్యయ గురుడు నీపట్టికుండె ॥16॥

రవి కుజులబరివర్తన ప్రభయెలుంగ
వాక్కుటుంబదోషంబులు పరిహృతియగు
ద్వాదశగురుండు చాటె తథాగతుని ద
యార్ద్ర చిత్తము దళిత రక్షైకదీక్ష ॥17॥

అనగ, యన్నా! జగద్గురుండౌనె? వీడ
ని సుతుఁజూడగ, కేశవుండేగుదెంచి
బావగారు మే నల్లుని భాగ్యకణిక
చెల్లెలకు కొండలన్‌జేసి చెప్పుటరుదె? ॥18॥

నాగ ఆచార్య శంకరునంతజాణ
కాగలడునీసుతుండనగ, వలదువల
దయ్య! అల్పాయువై, నిర్గుణాన్వితసుతు
చూడలేనన పూర్ణుడు స్రుక్కుచుమది ॥19॥

మరల జాతక మొకసారి తిరుగవైచి
తృప్తుడై! భావ నీమాటతేటపడియె
శంకరగురులకున్న షష్ఠాష్టమగ్ర
హపరివర్తనదోషమేయంటదిందు ॥20॥

ఆయు కారకుడగు శని
ఆయు క్షేత్రేశుడగుచునాటింటశుభ
స్థాయిగురుచంద్రు దృక్కుల
నాయు పరిపూర్ణుడౌ త్వదాత్మజుడిలపై ॥21॥

వీడుతాతరించుటెకాదు, విపులవిశ్వ
మునుతరింప ఁజేసెడి ధర్మ మూర్తి, చూడ
నాదిశేషుడే లక్ష్మణాఖ్యనిల ఘరగు
నితని వెన్నంటి వెన్నుడే హితము గూర్చు ॥22॥

పరివర్తిత రవి కుజులన్
బరిశీలింపగ స్థిరమగుభావములఁగ వా
క్పరుషిత నుద్రేకంబులఁ
బరిమార్చు సుదీర్ఘ జీవ భాగ్యములందున్ ॥23॥

తపముకంటె భక్తియే గొప్పతత్త్వమంచు
ధర్మమునకంటె దయయే ప్రధానమంచు
వ్యక్తికంటె సంఘమె ముక్తి పథమటంచు
క్రొత్త వేదా! సిద్ధాంత మేకూర్చు నితడు ॥24॥

శంకరులకంటె సులభుడై జగతినాత్మ
తత్త్వమెల్లరకును జూపుదార్శనికుడగు
పిన్నవాడయ్యు పెద్దల పెద్ద, యీాత
డంతయు జగదంబ యనుగ్రహమనివెడలె ॥25॥

ద్యుతిమతి రెండవచెల్లె ల
నతిదూరంబున కమలనయన భట్టునకుఁ
సతియై పరమేశ్వరుదయ
సుతుఁగాంచుట విని రయమున చూడఁగ వచ్చెఁ ॥26॥

వచ్చి చెల్లెలి యొడినున్న పాపనిగని
పాపడీ శ్వరార్చన కళాప్రాభవుండు
పరమవైరాగ్య భావ సంపన్నుడగుచు
సార్థకా ఖ్యుడై గోవింద సముడగునని ॥27॥

తిరుమలఁజేరి మహోన్నత
గిరి శిఖర జ్యోతి నరసి కీర్తించె సదా
తిరుమలనాధుని, జగమే
తిరుమల నంబియని యతని దివ్యత పొగడఁ ॥28॥

అనుదిన మాయిరువురు నం
దనులానందముగఁ బెరిగి తరుణోదయులై
జననుత జీవనులై బ్రా
హ్మణమున కనువుగ సలిపిరి అధ్యయనంబుల్ ॥29॥

ఆ మరు నోడించు, కుమా
రా మృతుడని, యెదిగి వచ్చునాత్మజుఁ జూచున్
రామాయని ప్రేమంబున,
రామానుజుఁ బిలిచి తండ్రి రాముని మఱచెన్ ||30||

పదునారేడులప్రాయము
మృదుహృదయము చురుకు బుద్ధి మీసపు మొలకల్
చెదరని చిత్తము నెల్లర
యెదకెత్తెడి వెడదయురము నిందుముఖంబున్ ||31||

మిసమిసలాడెడి మేన్ప్రొడ,
పసిడిరుచుల భంగపరచువైభవ మాజా
నుసుదీర్ఘబాహువుల , ఁగని
వసుధైకసుకృతిగ సుతుని భావించు, తరిన్ ||32||

పండితులు మెచ్చువినయము, పడతుల తమి
కూర్చుచెలువము, చూచి, సంకోచముడిగి
పలుకరింపగ దూరపు బంధు జనము,
కొడుకు పెండ్లికి తహతహపడెజనకుడు ||33||

సత్కుల ప్రసూత, సౌందర్య నిధి సంప్ర
దాయబద్ధ జాణ ధర్మనిష్ఠ
జ్ఞానయనెడికన్యకన్ జూచి సుతునకు
పెద్దలనుమతింప పెండ్లిచేసె ||34||

భక్తి చే సతి జ్ఞానాన పత్నియగుచు
కోడలలరించు సుతునంచు కోర్కెలూగ
తండ్రి కేశవుడు వికుంఠ ధాముడయ్యె
కూడుకొనెడి సంసారమేకుప్పకూలె ||35||

# అధ్యాయము – 2

భూతపురివీడె నుపనిషద్బోధయుగయు
గాలనాచార్యపీఠమ్మైఖ్యాతిగాంచు
కంచిచేరె లక్ష్మణుడువాక్యార్థనిర్ణ
యంబునవిశిష్టవిద్యార్థియైవెలువడె ॥

# 2. జిజ్ఞాస

రూపమే మారు తల్లిని లోకమెఱుఁగ
ని సతిని, హరాత్తుగాబద్ధనిస్తులగ్రహ
భారమంతయువరదునిభారమంచు
లక్ష్మణుడువేగఁ భూతపురంబువీడె ॥1॥

కంచికిన్ కాపురముమారె గడియ గడియ
కావరదుడేకనుల్గట్ట కంతఁబడక
స్వామిసేవలో సంసారజలధి నీద
యత్నమొనరించె రామానుజార్యుడంత ॥2॥

స్వామి శయనించుమెత్తనిపాన్పుఁజూచు
నావిశాల రాజీవనేత్రాంతరుచుల
పూర్వవాసన లేవియో పొటమరింప
జాలువారుకన్నీటిలో శ్రమలుమఱచె ॥3॥

దినమేదొ వారమేదో
తనపరిసరస్సృష్టియేమొ! తలపోయక ,నె
మ్మనమావరదునిచెలువం
బునచెలువమగుచు నతండు బొమ్మగనిల్వఁ ॥4॥

అన్నా! యనిగోవిందుడు
తన్నుంగని వెనుకనుండి దబ్బుకొనంగాఁ
వెన్నుడనిపుల్కు పుల్కన
కన్నులరామానుజుండుగని సహజన్ముఁ ॥5॥

కంటనీరూర పిచ్చిగాఁగాంచునన్ను
తో, నలిగతీయనిమాటయైన లేక,
ఊరుకూరె మార్చితివి, మాయునికికూడ
దలపవే? యని గోవిందుడలుకఁబలుక ॥7॥

ఏమని చెప్పుదుతమ్మా!
నామదిమదిలోన లేక నలిగె పితృపదం
బీమహి విడనాడ, వరదు
డే మనుగడయని చరింతు నెటులో నిచట౯ ॥8॥

పదపద మనయింటికినా౯
పెదవులచిరునీవ్వుచింద పెదతల్లిని మా
వదినెనుదర్శించియె యీ
సదనంబుననిన్నుఁగంటి స్వాంతము పొంగ౯ ॥9॥

గతమున్నకైచింతించుట
మతిమంతులగుణము కాదు, మాన్యుడవు, మహో
న్నత విద్యా విభవుండవు
బ్రతుకున పరమార్థమరయ శ్రమియింపదగు౯ ॥10॥

యాదవ ప్రకాశుడు పరమార్థతత్త్వ
మణువణువున జీర్ణించు కొనిన మహాను
భావుడంట యాగురుని కొల్వనిట హరి య
నుగ్రహము కల్గునంచు మున్ముందుకేగ ॥11॥

వినవచ్చె గభీరధ్వని
కనువుగ శాస్త్రప్రబోధ మద్భుతమీ పూ
వనములు మధుపోత్కా రమై
కనుపించియు శుక పికముల కలరవమడిగె౯ ॥12॥

కాని,మంత్రముగ్ధుడై నిండుభక్తిని
కేలుమోడ్చిబోధనాలకించు
**శిష్యతతిని (జూచిశీఘ్రమేగోవిందు**
డటకునడచె నన్న ననుసరించె ॥13॥

ప్రవచన ప్రభావంబు, తర్కప్రతాప
మతులితస్మృతి శ్రుతిపురాణతతిగతుల
విస్తరించు చమత్కృతి విధికి, మెచ్చె
కాని రామానుజుడుకాలుకదపడయ్యె ॥14॥

ఏదోతెలియని కొఱతయె
వేదన కల్పింప, పట్టువీడగమూడ౯
సోదరుడన్నా నిలునిలు
యాదవగురుజూచిముందు కరుగ శుభమన౯ ॥15॥

ప్రవచనంబు ముగిసె శిష్యవర్గమేగె,
యాదవగురుని జూచి, యత్యంతభక్తి
విచ్చ, వినయ విధేయతల్ విరగబండ,
అరటిగెలరీతి మ్రొక్కెరామానుజాగని ॥16॥

ఎవడవన్న ! నీవు, ఏమియీకన్నుల
దివ్యశక్తి, తీర్చిదిద్దినట్టి
రూపురేఖలు, మతినూపెడివర్చస్సు,
నిన్ను (జూడగంటి నిజముగంటి ॥17॥

చేరవచ్చియాదవుడు నాచిన్నవాని
యెగుభుజంబుల( బట్టి తిన్నగనెదయెద
జేర్చి యేమికాంక్షించివచ్చితివిట కన,
విద్యగోరితిమంచు గోవిందుడల్ల ॥18॥

ఇతడుమాపెదతండ్రి వరతనయుడు, హా
రి తసగోత్రుడు యాజు షీ శ్రుతికి చెందు
ఘనుడు తండ్రి కేశవసూరి ఖ్యాతయశుడు
పేరు రామానుజుడన గోవిందుఁజూచి ॥19॥

మెదడున దాగినగరువము
మెదలగ కనుగొనల రీఁ మేల్కొనుచుండఁ
పెదవుల లేనవ్వులొలుక
బ్రదుకును బ్రహ్మంబొసర్తు రారండనగాఁ ॥20॥

యాదవగురు పరిచర్యల
వెపొపనిషద్రహస్య వివిధార్థంబుల్
సోఁ...రువురువెస, ధీ
రోదాత్త ప్రజ్ఞనెర్చి రూర్జిత శక్తిఁ ॥21॥

శిష్యవర్గంబున కడు విశిష్టుడగుచు
గుండె బలమొచు రామానుజుండు గురుని
నిశ్చలజ్ఞాన సీమితనుయువుదెలిసి
పాండితీప్రజ్ఞల బ్రాభవంబెరింగె ॥22॥

యాదవగురునొక్క పరి రామానుజుండు
తైలమర్దన మొనరించు తరుణమందు
వెనుకనున్న వేఱొకశిష్యువినతుడడిగె
దేవ! మొన్నధాందోగ్యసూక్తిందెలుపుచు ॥23॥

కప్యాసమునకు వివరం
బాప్యాయనముగ నుడివిన అర్థంబేమో
ప్రాప్యముగాదు మదికి, సా
రూప్యస్థితి దెలుపు డనుచుమ్రొక్కగ గురుడుఁ ॥24॥

పుండరీకాక్షుని నయనములెఱుపని వ
చింపశ్రుతికపిపృష్ఠమున్ స్మృతికి దెచ్చె
నింతియే గాని విపరింపనింత కంటె
నిట విశేషమే లేదనె నిర్దగురుడు ॥25॥

కర్ణశూలమై గురునివాక్యంబులాత్మ
కలచ జొటజొటకన్నీటికణములురల
తనువువడవడవడకుచుతప్పవశము,
లక్ష్మణునిలేతహృదయమల్లాడదొడగె ॥26॥

బాష్పములు,నుర్రనితొడ్లపైబడ గురుండు
చయ్యన శిరంబునెత్తి "వత్సా!"యిదేమి?
నీకుకన్నీరె? యేటికీయాకులమున
గద్గదంబున గురుపాదకమలముగని ॥27॥

తోచు సత్యంబుముందుకు ద్రోయుచుండ
గురుతిరస్కృతియె వెనువెన్కకుపడదోయ,
చేయునదిలేక చెప్పగ చేతగాక
చీకటితుపానువావగా శిష్యుడుండ ॥28॥

"చూడలేను! నీదు శోకంబురామ! ప్ర "
జ్ఞానికిట్టివెతలు కలుగుటెటులొ?
స్వేచ్ఛగ, గగనాన విహరించుఖగపతి
కీతికమక పుట్టుటెట్టులయ్యె? ॥29॥

జ్ఞానమూర్తివి దిగ జారిపోనగునె? తో
చినదిభయములేక చెప్పు"మన్న
యాదవుగని శిష్యుడంజలిబద్ధుడై
వినయ విహితుడగుచు విన్నవించె ॥30॥

శ్రుతులలో సామవేదము సుకృత సారి
అందు ఛాందోగ్య మధిక గుణాన్వితంబు
పుండరీకాక్షుని నయన మోహన స్వ
రూపమెఱిగించు మంత్రము రుచిరంబు ||31||

కపిదాసందు నేత్రద్వయంబటులు మ
హాప్రభల వెల్గుచుండ కప్యాసమంచు
నొక్క నీచోపమానంబు నోర్వననగ
అన్యమేమని గురుద్రుక్కులతని నడుగ ||32||

క యనజలము, పి యనపీల్చు, కపియనరవి,
వికసితంబాస, రవిచేత విరియుగాన
కమల మిచట సిద్ధంబునై గంధరుచిర
మధుర గుణములే బ్రహ్మమ్మె మదినలర్చు ||33||

ఒక్కటే రెండు కన్నులై యొక్కచోట
మూడు గుణముల ప్రక్కలికే ముద్దుగొలుపు
అట్టినిత్యసౌందర్య మనాదరించు
టెటులొ! దేవా! క్షమింపుడీ భృత్యు ననగ ||34||

వీనివాక్కులో సత్యమే విస్ఫురించె
ననిగురుడు శిష్యుఁ జూడకన్నార్ద్రమవుండ
శంకరుడెమదిలోన సాక్షాత్కరించె,
నిర్గుణబ్రహ్మ కీవ్యాఖ్యనీరసంబు ||35||

కపి , కమలము,కలకు కమలాప్తుడన్నియు
శక్తిరూపములుగ సాగుచుండె
ఉచ్చ నీచములని యుడుకుచు భావదో
షమున జీవజగతి సతమతమగు ||36||

అస్థిమాల య్యైన, యాకౌస్తు భంబైన
అమృత మ్మైన, హాలహాలమె య్యైన,
బ్రహ్మమునకు చేటుపాటులేలేవని
స్నానమున్ సలుపగ జనెగురుండు ॥ 37 ॥

మఱియొకపరి రామానుజు
డరుదెంచి, నమస్కరించి, యాదవ చరణాం
బురుహంబుల, కాతనిత్తై
త్తరీయ పారప్రవచన తర్కంబువిసెఁ ॥38॥

సత్యజ్ఞానమనంతం
బిత్యవధారితము బ్రహ్మమిది సర్వంబై
నిత్యం బానందంబై
అత్యంతం బేక మగుచు నంతటనుండెఁ ॥39॥

జ్ఞానసత్యమనంత గుణత్రయమన
కలిసి యొక్క చోనుండుట కల్లగాన
బ్రహ్మమన నిర్గుణంబగు ప్రకృతిజీవ
జగములన్నియు మిథ్యయై సాగుచుండె ॥40॥

చంచలంబై సదామారుజగతికెల్ల
మూలమా బ్రహ్మమే యది మూర్తికాదు
దానినిత్యర్థమున్ జేయుతర్కశక్తి
లేదు శాస్త్ర మొకింత స్ఫురింప జేయు ॥41॥

ఇంద్రియాతీ తమ్మైబుద్ధి కిమడకుండ
కనపడెడిరీతికన్పింపక మతి కలఁచు
సచ్చిదానందమౌ మహాశక్తియిదియె
జీవుడువిరాట్స్వరూపాంశ చింతజేయ ॥42॥

అనృతమునకు భిన్న మైనదే సత్యంబు
జడముగానిదెఱుక సకల మెఱుఁగ
అంతమందనిదె యనంత మిదియెనిర్గు
ణమిది బ్రహ్మ మేయనగీగురుండు ॥43॥

సత్యమిదికాదు కాదని స్వరమువడక
గౌణగురామానుజుంగాంచి గుంపుకలఁగ
కలతచెందు శిష్యాగ్రణిగరిమనెఱిగి
చల్లబడియాదవ గురుండు సాంత్వనమున ॥44॥

రావయ్యా రామానుజ !
యీవేదిక చెంతనిలచి యీ ప్సితమగు నీ
భావములన్ స్పష్టపరుపు
మా,విద్యాతురులగు చెలు లభినందింపఁగ ॥45॥

నావుడు శిష్యాగ్రణి భ
క్త్యా విష్టుండై ఘటించి యంజలి దేవా।
మీవాక్కుల, కెదురాడెడి
జీవుడనని తలపరేనిచెప్పెదనిందుఁ ॥46॥

మిమ్మాదిరించెడి పొండి
త్యమ్మును, కడకా తలంపు తట్టదుమది, బ్ర
హ్మమ్మన సత్యముజ్ఞానం
బిమ్ముగ నదియే యనంతమివిధర్మంబుల్ ॥47॥

బ్రహ్మమన జ్ఞానమే స్వయం ప్రభలవెలుగు
బ్రహ్మ మన సత్యమె వికారరహిత మది అ
నంత మై బ్రహ్మమన్నిట వ్యాప్తి చెందు
నేతినేతియన నిజ మేరీతి తెలియు ॥48॥

తళుకు, తావి, తేనె, తవిలిన సుకుమార
పుష్పము వలె బ్రహ్మమునకు మూడు
విడివడనిగుణములు వేరె వ్వరు భావమే
జీవలోకములని చెప్పె శ్రుతులు ॥49॥

వెలుగురవికి చల్లదనము సలిలమునకు
ఉష్ణమగ్నికి సహజమైయుండురీతి
జ్ఞాన సత్యమనంతముల్ నైజమగుచు
బ్రహ్మ మపృధక్ గుణంబుల పరగుచుండ ॥50॥

బ్రహ్మ మందనేకపరస్పరమవిరుద్ధ
గుణములొకటకూటస్థమై కొఱతలేక
దేశకాలయుపాధుల త్రెళ్ళనట్టి
సచ్చిదానంద తత్త్వమే సాధువగును ॥51॥

బ్రహ్మమందీత్రిగుణములు పదిలమయ్యె
కానిగుణముల బ్రహ్మంబుకానరాదు
బ్రహ్మమేవేరు గుణములప్రకృతివేరు
తలప జీవేశ్వరులకుభేదంబునిజము ॥52॥

నిర్గుణబ్రహ్మ మొక్కటేనే నిక్క మైన
ఎఱుక బయలు బుతంబని మరల మూటి
నిచట వేర్వేరుగా వచియింపనేల?
బ్రహ్మమునకెట్లు పర్యాయపదములబ్బు? ॥53॥

నిర్వికార నిరంజన నిర్గుణమన
బ్రహ్మమున జగద్రూపము ప్రాప్తమగునె?
ప్రాప్తమందది నిర్గుణప్రతిమకాదె?
ప్రతిమకనుభవానందముల్ పట్టుటెటులొ ? ॥54॥

ఆనందములోఁ బుట్టుచు
నానందములోఁ బెరుగుచు నానందములో
నానందంబగు లయ క
ర్యాణాద్భుతగాత్రచర్య బ్రహ్మంబనగా ||55||

యాదవుడావాక్కుల తా
సాదరముగనాలకించి సందేహములా
మోదంబగుకానీ,నీ
వాదములో చేవలేదు పరిశీలింపన్ ||56||

జ్ఞానమే సత్యమదియే అనంత మయ్యె
బ్రహ్మమై అవస్థా స్థితింబట్టి పెక్కు
పేళ్ళు జీవలక్ష్యార్థమై విశదమయ్యె
కాని నిర్గుణబ్రహ్మమొక్కటియెనిజము ||57||

గడియగడియకుమారుజగంబునందు
చచ్చిపుట్టుచు పుట్టుచుచచ్చు చున్న
జీవగుణములరూపమే స్థిరముకాదు
బ్రహ్మమునకీ వికారముల్ పట్టవయ్య ||58||

గుణము లుండిన, రూపంబుకూడుచుండు
రూపమబ్బిన మృత్యువేరూఢమగును
మృత్యువేలేనిరూపంబు సత్యమిదియె
జ్ఞానమైయనంతమయి యానందమగును ||59||

బ్రహ్మమన సచ్చిదానంద పరతనెగడె
నీడలేని చైతన్య మై నిండెబుతము
నూనెలేని దీపంబునై జ్ఞానమెగయు
పొడవులేని ప్రాణంబుగా భువిని చుట్టు ||60||

ప్రాకృతపు సృష్టి సంస్థిత లయలు మిధ్య
జీవుడీ పై మెరుంగల చిక్కి నలుగు
జ్ఞానమేగుణంబులులేనిసత్యమయ్యి
యప్పుడే భేద ముడిగి బ్రహ్మంబవగుదు ॥61॥

చిన్నవాడవింకను చింతచేయుమన్న
అధ్యయనమడుగంటె విద్యార్థులమది
చెదరె రిత్త ప్రశ్నించుచు చిరుతలైరి
మంచిదేయని ముందుకు మరలె గురుడు ॥62॥

శిష్యులంతరామానుజు ఛీత్కరించి
వీనితలతిక్క శంకలే వేచె మమ్ము
అపరశంకరుండగు గురుడాగ్రహించె
నేమికానున్నదోయని యెల్లరేగ ॥63॥

అన్న! గురుడు, గుణాతీతు నెన్నుకానియె
నీవు కల్యాణగుణములనిలువుగంటి
సఖులిచటమత్సరమ్ము నజారుకొనిరి
దీనికివిచారమేటికోతెరలుమనగ ॥64॥

కాదుకాదుగోవింద శంకరులు బ్రహ్మ
మునుగుణాతీతమునఁ బరిపూర్ణమనిరి
యాదవులునిర్గుణమిది శూన్యమనివాద
బలము చూపిరి అనుభవంబందుకొనరు ॥65॥

ఏది యెట్లైన గురువుల నిపుడు మన మి
చట ప్రసన్నాత్మచేసికొనుటయె, మేలు
అందఱునువన్ని విధములనాదుకొనెడి
సర్వసాక్షియావరదు దేశక్తిమనకు ॥66॥

శంకాతంకమనను లి
ట్టింకులుగాన్భక్తి సించి రిద్భురుగురుపా
దాంకములందుంచుచు నా
వంకకునాకస్మికముగ వచ్చెగురుండున్ ॥67॥

సోదరులిరువురు గురుదే
వా! దయమన్నింపుడంచుప్రణమిల్లగ లే
లే, దిగులేంచిరంజీ
వీ? దేవునిబిడ్డ వీవు హృదిహృదినెఱుగు౯ ॥68॥

ఆర్జితమగునీగుణముల
నూర్జితమగుభక్తి తత్త్వముదయించెన్, స
మ్మార్జితమగు నీశంకలు
తర్జనభర్జనలకింక తావముగలదే? ॥69॥

ఏరీ నీసహపాఠకు
లౌరా? సహనంబు, నెదిరినరసి డిగుణమున్
సారాసారమెరింగి వి
చారంబొనరించు శక్తి ఛాత్రులకెపుడో! ॥70॥

దేశాటన మొక్కటియే
యీశిష్యసఖాళికెల్లనింగితమనుచు౯
కాశీయాత్రను చాటుం
డాశివివిష్ణుని యనుగ్రహంబందుకొన౯ ॥71॥

భావభేదంబుకలిగినన్, భాషతెలియ
కున్న, శీతోష్ణములే మారు చున్న, లిండి
తీర్థములువేళవేళకు తీరకున్న,
బ్రతుకునడుపుటే యాత్రకు లక్ష్యసిద్ధి

అప్పుటకిగాని శిష్యుల యాత్మ శక్తి
వెలుగులిడదన్న యాదవ విప్రుఁజూచి
అతనివాత్సల్యమెఱిగి రామానుజుండు
తీర్థయాత్రా కుతుహల దృష్టినడచె ॥73॥

# అధ్యాయము - 3

అహమహమని యాత్మకుదూరమ్మైగురుండు
బ్రహ్మాదైత్యునిచే పరిభవముగాంచె
వినయవినమితశిష్యుడే విబుధుడయ్యె
అందరికిగాని విద్య హాస్యాస్పదంబు॥

# 3. వినయవిభూతి

పాపరాపాన్పునఁ బరుండు వరదుడగుదొ?
గిరిశిఖరిపై నటించు నీశ్వరుఁడొ! స
దాశ్రుతిస్వరూపుడగుపద్మజుఁ డవో!
నిన్నునెవరని, యెట్లనినిర్ణయింతు? ॥1॥

తెలియనప్పు డేదియు మది తేటపడదు
తెలిసినప్పుడు భేదమే తెల్ల మగును
భేద మందున నినుజూచి బాధపడుచు
తెలిసి తెలియకనీముందు నలుగుచుంటి ॥2॥

నీలిమేఘసుస్నిగ్ధమో ! నిరుపమాన
తేజమో! నల్లకలువల తీయదనమొ
నల్లనయ్య నీసన్నిధానమున నిన్ను
నే నెఱుగకుండ నీగతి స్థాణువగుదు ॥3॥

దివ్యకాంతిస్వరూపముద్దీప్తమగుచు
కంటఁ బడుచున్నకల్యాణగాత్రునెటుల
ప్రాకృతశరీరధారిగాఁబరిగణింతు?
బాహ్యనేత్రాలకందని ప్రభుతనీది ॥4॥

జననమరణములున్న యీ తనువు నీది
క్షుత్పిపాసలుగల యీయసువులునీవి
శోక మోహాల కర్తృత్వసుకృతినీది
నీవు లేక ద్వంద్వంబులే లేవు జగతి ॥5॥

ఈవులేకయీసౌందర్యమెటులకలుగు?
నీవులేకనిత్యత్వమునిలుచుటెటులొ ।
నీవు లేకయానందమన్నిటకలుగునె ?
నీవయీజీవజగముల నిలుపుశక్తి ॥6॥

కాలమునుగెల్చు దేహంబు కర్మములకు
కట్టువడనిచేష్టలు మదిగాంచుటెటులొ ।
సచ్చిదానందగుణముల స్వామిదివ్య
తత్త్వమేరీతి తెలియుటో తట్టదు మది ॥7॥

జ్ఞానసత్యమనంతాది సద్గుణములు
బ్రహ్మసంబంధియేగాని బ్రహ్మ మగునె?
ఎఱుఁగదేహదేహిన్యాయ మిది సహజము
నిన్నునీవాడుకొలువకనిలుచు టెటులొ? ॥8॥

భువనమోహన రూపమే ముందునిలువ
అంతుకందని యేదొ । యాహ్లాదమొదవు
విగ్రహంబని నిన్నుభావింపలేను
రాతిరప్పగనీముందు బ్రతుకలేను ॥9॥

ఎచటనోయున్న నన్ను నీయెడకులాగి
కనుల మిరుమిట్లు గొలుపగ కరుణఁజూచి
అమృతమొలుకు రాజీవ నేత్రాలదనిపి
నన్ను చూచిచూడక నవ్వ న్యాయమె? యన ॥10॥

ఎవరిదీ వేదనయని మెట్లెక్కుచున్న
యామునాచార్యగురుడు శిష్యాళినడుగ
భక్తి మూర్తీభవించిన భాగవతుడు
యాదవులగొల్చు శిష్యరామానుజుడన ॥11॥

దవ్వుదవ్వులనుండియే తన్మయుడగు
భక్తునింగాంచి యాజానుబాహుడమృత
చిత్తుడరవింద నేత్రుడు స్నిగ్ధమూర్తి
కారణ పురుషుడైనచు జగద్గురుండు ॥12॥

వరద! యీ భాగవతుని కాపాడుమంచు
స్వామికిన్ మ్రొక్కి శ్రీరంగపట్టణంబు
చేరనెట్టులో । యామున శ్రీగురుండు
ఆ పలుకులకాంచీపూర్ణుడాలకించి ॥13॥

భేదమోదాత్తహృదయసంకీర్ణుడగుచు
గురునివాక్కులమోఘమైకూడుకొనియె
నింతలోనెట్టి గండంబు లీకుమార
భక్తుడెదిరించునోయని బాధపడుచు ॥14॥

వరదునింజేరియామున వరుస లాను
"అయ్య! డాంబికగురులశిష్యత్వమెప్పు
డెటుల కడతేర్చునో రామునెట్టులైన
బ్రోవవే"యని మరిమరిపూర్ణుడేగె ॥15॥

ఇంటికేగితల్లికెరగి యీ యాత్రావిష
యంబుగురుని నిర్ణయంబుఁ దెలిపి
ఆమెదీవనగొని అనుజుడేతేర రా
మానుజుండుయాదవాంఘ్రులంటె ॥16॥

ఇంతలోరాచభటవర్గమేగుదెంచి
దేవ! మీదర్శనముగోరె భూవిభుండు
బ్రహ్మరాక్షసి నగరిలోఁ బడికలంచె
పల్లకియుసిద్ధమయ్యె శ్రీపదములకన ॥17॥

యాదవప్రకాశుడాపట్ల నాలించి
చెంతనున్న శిష్యుఁజేరఁబిలిచి
రామ ! రమ్ము బ్రహ్మరాక్షసి శక్తులు
మంత్ర తంత్ర విధులమర్మమెఱుఁగ ॥18॥

ఎక్కుమా పల్లకియన నీభృత్యునకిది
తగదు తగదు దేవా! మీపదముల వెంట
నంటి వత్తు సఖాళితో ననగ శిష్య
వరుని లింకించి గురునాత్మ పరవశించె ॥19॥

గురుపల్లకి రాజాంత
పురసన్నిధిజేర వచ్చి భూవరుడెదురై
గురుదేవా ! రక్షింపుడు
వరసుత నీదైత్యశక్తి బాధించె ననన్ ॥20॥

భయపడకోరాజ! జగ
త్రయమందెయపూర్వమంత్ర తంత్రాత్మక వి
స్మయశక్తులుగలవీ దు
ష్ట యఘోరబ్రహ్మదైత్యుదగ్ధమొనర్తున్ ॥21॥

రాకుమారిపైగవిసిన బ్రహ్మదైత్యు
డుగ్రుడైతాండవింపగ నుర్వియదరె
ఎంష్ట్ల పటపటకొఱుకుచు పైఁబైఁబడ, గురు
డె వడురానీవు? రాకన్నెనేలపట్టు? ॥22॥

ఓరోరీ! యాదవ ! నే
నీరాజాత్మజనుగాక నీకాళులపై
వ్రాలెడిదుష్కర్మదురా
చారుడనే? చాలు నీదు శాస్త్రజ్ఞతయున్ । ॥23॥

నాకు తెలియని మంత్ర తంత్రములులేవు
ముష్టితోవెఱపింతువే మూర్ఖనన్ను!
నిన్ను నీవెతెలియని నిందితుడవీవు
నన్నుగూర్చి ప్రశ్నించుటనవ్వులాట ॥24॥

వినవిను చెప్పెద గతజన్మనేను
పరమ నిష్ఠాగరిష్ఠుడౌ బ్రాహ్మణుండ
సకల వేదవేదాంగాది శాస్త్రతతిని
జీర్ణమొనరించుకొన్న సంపూర్ణబలుడ ॥25॥

క్రతువునన్ స్వర లోపంబుకలుగ బ్రహ్మ
రాక్షసుండనై యిటుల నల్లాడు చుంటి
వెనుకజన్మన గృధ్రమై వృక్షశాఖ
యాత్రికుల భుక్తశేషాన్నమందితీవు ॥26॥

తత్ఫలమున విప్రాకృతిదాల్చితివన,
అద్భుతస్వాంతుడైతగ్గియాదవుండు
ఎవ్వరివరప్రభావాననీకుమారి
కిందుముక్తికల్గు నా! వచియింపుమనగ ॥27॥

ఎవడహంకారమమకార హీనుడగుచు
నీచరాచరాత్మక జగంబెల్లనీశ్వ
రస్వరూపంబుగఁ దలచిఁబ్రతుకువాడె
నాకునీకును ముక్తియొందఱకు నిచ్చు ॥28॥

అట్టిమహనీయుడెవ్వడోయనగ నేమి
చెప్ప నాత్మప్రబోధమే చేకొనకిట
కన్నులుండియు గాంచనిగర్వమతుల
గాంచనంచు, రామానుజుఁగాంచి మ్రొక్క ॥29॥

యాదవునిదృష్టి శిష్యరామానుజుకడ
వ్రాల, నతడుముందుకువచ్చి బ్రహ్మమెల్ల
ప్రాణి కోటిని రక్షింపరాక్షసమిక
నిలుచునే? శ్రీహరీ కరుణింపుమనగ ॥30॥

ఎంతచల్లని పలుకెన్నాళ్ళకీచెవిన్
బడె, సమస్త వేదపంక్తులందు
పొందరాని హాయిపొందితిందు వసంత
సంధ్యలవిరివానజల్లులివియె ॥31॥

నేనుమీవలెకాలేను! గాని, స్వామిం
సన్నిధానమే అజ్ఞాతసౌఖ్యమొసగె
రమ్ము దేవ! మీపదమీశిరంబునంట
గుజ్జుకట్టునా గర్వపు మజ్జకరగు ॥32॥

మీ కృపాకటాక్షమే మేనుసోక నా
దైత్యలక్షణంబె తలగె వాస
నావశమగురూపునశియింపదయ్యెమీ
పాదధూళితగులబ్రహ్మమగుదు ॥33॥

కేలుమోడ్చిశిరమువంచి క్రిందవ్రాలు
దైత్యునిన్జూడజాలక తత్క్షణంబు
ముందు వడి నిజ పాదమాపుణ్యజనుని
శిరమువైనిడివరద! రక్షింపుమనగ ॥34॥

హరిపదంబంటు బలిరీతి నాతడలరె
కన్నులఁజెదర్చుకాంతియొక్కటితటుకున
మింటికెగయగ ముంగిట నంటుకొన్న
వృక్షశాఖహఠాత్తుగావిరిగి పడియె ॥35॥

పైటసర్దుకొనుచు రాచపట్టి లోని
కురికె, నిట్టూర్పులన్నపుండు భరమడంగె,
బ్రాహ్మడుగురుండు చిత్రమీమాంసియయ్యె
శుచిరుచిప్రభన్‌రామానుజుండునిలువ ॥36॥

బ్రహ్మద్వైత్యాదిపాపముల్‌పరిహరింప
భక్తియేగాని మంత్రముల్ పనికిరావు
నిర్మలాంత కరణులసత్కర్మమొకటె
పాపులసముద్ధరించెడి స్పర్శవేది ॥37॥

చిత్రమితని మహిమ చెప్పలేమంచు వే
నోళ్ళ విభుడుపొగడ, త్రుళ్ళుచుమది
పీడుమాకుశిష్య చూడామణి నృపాల!
యని విసవిసగృహముకరిగెగురుడు ॥38॥

మణిమాణిక్యంబుల భూ
షణహారంబుల సువర్ణ సహితాంబర చం
దనతాంబూలంబుల ల
క్ష్మణుని కిడి నమస్కరించుమనుజేశునితో ॥39॥

క్ష్మాపాలా! కానుకలఁ
జేపట్టెడి గొప్పయేమి పేసితినయ్యా?
శ్రీపతికృపచే గురునా
జ్ఞాపాలన నడచుకొనెడి కడపటివాడఁ ॥40॥

గురుడే సాక్షాద్బ్రహ్మము
గురుడే పూజార్హుడైన గోవిందుడిలఁ
గురువచనశ్రవణంబే
పరమార్థంబని భజించు భటకింకరుడఁ । ॥41॥

ఈగౌరవతాంబూలము
మాగురు దేవులకుఁబంపిమన్నింపుడటం
చాగుణనిధిరామానుజు
డేగగ, కవిగాయకగణమింగితుపొగడెఁ ॥42॥

భుజబలంబుతో రాజ్యాల పొందవచ్చు
శ్రద్ధతోనాల్గు వేదాలచదువవచ్చు
కాని బ్రహ్మంబునెఱుగ ఁపక్తపదమొకటె
విశ్వసౌజన్య కారిగా విభుడెఱింగె ॥43॥

యాదవుడీవృత్తాంతము
సాదరముగనాలకించి సమరస భావం,
బే దివ్యమనుచుదెలిపియు
నాదారిని నడునసైతి నహమాడింపఁ ॥44॥

మనసువిరులకంటెమధురమ్మై సుకుమార
మ్మైరుచిప్రపూర్ణమ్మై ఫలించు
శిష్యునివిడలేక, చిక్కనిగర్వంబు
నడపలేకగురుడు, సుడులఁబడియె ॥45॥

మఱువకమదిలోసేవఁ
దరి జేర్పక శిష్యవరుని దవుదవ్వులకున్
పరువకరాత్రియె పగలై
గురుడుండియునుండకుండె గుణనిధియెదుటఁ ॥46॥

వీనివినయమే మాకవమాన శిక్ష
వీనివిద్యా ప్రలిభయె నన్ విరథుఁ జేసె
వీని భక్తి ప్రపత్తి నన్ వివశుఁ జేసె
కొఱుకరాని కొయ్యగ వీడుగుండె పిండె ॥47॥

తెగులు లేని యీబాధనుత్రెంచలేను
వీడునన్నె కాదుకడకు విశ్వవిదిత
బ్రహ్మతత్త్వంబునే మార్చి ప్రజనపూర్వ
మాత్మ సిద్ధాంత కూపాన నూకిపైచు ॥48॥

ఏదియెట్లుండి నన్ వీని యెదమధురిము
ముఖముదివ్య కాంతుల సదాముద్దులొలుకు
చంపమనసొప్పదు భరింపశక్తిలేదు
ఏదొ, అజ్ఞాత శక్తియే యితనిఁ గాచు ॥49॥

పారదోలె పదస్పర్శ బ్రహ్మదైత్యు
ని, సహజ బ్రహ్మ తత్త్వమున్ నిలుపఁజూచె
జగతి హృదయమున్ దనిపె ప్రసన్నుడగుచు
వీని నిర్జింపలేను జీవింప లేను ॥50॥

ఇంతలో సోదర ద్వయంబే గుదెంచి
గురునికెఱగి దేవా, యాత్రకుతగువసతు
లన్నియునుగూడె నిఁక ఁదమ యాజ్ఞ యనగ
రామ! దేహ మనారోగ్య మైమతి చెడె ॥51॥

నీ వే శిష్యులతో కా
శీవిశ్వేశ్వరు భజించి చిరతర పుణ్య
శ్రీవిభవంబందుమ యన
దేవా! గురుముఖముగాని తీర్థము లేలా? ॥52॥

తను మనో ద్వయంబిందు స్వస్థతను దప్పి
మీరలీరీతి వెతపడ మిమ్ము విడిచి
తీర్థయాత్రల కేగ చింతింపలేము
హరికనికరించి నపుడె సర్వార్థసిద్ధి ॥53॥

గురువే బ్రహ్మమువిష్ణువు
పరమేశ్వరుడీపదంబెభాగీరథిదే
శరణుశరణంబనినమ
స్కరించు రామానుజుఁగని కనులుచెమర్చె ||54||

వీనినడనుడిసత్యంబు వీనిముందు
నాప్రయత్నంబులేవియు నడువ వంచు
కలగి శిష్యులంజూచి వాక్యార్థమిందు
నడువ దీదేహమందున నలతనలమె ||55||

నాలుగైదువారంబులునడచినంత
మరల వాక్యార్థ మనగ రామానుజుండు
తప్పతక్కినశిష్యాళి తరలె కాళ
హస్తికింజేరెగోవిందుడభువుగొల్వ ||56||

రామ! ధీమధ్య నీవు సర్వజ్ఞుడైన
శంకరులసూత్రభాష్యంబు చదివిరమ్ము
మనముసావకాశంబుగ మాటలాడ
వచ్చులే, యన కేల్మోడ్చి పలికె నతడె ||57||

బ్రహ్మతత్త్వనిరూపణ ప్రతిభమాడ
శంకరభగవత్పాదుల ప్రజ్ఞ తర్క
శక్తి యుపనిషత్‌జ్ఞానము సరళశయ్య
నాన్య తోలభ్యమంచుమన్మనము చెప్పె ||58||

కానియీజీవజగములగతినెఱుంగ
వారల ధ్యేయ మేమొ తత్త్వార్థ మెటులొ!
తెలియఁజాలక మీపదంబుల భజింతు
దాసుని యభీష్టమున్ దీర్చి దనుపుఁడనగ ||59||

జీవజగములురెండును స్థిరముకావు
మాయచేబ్రహ్మమందునమనకుతోచు
మాయతొలగిన మెక్కబ్రహ్మంబెనియుచు
మాయజ్ఞానమునఁబరిసమాప్తమగును ॥60॥

అంతసర్వమాబ్రహ్మమైయలరు నంచు
ఛాందమనగ క రోపనిషత్తుకూడ
భేదమంతయుమాయచె పెరుగు నంచు
'నేహనానాస్తికించ ''ని నెలుపుననగ ॥61॥

దేవ! యిచటనే నాకుసందేహమొదవె
సర్వముఁబ్రహ్మమను సూక్తి సాంతమొ'ఱుఁగ
నేరకే ముందుతజ్జలానీలిశాంత
మనుటచూడసిద్ధాంతమేవ్యత్యయమగు ॥62॥

నీటఁబుట్టినీటనే పెరుగుచు తుది
నీటనడగు చేపనియతి బ్రహ్మ
మందుఁబుట్టిబ్రహ్మమందు ఁబెరిగిబ్రహ్మ
మందడగుచరాచరాత్మకంబు ॥63॥

నీరువేరుచేపవేరిదేరీతిబ్ర
హ్మంబువేరువిశ్వమనగవేరు
కానినీరులేక మీనంబు లేనట్లు
బ్రహ్మరహితజగతి పరగదెందు ॥64॥

సంసరణవిషయంబుల సరణిచూడ
మణిగణంబులసూత్రసంబద్ధమైన
రీతికన్పట్టుమతి విచారింప బ్రహ్మ
సూత్రమున విషయంబుల సొగసులివియె ॥65॥

భిన్న భిన్న ప్రకృతులఁ బొల్పువిశ్వమెల్ల
బ్రహ్మసూత్రంబుచేకట్టుబడియొకటిగ
కంటబడుచుండ నిదిమాయికాదు, బ్రహ్మ
మన్నిటికి మూలసూత్రమై యుంరుఁననఁగ ॥66॥

దానిచేబుట్టి దానిచేదనరి దాని
కన్యమైయుండ నేరమి లయ్య నీవు
చెప్పు మత్స్యజలో పమ చేరదిందు
తజ్జలానీత బ్రహ్మకే తగునెఱుంగ ॥67॥

అహము బ్రహ్మమయ్యె ఆత్మబ్రహ్మంబయ్యె
నీవు బ్రహ్మమైతినిజ మెఱుంగ
జ్ఞానమొకటె బ్రహ్మమైనిండద్రష్టదృ
శ్యంబుదృక్కుఁలీ త్రయంబు మించు ॥68॥

పూర్ణమునుగుణంబులముక్కఁముక్కఁలుగను
ఎఱిచిచూచెడి నీనేర్పునెఱుగమెందు
భేదమందభేదముచూపువిధమునీది
నీకుమాకుపొసగదిక స్నేహవృత్తి ॥69॥

శంకరాద్వైతసిద్ధాంతసారమీవు
పూర్తిగాగ్రహించియుదానిపొత్తు విడక
కట్టుకొనకతుకులబొంతగావిచిత్ర
పటముకల్పించుకొను బ్రహ్మవాదివీవు ॥70॥

మేమునీశిష్యవృత్తిని మే పలేము
సర్వతంత్రస్వతంత్ర త సాగునీకు
అమరనారాయణానుగ్రహముగుగాక
యంచు దూరమైపోయెనాయాదవుండు ॥71॥

పిడుగు పడినట్లు లాగురునుడులువిన్న
శిష్యరామానుజుండు నిశ్చేష్టుడయ్యె
కొన్నిగడియలకెట్టులోకుదుట (బడుచు
అల్లనల్లనవీక్షించెనఖిలజగతి ॥72॥

# అధ్యాయము - 4

సేవలోఁగల సంతృప్తి చెలువ మౌర!
ఎన్ని జన్మలపుణ్యమో యెఱుగనంచు
శాస్త్రచర్చల త్యజియించి సకలసమ్మ
తమగు హరిభక్తిలక్ష్మి ణతరుణుడలరె॥

# 4. సేవానుఖి

సృష్టికర్తయెవడో । జీవేశ్వరులతార
తమ్యమెంతో। ముక్తిదాలయెవడో।
భేదమందుప్రీతివిప్పారుటెట్టులో।
తెలుపువాడెవండో। తెలియుటెటులో? ॥1॥

కన్నతండ్రిగతించె గైకొన్నవేద
గురుడుమధ్యలో విడిచె, సోదరుడుదూర
మయ్యె, నోర్వప్పుటే నేరమయ్యెనాకు
హరిహరీ!భవల్లీలకు హద్దులేదె? ॥2॥

నారాయణుడే [illegible]రియు
నారాయణుడే [illegible]ంయు నారాయణుడా
త్మారాముడు [illegible]లక్ష్మి
నారాయణుడే మమశరణంబనుసూక్తుల్ ॥3॥

మంత్ర పుష్పమ్మునారించె మనసుదోచు
వేదవిదులకంఠస్వరంబే వినఁబడ
ప్రతిమయ్యైనాద మీద్బ్రుడిగతిపదంబు
సాగమంత్రరుద్ధ భుజంగ సరణి నిలిచె ॥4॥

వీనులకువిందుగూర్ప రామానుజుండు
పరుగుపరుగునవచ్చిదే వాలయమున
స్వామిసన్నిధినిలిచె వింజామరముల
వైచు భక్తులంజూచుచుఁ బరవశించె ॥5॥

వీరిసేవలో గంతృప్తి వీరిమో ము
లందు చెందు మహానంద మందుటెటులొ?
ఎన్నిజన్మలు తపియింప నీసుఖంబు
కల్గునో ?చదువులగర్వగంధినైతి ॥6॥

చాలయ్యా! చాలీగ్రం
థాలయముల్ తరచలేను వ్యర్థంబీ దీ
ర్ఘాలోచనములు బ్రతుకు వ్య
థాలాపంబులచెడె వరదా! దయగనుమా! ॥7॥

దాసుడనై సేవించెద
నీసన్నిధి నిలువ నిమ్ము నీవాడను నే
నే సిరులాసింపను నీ
దాసులదాసుండనన్ను దయచూడుప్రభూ! ॥8॥

ద్వారముకడనిల్చిఎచ్చిపోయెడివారి
పాదధూళి నెత్తి పైనిడుకొని
కరము మోడ్చి నిలుచు కాంచిపూర్ణుగని రా
మానుజుండు దిగ్భ్రమతనిలువగ ॥9॥

ఈతనినిరహంకార ప్రకృతినిచూడ
శంభుడేమదిలోన సాక్షాత్కరించె
ఈమహాత్ముడే నన్నుగ్రహించె నేని
జన్మసార్థకమంచు నా చరణమంట ॥10॥

వలదు వలదు బ్రహ్మవాది! తక్కువ జాతి
వాడ నేను, యాదవ ప్రవరుల
ఛాత్రవరుడ వీవు, సంస్కారశిఖివి, న
మస్కరింప తగదు మాకుమీరు ॥11॥

లెమ్ములెమ్ము విప్రశ్రేష్ఠ! లెమ్మని వెస
రెండు చేతుల, నాతని లేవదీయు
కాంచిపూర్ణుని చూచుచుగద్గదస్వ
రమున లక్ష్మణుడు కడు సంభ్రమతబలికె ॥12॥

జ్ఞానగురువుల మెప్పింప లేని అలతి
భటుడ, గుణములే బ్రహ్మమై పరగు చుండ,
జాతిమతకులంబులనెటుస్మరణసేతు?
స్వామిసేవకు నుచ్ఛ నీచములులేవు ॥13॥

వేదవాదము లేల? కన్పింపనట్టి
బ్రహ్మమునకంటె, కనపడు భక్తుడె, గురు
డైన సార్థకం బౌను నాబ్రతుకుదేవ!
దీనునిదరిజేర్పుడని ప్రార్థింపనతడు ॥14॥

కారణ పురుషుడైపుట్టు జ్ఞానివీవు
నీకు గురుడనై లో కాపనింద మోయ
లేను, వరదుడాజ్ఞాపించురీతి నడతు
వలయుసేవల స్వామినికొలువు మనగ ॥15॥

నేటినుండిమీరు పాటించు నీజలా
హరణసేవనాకుగురుపద మని
వరదుని అభిషేకజలములంగొల్వరా
మానుజు డ రుణోద యానలేచు ॥16॥

చేయువగల కొలను జేరి జలకమాడి
వార్చి మడుగుగట్టి పాత్రశుద్ధి
జేసి చుట్ట వెట్టి శిరముపై జలకల
శంబుతోడవచ్చు స్వామిగొలువ ॥17॥

నేలనంటిన కందుపాదాలవాడు
యాదవ గురుండె మెచ్చు శిష్యాగ్రణి,నృప
సేవలంగొన్నభూసుర శ్రేష్టుడకట!
కుండబట్టి కోమటివెంట గుడికి నడచె ॥18॥

పిచ్చివాడనికొందరు ప్రేలుచుండ
బడుగువాడనికొందరు పరిహరింప
నెన్నివిద్యలునేర్చిన నేమి ఫలము?
బ్రతుక లేని వాడనిప్రజవాగు చుండె ॥19॥

ఇంకనేమేమి ఘోరంబులెదుటఁబడునొ?
యీకలిప్రభావంబునూహింపమంచు
స్వామి సదనంబు కేతెంచు జనమనుదిన
మలత నిట్టూర్పులఁబడె రామానుజుఁగని ॥20॥

లోకమ్ముకనులెక్కింపడు
ప్రాకటమగుమంచిచెడ్డలనుస్థితిగతులన్
జేకొనడాత్మీయపు సే
వాకర్తవ్యమున మనసు పదరకనిల్పెఁ ॥21॥

గడియబిడువు చిక్క కాంచి పూర్ణుని జేరి
భక్తులమహిమవిని పరవశించు
కనులనీరుక్రమ్మ కరివరదాయని
ఉస్సురుస్సురంచునూర్పులవిడు ॥22॥

ఒక్కనాడుకాంచీపూర్ణుడుల్లముల్ల
సిల్ల! అయ్యా, రామానుజా! చిత్తగింపు
రంగపురిలోన రతనాలరాసులుండె
నిర్మల మనస్కులకవికన్పించునంట ॥23॥

కధలమర్మంబుదెలిసిన జ్ఞానివీవు
జగతిలక్ష్యంబునెరిగిన స్వామివీవు
ఆత్మసౌందర్యమెఱుగు ధరామరుడవు
నీకుయామునాచార్యులానిధులఁజూపు ॥24॥

అతడురంగనాధునికనులారగన్న
దివ్యమూర్తి నీవ్రగలి గుర్తించు భవ్య
పురుషుడాత్మవిద్యా పరిపూర్ణుడాళ
వందనారులదర్శింప భాగ్యమనగ ॥25॥

ఇంటగలయీమహాత్మునే యెఱుగనైతి
నీపదరజ కణమెధరియింపనైతి
నెక్కడోయున్నవేల్పునాకేటికంచు
వేడినిట్టార్పులాతడువిడుచుటెఱిఁగి ॥26॥

రామా! నీయావేదన
యేమో! యదితీరుమార్గమెటులో? వరద
స్వామియె వినిపించు వెసఁ
నామాటలు నమ్ముమాత్మనలుగకుమనగాఁ ॥27॥

ఎపుడోయదిసిద్ధించుట
యిపుడీ భక్తవరుడింటికేతేరగృహం
బుపవిత్రమౌ ప్రసాదా
ప్తి పేదల బతుకు పరమార్థవిభవంబగు నాఁ ॥28॥

యామునాచార్యుడూహించినట్టిగుణము
లితనిచర్యల స్పష్టమై తముగూర్చె
కల్లకపటమేలేని వాక్యంబుల మది
కట్టువడె, వరదుడె నన్నుకలచెనంచు ॥29॥

ఎదకరుగఁస్రవించునెదిరికన్నులచూచి
పూర్ణుడుకరుణాప్రపూర్ణహృదిని
అయ్యా! ఎత్తు, మీగృహప్రసాదంబు సే
కొందు,స్వామి పొందు పొందెద నన ॥30॥

ఆవగింజపైమహాంభోధిపడినట్టు
లాతనిహృదయంబె యవశమయ్యె
పూర్ణుపాదములకుమ్రొక్కితూర్ణంబున
గంతులిడిగృహిణీముఖంబుసూచె ॥31॥

ఇంటి కింద నారాయణుం డేగుదెంచు
అతనిభుక్తశేషము మనకందరికిని
ముక్తి షడ్రసోపేతమౌభోజనంబు
సిద్ధ మొనరింపుమా సేవ సేసివత్తు ॥32॥

వరదుకైంకర్యమొనరించి, వచ్చియింట
వంటకంబుల గమగమపరిమళాల
దెలిసి, భాగవతశ్రేష్ఠుబిలువఁబోయి
తాళబద్ధపూర్ణాలయద్వారమరసి ॥33॥

దీనుడై యింటి కాతండుతిరిగి రాగ
ని ప్పుడే కాంచిపూర్ణులీయెడకువచ్చి
స్వామిపంపగ వచ్చిలి సత్వరముగ
వంటవడ్డింపుడని నన్ను వేగిరింప ॥34॥

ఆలసించిన వరదుడే ఆగ్రహించు
దేవకార్యముదీర్ప నేపోవలెనన
చెప్పినట్లునేజేయభుజించియతడె
ఆకుదీసి శుద్ధి యొనర్చియవలికేగ ॥35॥

పెరటియావుకు శేషాన్న భిక్షనిడితి
క్షణములో వండివడ్డింతుననుసతిగని
పిలిచి భక్తులభంగించు ఖలుడనంచు
నవ్వుచుపతి, విధివిలాస మెవ్వ డెఱుఁగు? ॥36॥

చేతికందియు నోటికిచిక్కదాయె
నెదుటనిల్చినలక్ష్మినే యెఱుగనైతి
హరికృపకుదూరమైపోతి పెరటి సురభి
నైనదర్శింపఁదగునని యాతడురికె ॥37॥

మాటిమాటికి మ్రొక్కిగోమాత! ఎంత
పుణ్యమో! నీది పూర్ణుల భుక్తశేష
మమృత ధారలై యందరకంద నిచ్చి
సకల జగములకాదర్శజననివైతి ॥38॥

కాంచిపూర్ణుడే మనయింటికడపత్రొక్క
ఎంగిలాకులాతని చేతనెత్తఁజేయు
పాపినైతి క్షమింపడావరదుడంచు
ఆలయద్వార కక్ష్యలకాత డురికె ॥39॥

ఎదుటఁబడుకాంచిపూర్ణుల పదముల ఁబడి
దేవ! అపరాధినైతి నే ఁదెలిసితెలిసి
మీమతినడుపనైతి క్షమింపుడంచు
వగచు రామానుజుంజూచిబలికెనతడు ॥40॥

అన్న! దు ఖింప నేటికో? అన్నపూర్ణ
నిర్మలాంత కరణ, జ్ఞాన, నీసతీమ
తల్లిచేతి దివ్యప్రసాదంబుతృప్తి
నారగించితి బ్రతుకు సౌఖ్యంబుగంటి ॥41॥

భక్తితో కూడు జ్ఞానమె బ్రతుకుపంట
తరతరాలుగవచ్చు స్వధర్మము విడ
రాదు ఛాందపంబంచు పరాత్పర మది
సాంప్రదాయపుమర్యాదజార్చలేను ॥42॥

నీవే నేనను భావము
జీవులకున్ జ్ఞానసిద్ధి చే గల్గు సదా
నీవే గురుడనిదేవుని
సేవింపగభక్తుడమృత సిద్ధింబొందుః ॥43॥

భేదమెంత సత్యంబో। అభేద మంత
నిత్యమగు శ్రీనివాసుడన్నిటికి సాక్షి
ఆచరించిచూపెడి ఆమహాత్ముడొజ్ఞ
శాస్త్రసంజీవినీ శక్తి జగతిరక్ష ॥44॥

మధురమై ప్రేమపూరితమై పరస్ప
రానురాగ సంభరిత మై త్యాగబద్ధ
భక్తి భావమే చైతన్య భాజనం బ
హంబభేదాన నేకాకియై యడంచు ॥45।

చివరకున్నదంచు చెప్పువాడుండ డ
న్నియును వరదు డంచు నియతినిల్వ
భేదమం దభేదమే దర్శనం బై య
నంత సౌఖ్య మిందె యను భ వించు ॥46॥

# అధ్యాయము - 5

కాయకష్టోప జీవి రంగపురిఁజేరి
ఆసలడియాసలైపోవ, నాత్మవిదుని
స్పర్శ మాత్ర తో ముమ్ముడుల్ సడల ఁగానె
దివ్య తత్త్వము చాటు ప్రతిజ్ఞఁబూనె ॥

# 5. ప్రతిజ్ఞ

బండబారిన బౌద్ధము ప్రయ్యె, శంక
రుం మహామనీష మెరయు రుచిరరోగ్ర
తార్కికజ్వాల చూచి, యాదవుల కసులు
చెదరనేగాని ,యాస్వామి హృదినెఱుగడు ॥1॥

సుమముకంటె పరమపేశలముగునామ
హాత్ముని రసార్ద్ర చిత్తంబునందుడుంగు
జాహ్నవీ పయ కణముల సారమనుభ
వింపవలెగాని మధియింప విషముపుట్టు ॥2॥

త్యాగమై తన్య శక్తులయోగమందు
నిత్య సత్య స్వరూపుడై నిర్మలుడగు
శంకరభగవత్పాదు సర్వంక షప్ర
భుత్వమల్పజ్ఞ డేరీతి పొందనేర్చు ॥3॥

యాదవస్మృతి హరిసేవ నణఁగిపోయె
నాటినాప్రార్థన ఫలించె నాకె కాదు
అందఱకు నన్ని వేళల హాయిఁగూర్చు
రామునింజూడ, నాశలోయామునుండు ॥4॥

చెంతగలమహాపూర్ణుని చేరఁబిలిచి
నాథముని తాత పాదుల నాటినిధుం
రక్షసేయ రామానుజ ప్రవరుడొకడె
దిట్టయాతని కీవార్తఁదెలిపి, నీవు ॥5॥

వెంటనే పిల్చుకొని రమ్ము వెడలుమనగ
ఆజ్ఞయని మహాపూర్ణుడహరహము పయ
నించి, వరదరాజస్వామినేతలచుచు
కంచిచేరి, కాంచీపూర్ణుఁగాంచి, మ్రొక్కి ॥6॥

ఉన్నదున్నట్లు లీరీతియూడి పడితి
సేమమే మన యామున శ్రీగురులకు,
అంగరంగభోగంబులారంగనికి, య
థాప్రకారంబుచెల్లుగదాయనంగ ॥7॥

స్వామిసేవ కిందాకలోపంబు లేదు,
ముందుకెట్టులో యనుచింత, ముదిమి, గవియ
క్రుంగదీసెను యామున గురువతంసు
నిచ్చటస్థితిగతులింక నెట్టు లో? యన ॥8॥

మనరామానుజుడిట ని
ర్గుణ శృంగికి యాదవునకు కొలకుడువడకే
అనుదినముజలాహరణం
బొనరించుచు భక్తి వరదునుల్లముదోచెన్ ॥9॥

అంతెకాదు యాదవ బంధ మతనికి తెగె
బ్రాహ్మణాద్య హంకారముల్ పట్టవతని
అహము దాసోహ మై కాయకంబునపడి
వరదునర్చించ సేవించు భాగవతుల ॥10॥

విని మహాపూర్ణువదనంబు విచ్చె, కనులు
వెడదలయ్యె మహాత్ములునుడులు సత్య
మయ్యెశంకయేలేదు, రామానుజుడిక
రంగనిధులకు శాశ్వత రక్షకుడన ॥11॥

ఏ మేమీ! యామునులే
రామానుజురంగపురికి రమ్మనిరే, యీ
శ్రీమద్వైష్ణవ ధర్మం
బీమహి దీపించుసమయ మేతెంచెనొకో! ॥12॥

ఎగిరియెగిరిగంతులువైచునెదుటనున్న
పూర్ణుకౌ గిటబంధించు ముందువిన్న
గురునుడుల మఱిమఱి వినగోరు, కాంచి
పూర్ణు (గని, మహాపూర్ణుడు పూర్ణ మతిని ॥13॥

సతమువరదరాజస్వామి నతినుతిగల
నిన్నెయింతగామురిపింప నేర్చిన మహ
నీయుడాతడెట్లుండునో నేడె చూడ
వలెననెడి గురుభక్తుని పాఱ(జూచి ॥14॥

చూపింతుకారణ పురుషు
రేపే నిశ్చింతగ నిదురింపుమ! యని కాం
చీపూర్ణుడు శయనించె, మ
హాపూర్ణుడు గురుని మహిమ నాత్మదలచుచు(౯ ॥15॥

వఱువాతలేచి వరదుని
స్మరియించుచుమనమలరగ చల్లనిమలయా
నిలములె పైబడ నిరువురు
పరిమళపద్మాకరమును (బరికించిరట(౯ ॥16॥

పక్షులకలకలము, దినప్రభునిరాక
దెలుప, పదనఖప్రభలు ప్రాగ్దిశకు పార
చుక్కలు మలికొండగుహల(జొరబడంగ
సరసిబుడబుడసవ్వడి స్పష్టమయ్యె ॥17॥

జలకమాడగకల్గిన సన్వడియిది
ది వ్వడీతడే యామునో ద్దిష్టమూర్తి
చూడుమ్మాయని చాటుగా చూపి కాంచి
పూర్ణుడు వరదు గొల్వమునమ్మందుకురికె ॥18॥

కంచికేకాదు నిఖిల ప్రపంచమునకు
వరద! వరదుడై వెలుగొంద వైష్ణవ ప్ర
బోధమగునట్లు రక్షింపు మో, ప్రసన్న
సుందరాంగురామానుజు నూదిననగ ॥19॥

వరదుని విశాలనే త్రాలకరుణతో ణోకె
కంఠమందున్న పుష్పమ్ము గ్రక్కునబడె
కాంచిపూర్ణునిమేన పుల్కలుజనించె
నిటమహాపూర్ణుడు సరసీతటమునందు ॥20॥

స్నానమాచరించి, సంధ్యనార్చి, సవిత్ళ
మండలన్నహరికి, నమస్కరించి,
తడిమడుగు నడితలనిడి నిండుకుండ, సం
క్రాంతిదాసరివలె కదలివచ్చె ॥21॥

అమహోన్నతునట కనులార ఁజూచి
యితనిచేతలాళ్వారులనెదుటనిలిపె
ఈశిరఃకలశ మజాండమెత్తె పట్టు
శేషఫణిపణారత్నమై సేవ్యమయ్యె ॥22॥

దైన్యమీచూపు లెవరినో తరచు చుండె
నమ్రభక్తి, యజ్ఞాతసౌందర్యమంద
జేసె, విశ్వగురుండని చెప్పె నాత్మ
అమ్మ హాపూర్ణునానంద మవధిదాట ॥23॥

వాఙ్మనోతీత నాదమా! వందనంబు
వాఙ్మన కారకా! నీకు వందనంబు
మహాదనంతవిభూతి నమశ్శతమని
పరవశతమహా పూర్ణుడు పాడుకొనగ ॥24॥

కట్టువడిన ఫణిగ కాలుకదపక రా
మానుజుండు గీతి నాలకించి
కనుల నీరుగవియ కడవక్రిందికి దించి
ముందుకేగి మ్రొక్కి పూర్ణుతోడ! ॥25॥

ఎవడవయ్య నీవు? ఏటి కీతటమందు
తిరుగుచుంటి నేదొ! మరులుగొలుపు
మధుర వేదన నను మఱపించి యెటకొ నీ
డ్చుకొనిపోయె నీదుసుస్వరమన ॥26॥

అయ్య! యిది యామునాచార్య నాత్మగీతి
నిన్ను చూడనేదో శక్తి నన్ను నలమె
గురుని భావంబులే మదిగుబులు కొనగ
తెలియరాని రాగంబులగళమువినిచె ॥27॥

నీవు వరదుని కైంకర్య నిధివో! కాంచి
పూర్ణులకు ప్రేమ పాత్రుడవో! ప్రసిద్ధ
భక్తరామానుజుండవో! పలుకు మనగ
తలనువంచిదాసానుదాసులకు తొత్తు ॥28॥

ఆళవందనారుల మహిమాద్భుతములు
వినుటయేగాని యిపుడె యావిమలచరితు
ననుభవానంద గీతిక ఆత్మనంటె
అతని దర్శింప నీయల్పుడర్హుడె? యన

దానికింత విచారంబుతగదు నీకు,
స్వామికనుల సదానీవె సంచరింతు
నేదొ! దైవయోగమిది రండిపుడె గురుని
యామునాచార్యుదర్శింత మనవలందు ||30||

తనువు కంటె ముందు మనమురుకగ, కల
శంబు వరదు పాదసన్నిధినిడి
కాంచిపూర్ణుజూచికరమెత్తి దేవ! యా
మునులదర్శనార్థ మురుకుచుంటి ||31||

వెనుతిరుగకే మహాపూర్ణు వెంటనంట
నింట చెప్పకే చేయకే యిట్లు వచ్చు
టుచితమేయన గురువులయూడిగంబె
ఆద్యకర్తవ్యమన్న రామానుజుం గని ||32||

పూర్ణుడానంద పూర్ణుడై ముందునడచె
గమ్యమో రెండుమూన్నాళ్ళ గడవులోనె
చేరుకొనిరి పురంబెల్ల చేష్ట లుడిగె,
కదలికదలని కావేరిగట్టునిండె ||33||

జనము గుంపులు గుంపులై సాగుచుండ
బాష్పజలములకావేరి వరద పెరిగె
ఏటికోయని యిర్వురు వెగబడంగ
అమరుడయ్యె యామునుడన్న వార్త వినిరి ||34||

క్రింద బడెమహాపూర్ణుడు స్మృతితొలంగ
కుప్పకూలె రామానుజుండప్పు! యంచు
లేచియుంపరపూర్ణుని హెచ్చరింప
ప్రాణమున్ననిశ్చలు జూచి రంగ! యనుచు ||35||

చల్లనీర్జల్ల కన్నులనల్ల దెరచి
గుండె బిగబట్టి రామానుజుండు బ్రతికి
నపుడు మిము జూచు భాగ్యంబునందనైతి
నిప్పుడీస్థితిం జూడఁ బిల్పించితె నను ॥36॥

ఎదను తన్నెడి దుఃఖంబు పెదవులడప
గాక గురువులకడసారి గాంచవలదె?
పదపదమని బుధ జనంబు పరువులిడగ
ఖననదృశ్యమాయిరువురుగాంచిరంత ॥37॥

యోగవహుడైనకాలజ్ఞుడో! గురుండు
భక్తిఁబరవశించిన మహాభాగవతుడొ!
చీకుచింతల పోద్రోయుచిద్విలాసు
డో, సుషుప్తిఁ దేలుమహాత్ముడో,యనంగ ॥38॥

నిర్వికారస్థితింగల నిజమెరుంగ
అనిమిషుండౌచు తన్ని రంజన విభూతి
అనుభవించెడియోగిరాణ్మణియటంచు
లక్ష్మణుడుగురునఖ శిఖల ఁబరికించె ॥39॥

దక్షిణకరాంగుళత్రయి తప్పి వశము
చిత్రమైముడుచుకొనుట చింత జేసి
బ్రతికినప్పుడీవ్రేళ్ళ లో పంబుగలదె?
అనగ లేదులేదంచు శిష్యాప్తులనగ ॥40॥

కాలమాసన్న మయ్యెనీకాయమునకు
కానియేవో? బలీయమౌ కాంక్ష లీ మ
హాత్మునందు లీరమియిటులయ్యెగురుని
వాంఛలెరిగిన ఆప్తులెవ్వరనిచూడ ॥41॥

చుట్టు పట్టుల భక్తుల శోకముబుక
గురుని యాంతరంగికశిష్యులరుగుదెంచి
తెరలు తెరలుగ దు ఖంబు, పొరల నప్పు
డప్పు డూర్పులెగయ గురుండాడునిటుల ॥42॥

ఆపరాశరవ్యాసులే యనుసరించు
వైష్ణవ మతప్రచారంబు, బ్రహ్మసూత్ర
ములకుసరికొత్త భాష్యంబు, పొల్పుగులిరు
వాయ్మడికిభాష్య మెప్పుడో వ్రాయుటయన ॥43॥

క్రొత్త కాంతి రామానుజకొనకనుల మె
రయ తనకు తెలియని యొకప్రాభవంబు
పట్టియాడింప కేల్మోడ్చి వరద! యంచు
మూడుమారులాగురువును ముట్టి చుట్టి ॥44॥

జీయ! మీయనుగ్రహమున శ్రీహరికరు
ణింప నుత్సుకతసహకరింప, తమత
లంపులన్నియు విశ్వకల్యాణకరము
కాగ సాధింతునంచుబిగ్గరగఁబలుక ॥45॥

ఒక్కటొకటిగ వేర్వేరునుచ్చరింప
ముడుచు కొన్న కరాంగుళుల్ మూడుకూడ
ఒక్కటొకటిగ విరబారె ప్రక్కనున్న
శిష్యులత్యద్భుతానంద శిలలుకాగ ॥46॥

యామునాచార్య సూక్ష్మ దే హంబు తృప్తి
పొందె నతడుసాధింపుతపో బలంబు
స్పర్శ మాత్ర రామానుజా సంక్రమించె
తరమె గురుశిష్య బంధంబుతలప మనకు? ॥47॥

ఆళవందనారుల కను వైన అమృత
పుత్రు డీతడే యీపీర మునకు నుత్త
రాధికా రియి తడె యని ప్రజ నుతింప
ఏటిలో శుచి స్నాతుడై యెగబడంగ ॥48॥

రంగనాధుని దర్శింపరావె రామ!
యనుమహాపూర్ణుజూచి క్రోధాత్ముడగుచు
నాగురుని నాకు చూపక నాచుకొనిన
కర్కశుని చూడలేనంచు కంచికేగె ॥49॥

ఆగమోక్త ప్రకారంబు యామునులకు
ఖననకార్యంబు ముగిసె భక్త తతిబాష్ప
జలము లురికెడి నదికి వెచ్చదనమిచ్చె
కర్మసాక్షి తాగదలక కదలు చుండె ॥50॥

గురుడు గురుశక్తి గురుతపోబలము కడకు
గురుని తనువునే నిల్పక కూల్చివైచె
నాదినాశక్తులనుమాటనవ్వులాట
స్వేచ్ఛయేలేదు జీవికి జీవితాన ॥51॥

సూర్యచంద్ర నక్షత్ర సంశోభితమగు
గగనము చరాచరంబగు జగముతుదకు
ప్రకృతి కూడ తనంతతా బ్రతుకకాదు
జీవజగములరెంటికిన్ స్వేచ్ఛ లేదు ॥52॥

రెంటిని నడపించుకంట బడక, బుద్ధి
కందరాక రంగడాడుచుండె
సృష్టిఁజేసి పెంచి చివరకు చిటికెలో
మమ్ము త్రుంచు నేటిబొమ్మలాట? ॥53॥

నీకు చెలగాటమౌగాని మాకు ప్రాణ
సంకటము దేవ! తత్త్వ విచార మిచ్చ
డాత్మకంటదు రాతిగానైన నన్ను
పుట్టనిచ్చిన నీ బాధ పట్టకుండె ॥54॥

నమ్మి సేవింప పూజింప నయనసుంద
రముగదినదినము కులుకు రంగడె నను
చేరఁ బిలిచి సట్టేటిలో జారవిడిచె
నింకనెవరితో నేమని యేడ్వగలను? ॥55॥

మౌనియైయిల్లు వీడి రామానుజుండు
మఱిమఱిమది యామున గురున్ స్మరణసేయ
తట్టుకొనగాకొకకొలని గట్టుజేరి
రాలవిసరుచుజలతరంగాలమునిగె ॥56॥

యామునాచార్యుడువికుంఠధాముడయ్యె
మాన సోద్వేగి యౌచు రామానుజుండు
యింటికేతెంచె నని వింటి కంటబడడు
వరద! నీభక్తు నీరీతి వదల దగునె? ॥57॥

ఆ హృదయమతికోమలంబన్యుల పరి
తాపమున్విన లేని యార్ద్రస్వభావ
మకట యిప్పుడే మయ్యెనో! యనితపించి
కాంచిపూర్ణుడు గాలించె క ంచినెల్ల ॥58॥

దరులదన్ను నాకోనేటి సరసినరసి
చరమ సూర్యనారాయణస్వామికెఱగి
బాష్పతర్పణంబొనరించె భక్తుడంచు
పూర్ణుడలనల్లచేరి ముమ్మందునిలువ ॥59॥

శూన్యదృక్కులు యామున జ్యోతి యకట
మాట రాక లేగవలె, యంబాయటంచు
పూర్ణపాదాల పైఁ బడి బోరనవిల
పింపనాత్మీయునెదఁజేర్చి ప్రీతి నతడు ॥60॥

ముంగురులుదువ్వి కన్నీరు పోదుడుచుచు
వెన్నునిమిరి రామానుజా! వెఱవకయ్య?
కర్మబంధమ్ములెంతటివారికైన
అనుభవింపక దప్పదీయవనిలోన ॥61॥

వింటినయ్య! సర్వంబును కంటినయ్య!
పరమకల్యాణమూర్తి! నీవంతమేమొ!
అస్తమించెడి రవిగూర్చియడలనేల?
పుట్టుపూర్ణేందు చూడగముందు బడుమ! ॥62॥

ప్రకృతిబంధమ్ములున్నంతవరకు ప్రాణి
చావుపుట్టువులకు చిక్కి సతమతమగు
అమృతబంధానజగతికల్యాణమగుట
హరికృపాకటాక్షమని ధృడాత్ముఁడలరు ॥63॥

యామునశరీర మీస్సృష్టినడగి పోయె ,
అతనియాత్మ సర్వాత్మకే యంకితమగు
తెలిసి తెలియకేయిటులీవునలగదగునె?
కలసి కట్టుగా శ్రమియింప కలదుసుఖము ॥64॥

బ్రహ్మతత్త్వంబుదెలిసిన బ్రాహ్మణుడవు
పామరులతీర్చి దిద్దెడి పండితుడవు
నీకుబోధించువాడనే నిక్కమెఱుఁగ
జీవజగములన్నియు హరిచింతనడచు ॥65॥

సేవలో నిరహంకారచిత్తమలరు
మననమున మహత్తరమహిమయి జనించు
ఆత్మలో చిదానందంబు ననుభవింతు
అమృతబంధాన హరిపదంబందవచ్చు ||66||

లెమ్ము కర్తవ్యనిష్ఠ కార్యమ్ముదీర్చి
యామునుల మనోభీష్టమ్ము నోముమనగ
పంతమాత్మలోమెదల నాపదములంటి
కాంచిపూర్ణునితో తానుకంచి (జూచె ||67||

యామునాచార్య సంకల్ప మద్భుతముగ
ఆత్మదీపింపవరదుని ఆలయాన
కరుగుదెంచి పదువున దేవా! క్షమింపు
మంచు హరిసేవ సర్వంబు నతడుమఱచె ||68||

# అధ్యాయము - 6

సారసంసార మెల్ల ని స్సారమయ్యె
సతియె అనుకూలవతిగామి సన్య సనమె
వరదుడిచ్చె రామానుజప్రవరుడంత
విశ్వసంసారియైయతివిభవమందె ॥

# 6. విశ్వసంసారి

వరదునికైంకర్యపుతెరు
వరి, హరిభక్తిప్రపత్తిపండించు గృహ
స్థు రమా పతియేగతియని
మరలతిరిగె లక్ష్మణుండుమామూలుగతిన్ ॥1॥

ఒక్కపరి పరిచారకుండొక్కడింటి
ముంగటికివచ్చి తూలుచు పొట్టచూప
వీనికే మైన తినపెట్టు జ్ఞానయనగ
లేదులేదనియిల్లాలుచీదరింప ॥2॥

లోనికేగిదేవతానివేదనకు సి
ద్ధమగుపాలు పండ్లుతత్క్షణంబు
తెచ్చి వానికిచ్చె తృప్తిదీపించునా
కనులలోవరదుని గాంచెనతడు ॥3॥

కావుకావుమంచుకాకులుమూగగ
పెరటికేగియతివ చలిదిచల్లు
చుంటచూచి కొంతయుంటికూనకు నిల్పు
పళ్ళెరంబు చూచి పలికలంగె ॥4

గ్యాన యీకాకి పిట్టలకంటె సాటి
వానియాకలి దప్పులే పలుచనయ్యె
భూతబలిగుడ్డి దై పోయె, బోనమకట
లేదనతగునే? నీయట్టిగృహిణికనఁగ ॥5॥

ఆశ్రితప్రాణులన్ విడనాడి పరుల
కిందు సద్ది పెట్టగ తమి యెడదనొచ్చు
నంచునిటులంటి మీకెదురాడలేక
అనగ ఛాందస సాంప్రదాయమిదియింతె ॥6॥

సత్యమెఱిగినన్ ప్రజలయలవాట్లు త
ప్పింప గాదు వేదవిదుల్కైన
కాంచిపూర్ణుజేరికరమెత్తిమ్రొక్కుచు
గురుడుగాని గురునికొలుతుననగ ॥7॥

నీమనంబులో నిరతంబు నిలిచి కలచు
ప్రశ్నలకు భగవానుడే బదులుచెప్ప
స్వామి సేవయే మనకు సర్వార్థసిద్ధి
నమ్ము మని కాంచిపూర్ణుడు నచ్చుచెప్పి ॥8॥

పోయి వరదరాజస్వామి ముందు నిలచి
దాసుల నుపేక్ష సేయుట ధర్మమె? నిను
నమ్మి చెడిన వారీకులాన జనియింప
రిందఱుక వరద! కనికరింపు మయ్య! ॥9॥

నాది నేనని పై బడినడువ డెపుడు
అనుసరించునే గాని తానగ్రజుండు
కాడు సమదృష్టినెల్లరు కలిసి నిన్ను
సతతమర్చించు నే గానిజారు కొనడు ॥10॥

దేవ! నిర్వంచన మగునీ సేవ! లోన
తా మఱచుగాని యేటికోలరిగమేను
అతని వెతలేవియోనీవ యె ర్పనలయు
దినదినముదిగజారె లక్ష్మణయతుడని ॥11॥

వరదుని కనుల తనకనుల్ కరగిపోవ
అంతరాత్మప్రబోధాననాత డె ఆ గె
పరవశుండై వరద! భక్తవత్సలా! ద
యానిధే యన నెదుటి రామానుజుఁగని ॥12॥

అన్న! ముడివడి విడలేక యాత్మకలఁచు
నీదు ప్రశ్నలన్నింటికి నేడుబదులు
వచ్చెనిలనర జాతి యవశ్యమనుస
రింప దగు హరివాక్యంబులెరుగుమయ్య ॥13॥

తానె పరతత్త్వ, మింభేదమే నిజంబు,
ముక్తికి ప్రపత్తియొకటియే మూల బలము,
యున్నత గుణప్రపూర్ణుడైయుర్విననొప్పు
శ్రీమహాపూర్ణుడే నీకు చిద్గురుండు ॥14॥

మరణ కాలాన భక్తుడు మఱచిన, నను
నేనుమాత్రము తప్పక వానికి పర
మ పదమిత్తు ప్రారబ్దకర్మవశమైన
దేహమీఁగి నపుడె ముక్తి తెలియుమయ్య ॥15॥

అమ్మ హో వాక్కులవిని రామానుజుఁడు భ
విష్య పదమేదొ స్పష్టమైవెలుగులీన
వరదునీరీతి ఁబలికించువారుకలరె?
భక్తుడనకాంచిపూర్ణుడే భక్తుడిందు ॥16॥

మఱిమఱినుతింప నాల్కకుమాటరాక
పూర్ణుపదములగట్టి గాపాదవి పట్టి
బాష్ప పుష్పాల నర్చించి పైకి లేచి
తనకు తాతెలియకయె నృత్యంబొనర్చె ॥17॥

నామనంబునెప్పుడునలిపెడి తాత్త్విక
ప్రశ్నలకిటుతగు జవాబువచ్చె
నడవనివరదుండె నన్నిటనడిపించె
పలుక నట్టిప్రభుడె పలికెనిపుడు ॥18॥

వరదకైంకర్య మిందు సాఫల్యమందె
స్వామివాగ్దేవి మద్గురువరుని చూపె
లక్ష్య సాధనకాత్మ బలంబు నీవ
యనగ పూర్ణుడాతని కను లార జూచి ॥19॥

యామునాచార్య పీఠంబునధివసింప
పుట్టినమహాత్ముడవు మహాపూర్ణగురుడె
నిన్ను శంఖ చక్రాంకితనియతుఁజేయు
ననగ గుడిలోని ఘంటలేగణగణమనె ॥20॥

యామునులులేని కొఱతశిష్యాళినలమె
రంగపురినెల్లకలచె శ్రీరంగనాథు
సన్నిధానమేయింక సరణినడచె
జీవజనములుబెంచును చేవదప్పె ॥21॥

ఎప్పుడెప్పుడేసేవ యెట్లెట్లుజరుగ
వలెనో! యటులనే స్వామికి జరుగుకాని
బ్రతుకులోరక్తి సేవలో శ్రద్ధతరిగె
శిష్యులీలోటుదీర్పకాంక్షించె ॥22॥

రామానుజుడొకడెయరుదు
యామునహృదయాభిరాముడందరి యెదకే
ప్రేమాంకురమాగమనిగ
మామృతమేఘము నిరంతరాంతర్ముఖుడౌ ॥23॥

మనసుదెలిసి ధర్మమార్గంబు చూపు సం
ఘమును హరిపథంబుకడకుద్రిప్పు
శక్తి సంస్కృతిగల సమయోచితప్రాజ్ఞ
డతడె నేడుమనకు నాత్మరక్ష ॥25॥

యామునులమనం బాద్యంతమాత్మనెరిగి
యతని తత్త్వంబు సాధింప ప్రతినబూనె
నిత్యసత్యవ్రతుడు సదా నిర్మలాత్మ
డతని నెటులైన నిటజేర్చుటందఱుగుటే ॥26॥

గురుభక్తికలదు కానీ
గురుపీఠము నధివసింప కూరునా! లేదో
పరమార్థజ్ఞాని జగ
ద్భరితార్థమునకతనిమది తలచునొలేదో! ॥27॥

కంచివిడివచ్చె గురుని సంస్కార సరణి
చూచెయామునా భీష్టంబునేచితూచె
సర్వమీడేర్ప శపథంబు సలిపెకాని
రంగనితిరస్కరించె విరక్తుడగుచు ॥28॥

అతనివైదుష్యము ప్రవృత్తి యాత్మశక్తి
సున్నితహృదయమిందాకసుంత దెలియు
మన మహాపూర్ణుడె కడు సమర్థుడిందు
నీతనిమతిమార్చి రంగనియందఁజేర్ప ॥29॥

ఆళవందనారు లాంతరంగిక శిష్యు
లిట్లు నిశ్చయించి యెంతకాల
మైనవేచియమ్మహాత్ముతోడ్తెమ్మన,
పూర్ణుడుపయనించె పొలతితోడ ॥30॥

రంగపురిఁజేర రామానుజుడట కాం
చీపురంబుసేర శ్రీమహాప్ర
పూర్ణుడిట కదలగముందయ్య మధురాంతి
కమిరుపురిని ఁజూచె ఘడియలోనె ॥31॥

వరదాయని రామానుజు
డెఱఁగగ రంగాయనియెదయెదకెత్తుకొనెఁ
గురుడుమహాపూర్ణుండా
హరిలీలావిభవ మెఱుగ నద్భుత మనగాఁ ॥32॥

దేవ! శ్రీవైష్ణవాగమదీక్ష నన్ను
శిష్యనింజేసి చరితార్థు చేయుడనగ
అయ్య! రామానుజా! వరదయ్య సన్ని
ధి సుముహూర్తాన దీక్ష పొంద శుభము! యన ॥33॥

కంచి కేగి ముహూర్తపుగడియ చూడ
కాలహరణమౌ దేవ! దీక్షకు, శరీర
మెప్పుడేమౌనొ! యెవ్వడూహింపగలడు?
హరికృపకుదేశ కాలాల హద్దులె? యన ॥34॥

మంచిది కుమార! దరినున్న మడుగులో జ
లకము లాడి, సీతారామలక్ష్మణాల
యాన ముగ్వుర ప్రార్థించి యండనున్న
వకుళ వృక్షంబుసేరుమా వత్తునిపుడె ॥35॥

వెంటవేమహాపూర్ణుడు విధివిధాన
మెఱిగి, ముద్రపలక యగ్ని సెరగున శుచి
జేసి దేహాభిమానంబు చెరగ శంఖ
చక్ర చిహ్నాల నతని వైష్ణవునిఁజేసి ॥36॥

శంఖచక్రాంకితమునవైష్ణవము శంఖ
మాత్మశక్తి మేల్కొల్ప, జన్మాంతరాల
పేరుకొన్నట్టి నిజయహంకారమడచి
జ్ఞాన మొ సగె సుదర్శన చక్రమపుడు ॥37॥

పైఁబడునరిషడ్వర్గాల పారద్రోల
వైష్ణవోచిత బాహువుల్ ప్రకృతిగుణము
లార్పనూర్ధ్వ పుండ్రములు ఫాలానమెరయ
లక్ష్మణుడులక్ష్య లక్షణ ప్రభుతమెరసె ॥38॥

ధర్మ పత్నితో పూర్ణుడు దండనిలువ
గురువరుడు శ్రీనివాసుడైగోచరించె
లక్ష్మణుడు పులకిత శరీరాంగుడగుచు
ఆదిదంపతులని మ్రొక్కె నధిక భక్తి ॥39॥

కేలుమోడ్చిదేవా! కొంతకాలమైన
అతిథిదేవులైయాత్మ గృహాంతరమున
వైష్ణవ శ్రీలనీచిన్నవాని తీర్చి
దిద్దిపాలింపుడంచు ప్రార్థింపఁగానె ॥40॥

పంచ సంస్కార విధులతో బాహ్యమెల్ల
భక్తిగామార్చు వైష్ణవ ప్రభుడవీవు
గురుల భుక్త శేషాన మాకున్ ప్రసాద
కాయములభించునిదెరండు కంచికనగ ॥41॥

రంగ! నీలీలలెరుఁగ చిత్రాతి చిత్ర
మయ్య దుష్కరంబన్నది యతిసులభము
సులభ మన్నది కష్టమై కలఁచునంచు
కంచికే తెంచె పూర్ణుడు కాంతతోడ ॥42॥

శిష్యునిగ్రహసీమ చీలిరెండయ్యె, నొ
క్కటి గురునకు మఱియొకటితనకిరు
వురికి బలమొకటియె హరి పరమార్థమే
ఒకటి రెండురెండునొక్కటయ్యె ॥43॥

శ్రుతుల తత్త్వము ద్వయమంత్ర శోభితమది
సంతతమననధ్యానాది సాధనముల
సచ్చిదానందమూర్తి సాక్షాత్కరించు
భక్తవరులకు వైకుంఠ పదమునిచ్చు ॥44॥

ద్రవిడదివ్య ప్రబంధాల దాగియున్న
విరహభక్తిలో వేదనా పరవశమున
సఖ్యవాత్సల్య మధుర ప్రసన్నగుణము
లన్నియు హరిదివ్యావస్థలై ముదమగు ॥45॥

ఋషులయుపనిషత్సారంబు నెల్లపిండి
బ్రహ్మసూత్రాల చేసె ద్వైపాయనుండు
ఆళవార్లప్రబంధగీతాలనెల్ల
ద్రవిడవేదాన గూర్చె నాధమునిమున్ను ॥46॥

ఆయిరువురి లక్ష్యమొకటై హాయిగూర్ప
జ్ఞానభక్తిప్రపత్తులే కలయ బండె
హరివిలాసా లనుభవింప నారునెలలు
అమృతగుళిక లై యానందమందుకొనిరి ॥47॥

ఉన్నదున్నట్టులాచార్యుకన్నతల్లి
కన్నుమూసికేశవ పద కమల మంటె
తలచితలచి పొంగెడి అశ్రుతర్పణమున
తల్లి కపరకర్మలు చేసె తనయుడంత ॥48॥

వారిబ్రతుకులందు వైరాగ్యమేక్రమ
క్రమముగ హరి భక్తి గా ఢమయ్యె
పరిసర ప్రపంచ పరిధి పరాత్పరు
శేషమై ప్రజ లస జీవమయ్యె ॥49॥

కానియింటిలో నిల్లాం(డ్రకలతపుట్టి
గురునిసేవించు నిజభ ర్త గుఱినెరుగక
మత్సరగ్రస్తయౌచుజ్ఞానాంబ యెడ ద
గురుసతీమణిన్ విడగొట్టగొట్టెఁబుసలు ॥50॥

పతియదుపున చిక్కఁబట్టిన జాత్యహం
కారమొక్కసారిగ్రక్కవిషము
కడవనీటి చెంతకలహంబు పుట్టె నా
యిరువురఁగని వీధి విరగ నవ్వె ॥51॥

గతిలేక పరులపంచల
గతుకుచు నాచారమెఱుగక బృహచ్ఛరణా
న్వితులగు మీకేగతి యు
న్నతమగుమావడమల సుగుణమ్మలవడుఁ ॥52॥

ఈయపశ్రుతి గురునిలేతహృదిని తాక
భార్యతోరంగపురి జేరె, భక్తుడీ యు
దంతమాద్యంతమెఱిగి తాతాళలేక
పత్నినేత్యజింప వరదు పదముదలచె ॥53॥

సహజసాశీల్య వతియయ్యుజ్ఞాన మద్గు
ణంబులకనువుగా నింట నడువదీ య
హంక్రియాభిమానముపరి త్యాజ్యమంచు
పోవిడిచె నతం డామెనుపుట్టినింట ॥54॥

వచ్చివేవేగ వరదుని పదములఁబడి
దేవ! బంధంబులన్నియు త్రెంచితీవ
వాఙ్మన కాయకర్మల ప్రభుడవైతి
సన్యసనమొక్కటే నాకు శరణమింక ॥55॥

అయ్య! నీ యాటబొమ్మనై యాడుకొందు
స్వామి! నీచేతి చిలుకనై పాడుకొందు
జీయ! నీయింటి ముంగిట సేవసేతు
వరద! నీదాసకూటాన బ్రతికెద నన ॥56॥

ఉన్నదున్నట్టు పెనుగాలి యుద్భవించె
స్వామి పై నున్న పీతవస్త్రంబు లేచి
భక్తరామానుజ శిరంబుపైఁ బడంగ
కాంచి పూర్ణుడు వరదుని కంఠమయ్యె ॥57॥

లక్ష్మణా మదీయాంబర ప్రభలగంటి
అస్మదీయోజ్జ్వలమగుకల్యాణ గుణము
లవని పై విశిష్టాద్వైతమంద చాటు
మా త్రిదండసన్యాస మే అనువునీకు ॥58॥

అర్చకుండిచ్చు కర్పూర హారతిగొని
చల్లఁబడికాంచిపూర్ణుడు శాంతి దాంతి
దనరయతి రాజపాదపద్మములముట్టె
భక్తబృందమ్ములాతనివరుస నడచె ॥59॥

# అధ్యాయము - 7

ప్రకృతిజీవులాయాత్మ పరస్పరప్ర
ణయ పవిత్రీకృతరసబంధమ్మెనుభ
వజ్ఞుడై జగదాచార్యభద్రపీఠ
మధివసించె రామానుజుండవనిమెచ్చ॥

# 7.గురుడే శిష్యుడు

చేతనాచేతనాత్మక సృష్టియెల్ల
నీశ్వరాధీనమై మదికింపుగూర్ప
యతివరుండాలయంబున కనతిదూర
మందె నొక్కకుటీరంబు నాశ్రయించె ॥1॥

మనసు తెలిసిన మేనమామ యుచితజ్ఞు
డాశ్రితజనప్రియుండుధర్మాభిరతుడు
కట్టుకొన్నయిల్లాలినే చెట్టవిడిచె
యేమి వైపరీత్యమొ యిదియెరుగమకట! ॥2॥

జీవకారుణ్యమూర్తి సృష్టిరసజీవి
ఆజగన్నాధు పాదపద్మామృతంబె
సతతమున్ గ్రోలువానికీ సన్యసనమె?
ఋషులు సంసారసారసౌహృదులుగారె? ॥3॥

మఱువ లేక మామమధురంపు చేష్టలు
సున్నిత సుకుమార సుందరగృహ
ధర్మమాత్మదలచి దాశరథి యెటులై
న జేతగూర్పదలచి నడచిరాగ ॥4॥

నింగిలో నీల నీరద నిభుని తరచు
గాలిలో వైష్ణవ ప్రభాగరిమ నరయు
వెలుగులోదర్శనజ్ఞాన విభవ మందు
పరవశుండౌచు యతి హరి ప్రకృతిమునుగు ॥5॥

ఎచటనోపడియున్న నన్నిటకులాగి
అలరుగంధానిలంబుల, యండ (జేర్చి
రంగురంగులమురిపించి, రక్తియమృత
మొసగు పద్మప్రియాయని మ్రొక్కుహరికి ॥6॥

శూన్యమున సూర్య చంద్రుల సుకృతి నీవె,
సంధ్యలోరాగభోగాల సరసివీవె
నింగినేలలచైతన్యనేతనీవె
నీవ నారాయణుండంచునిజముగంటి ॥7॥

తలిరుల(గని తటిల్లతా తారలంచు
కలువల(గని కనీనికా కాంతులంచు
సర్వమాశ్యామసుందరు సంపదలని
యతి రససమాధి(బడె శ్యామలాంబరమున ॥8॥

నిలిచి, చెవులనిక్కించి, దృక్కులుచలింప,
నిది చిరపరిచిత స్వరంబే యని మును
ముందుకుఱుకు దాశరథి ప్రఫుల్లనేత్రు
డై యపూర్వమద్భుతమంచునాగిపోయె ॥9॥

వైరగాలుల వాసనా వశముల్త్రైయ
తిన్నపతి పదద్వయంబంటి తిన్నతిన్న
గ, కొలువ మనోజ్ఞ సాంధ్యరాగరుచిరాంబ
రప్రభలె కావుల్త్రై యతి ప్రవరు గవిసె ॥10॥

ఫాలమూర్ధ్వ పుండ్రాన ప్రాణాల నిలిపె,
బాహువులు శంఖ చక్రాల బలము (గూర్చె,
ఉరముపై బ్రహ్మముడి, కౌస్తుభోజ్జ్వలమణి
కాగ, నితడు సాక్షాద్రమాకాంతుడిచట ॥11॥

వరదుడేయోగనిద్రలో, ( బరవశించె
మామరూపాన ప్రత్యక్షమయ్యేనంచు
దాశరథి చేరి స్వామి పాదాలనంట
నులికి పడిలేచి, యలియు, ముందున్నవాని ॥12॥

దాశయంచు, నర్ధోక్తిలో, దప్పె, నన్ను
గావవచ్చుదాశరథివే, నీవనంగ
కాదుకాదు మహాత్మ! మీ పాదముల, భ
జించు నను, దాసుడనుటేయుచిత మనంగ ॥13॥

తొలుదొలుత, దూరమ్మై మాకు, మెలగితి రని
మిమ్ము నూహించి లేని పాపమ్ముగంటి,
కాని, మీరు జగద్రక్షకై జనించు
దివ్యపురుషుడవని యిపుడె, తెలుసుకొంటి ॥14॥

బ్రహ్మ వంశోద్భవుడగాని, బ్రహ్మమెఱుగ
వేదవేదాంగమహిమల విందుగాని,
చదువ నైతి పెద్దలసేవ సలుపనైతి
నేడుమీదర్శనమున సంతృప్తిగలిగె ॥15॥

నీటు ముంచిన, పాలనాన్చిన, నిక(దమ
పాదములె శరణ్యంబనివ్రాల నతని
లేవదీసివెన్ను నిమిరి ప్రీతిచింద,
నీవుదాశరథివే మాకు నిక్కమెఱుుగ ॥16॥

భక్తవరుడౌచు భజియింతు, ప్రాణబంధు
వై సదావెంటనంటెదు, ప్రణయమూర్తి
వై మముతరింప (జూతువు, వైష్ణవాంశ
సంభవుడవు చదువు లెల్లచదువునిన్నె ॥17॥

నీకు విద్యనేర్ప నే ర్పింప, నేదియున్
లేదుతండ్రి! నిన్ను దెలియ మాకు
విద్యలుండె, రమ్ము ప్రేమ స్వరూప! చై
తన్యమూర్తి! తత్త్వ దర్శనాంగ ॥18॥

బ్రాహ్మణాది సకల వర్ణముల్ నీవె, గు
ణత్రయావి భాగ సూత్ర మీవె,
నిన్నుఁ బట్టినేము నిశ్చలంబుగ ఁజరి
యింతు మని, యతివచియింపు చుండ ॥19॥

చకితాబ్జనేత్రుడై బా
ష్పకణంబుల్ కన్గొలకుల పటపట రాలన్
నికటస్థదాశరథి బ
ద్ధకరాంజలుడై నుతించె తన్మయ భక్తిన్ ॥20॥

మీమాటలకర్థంబీ
పామరుడెఱుగండు కాని భవదున్నతమౌ
ప్రేమోన్మీలితరూపం
బే మహదానందకరముమీవారి కిటన్ ॥21॥

నాటికంటె నేడె నయనాభి రామమీ
నూతనాశ్రమం బనూన ఫలము
లొసగుదేవ! యింక నొక్క క్షణము మిమ్ము
విడువలేను నన్ను విడువకుడన ॥22॥

నేను మాత్రము నినువీడి నిలువగలనె?
రమ్ము దాశరథీ శ్రీవరదుడనుగ్ర
హించు సేవాసదన మిది యెల్లరకిట
చేతినిండుగ పనులుండు చేకొనుమన ॥23॥

నేటినుండి స్వామి నిలువె నిలువు నాకు
స్వామినడయె నడయు స్వామి పలుకె
పలుకు, మాటలేల? స్వామి శరీరమీ
దాసునివరమంచు తలనువంచి ॥24॥

నిఖిల నిగమాగమవిహారి నిత్య సత్యు
డా శ్రితానేక జీవులకావరదుడె
రక్ష మోక్ష ప్రదాతని లక్ష్మణయలి
దిక్కుదిక్కుల చాటె భక్తి ప్రపత్తి ॥25॥

కూరనూరుగేస్తు కూరేశుడంబా క
టాక్షమహిముడు సతతాన్నదాత
నిరుపమాన భోగి నిరవధిక ధనాఢ్యు
డాత్మ వేది అతుల యశుడెయుంగ ॥26॥

కాంతిమతికి చుట్టంబయనంత భట్టు
ముద్దుబిడ్డ రామాంశ సంభూతుడఖిల
వేదవేదాంగముల వల్లె వేసినబుధ
వర్యుడు హరితాన్వయ గోత్రుడార్యుడతడు ॥27॥

ఆతనిగృహంబు నిత్యకల్యాణమ్మై ని
రంతరాభ్యుదయ శ్రీలరంజిల, యటి
వరునితల్లికి బంధువై బంధు మిత్ర
బృందమునకు మందారమై వెలసె నతడు ॥28॥

ఒదివసంత సంధ్యారాగ మాత్మకింపు
గూర్చు శారికాకీర పంక్తులకలకల
నాద మరవిచ్చు పూలగంధానిలంబు
లింటిబంగారు వాకిండ్లగంటలూపు ॥29॥

అతని భార్య బంగారు బొమ్మనుపమ సుగు
ణాంబురాశి అనవరత మాత్మవిభుని
చిత్తమున కనువైన సుశ్రీవిభూష
లలితవిద్యా విలాసిని, రసమనోజ్ఞ ॥30॥

తూగు విరిసెజ్జ మంచంబు తొందరింప
కాలిమెట్టెలు నిజకాంతగతినిఁదెలుప
మెరుగు చెక్కిలి చిత్తజు సిరులు చెరగ
అనుభవింతు ర ద్వైత సౌఖ్యంబువారు ॥31॥

మేల్కొని ప్రియుడు నాత్మ లక్ష్మి విలాస
మచ్చుపడ నిల్చుదేవి నుయ్యాల జూచి,
నెరికురులుగాలి కెరటాల నింగి కెగయ,
పూర్వవాసన లే వియో పొటమరింప ॥32॥

చెంతజేరి, జనం బాడు వింత వింటి,
వే ప్రియా! మన కేశవోర్వీసురసుతు
డంట, రామానుజాఖ్యుడం టావరదుడె
మెచ్చి, యతిరాజ్యమాతని కిచ్చెనంట ॥33॥

బంధు బలగమ్ములేక తా ప్రజలుగాచు,
నంట, సిరిలేకయధికారియయ్యెనంట,
సకల భూతహితుండగు స్వామియంట,
ఆ మహాత్ము జూడగ మనసయ్యె, నాకు ॥34॥

అలలఁజూచి సముద్రంబు కొలచునంట
వన్నెపెట్టక నగల విల్వలెఱుగునట
ముఖముఁజూచిజాతకము చెప్పుమహనీయు
డంట నాతడె ట్లుండునో నరయఁదలతు ॥35॥

తరతరాలకు తరుగని ద్రవ్యమున్న,
పరమ సౌందర్య రాశివి ప్రక్కనున్న
నిర్మలయశ ప్రశస్తుల నెగడుచున్న,
ఆ త్మకేదో యతృప్తి నన్నావహించె ॥36॥

అనుభవించిన కొలది పేరాశ బెంచు!
విసిగివిడనాడతలచినన్ విడదు మనసు,
జీవుడో అహంకారపు చేతి బొమ్మ,
దీనికింబ్రతీకారమే తెలియమకట! ॥37॥

పరమ వైరాగ్యమూర్తి, అప్రతిహతప్ర
భావుడుపనిషద్ధర్మ ప్రవర్తకుండు,
అహరహంబులక్ష్మీకాంతు, నాత్మందలచు
మన యతివరేణ్యుదర్శింప మనసు పడియె ॥38॥

పూలలో తేనె సోనలు పొసగినటుల
ఆలలోఁబయస్స్రంబునలమినటుల
భక్తులందు నారాయణ ప్రభలు నిండె
అమ్మహాత్ముకొల్వ తహతహపడెనాత్మ ॥39॥

తపముతోఁదనువును దండింపఁబనిలేదు
కట్టుకొన్న సతినికాదనపని
లేదు, విసుగుతోఁబరిసరాలవీడ న
క్కరయులేదనెయలి వరునిమతము ॥40॥

తత్ప్రభావంబె యిహ పరతారకమట,
జ్ఞానకర్మమార్గంబులకంటె,కడు సు
లభతరమట, క్రొంగొత్తధర్మపదమంట,
శాంతినిడునంట మనబోటి జనులకెల్ల ॥41॥

అమ్మహాత్ము సేవింపకే ఆగదుమది
కాని, యీభోగభాగ్యముల్ కదలనీవు
నీవు సహకరింపగయతిన్నుపతిఁజూతు,
నన సతిమది చివుక్కనఁ అశ్రులొలికె ॥42॥

ప్రభునికీకోర్కెలేగతి ప్రభవమయ్యె?
మీకుగానియీభాగ్యముల్, నాకునేల?
తనువునై నీడనై మిమ్మె యనుసరించు
దాసినని పతిభుజముపై తరుణి వ్రాల ॥43॥

నాకిది విడని ప్రణయబంధమని ఆత
డతివ నక్కునఁజేర్చుచునాదరించె,
తక్కిన తనయైశ్వర్యమంతయుదరిద్ర
దీనదళితులకర్పించితృప్తిపొందె ॥44॥

నిజగృహంబును సాధుమందిరము చేసె
కేశవా! కరుణాకర! కనికరింప
వే వరదయని ప్రేయసీప్రియులిరువురు
కట్టు బట్టలకంచిమార్గంబుఁగనిరి ॥45॥

అది భయంకరారణ్యంబు, నహిమ్పుగాలి
సంచరించెడిసమయమాసన్నమయ్యె,
మబ్బుమెరుపులుమార్గపుమలుపుఁదెలుప,
గుండెలుపికోపికోమని, కొట్టుకొనఁగ ॥46॥

ఉన్నదున్నట్టుల, యులికియులికి పడుచు,
వడవడవడంకెడిపడతినడలెరింగి
ఏటికీమనోదౌర్బల్యమింతి! య్యై హి
కోపభోగంబులన్నియు నూడ్చు మనకు ॥47॥

జన్మరాహిత్యమున్గోరి, సద్గురుపద
మంటఁజను, మనకీ భయంబంటు టెటులో!
దోష మేదియో! మనయందు తొంగి చూచె
నాన్ ప్రియా! మీకు పానయోగ్యంబటంచు ॥48॥

పసిడిగిన్నెనుతెచ్చితీపాత్రవలన
తస్కరభయంబుచేమదితల్లడిల్లె
బిక్కుబిక్కునపల్కనాప్రేయసీక
రష్టవస్తువున్ విసరె నిర్జనవనాన ॥49॥

పత్నినిట్టూర్పుతోపతిపథము త్రొక్క
అలిపియెటుఁగ, రెదురయిన యరుణకాంతి
కంచిజేరిరామానుజుగాంచగ, యతి
స్మిత ముఖా బ్జుడై జంటనాశీర్వదించె ॥50॥

లేనివారుత్యజించినన్ లేదుసుఖము
లున్నవారుత్యజింపగ నుండుసుఖము
ధర్మపత్నీ వ్రతుండౌచుదరికిఁజేరు
నీగృహస్థాశ్రమమె జగద్ధితఫలంబు ॥51॥

మిమ్ము ఁగూర్చి, వింటి మేగాని మీమహా
త్మస్వరూపమిపుడె మాకుఁదోచె,
నన్నుగావవచ్చిన, విదేహవిభుడవు
బ్రతుకుధన్యమంచుఁబల్కగ యతి ॥52॥

కాదుకాదుగురునికైంకర్యమర్థించు
పాదదాసులమనివంగివంగి
వారుమ్రొక్కుచుతెలిబాష్పపుష్పంబుల
గురునికాళ్ళుకొలిచి కూర్చొనంగ ॥53॥

చల్లని విభుని చూపులో చందనంబు,
తీయని ప్రభుని బలుకులో తేనె లూర!
గురుని ఆశ్రమ సేవలో కునుకురాని
సౌఖ్య మనుభవింతురు వారు సంతతంబు ॥54॥

కంటబడని విభుడుకల్యాణ గుణముల
స్పష్టమయ్యె సహజస్సృష్టిలోని
శ్రుతిపురాణకావ్యగతమైనగీతార్థ
శక్తులాశ్రమమున సంక్రమించె ॥55॥

ప్రకృతిసేవలోన పరమార్థకైంకర్య
మమృత హృదయులనుడులందె హరిని,
సహజగుణములందెసద్గురుంజూచికు
రేశుడు యతినృపుని యెదనుదోచె ॥56॥

గురుననుగ్రహమున కూరేశుడఖిల వి
ద్యారహస్యనిధులనంది, రవిని
విడని ఛాయగ, గురు విశ్వాసపాత్రుడై
విష్ణువిభవ మెఱిగి విజ్ఞుడయ్యె ॥57॥

సూక్ష్మసుందరచైతన్యశోభితుండు
పిన్నవాడయ్యు నడనుడి పెద్దయయ్యె
భక్తుడుయతి రామానుజ ప్రవరుడింది
శ్రీహరి ప్రచారధురీణ శిఖరమయ్యె ॥58॥

ఒక్క నాడు రామానుజానుల్లముల్ల
సిల్ల, హరికృపావైభవశ్రీనెరపగ
ప్రజలుకుడ్య చిత్రంబులైపట్టువడఁగ
యాదవుని తల్లి వచ్చికన్నారగాంచి ॥59॥

పరమసంతృప్తి యిలు సేరి పలుకుచు యతి
వరదుడేగాని సామాన్యనరుడుకాడు
యాదవా! పోయి చూచి రావయ్య! నీమ
నోగతవ్యాధులాద్యంతమీగి పోవు ॥60॥

ఇంతియేకాదు జన్మజన్మాంతరకృత
పాపరాసులన్నియు త్రుటిన్ భస్మమగును
ఒంటియై పోవు నీగోడు నోర్వలేను
పోయిసేవింపరా యని పొక్క, తల్లి ॥61॥

అమ్మ! నీమాట సత్యమే యైన నాడు
నేనుపొమ్మన్న వానినే నేడునాశ్ర
యించుటెట్టులో హతవిధీ! యేమిచెప్ప
నంచుతలవంచియాదవు డరుగుచుండ ॥62॥

వగవకయ్య యంచువడిపూర్ణు డెదురయ్యె
కూర్చుకొన్నధనము, నేర్చు ..
మిహసుఖాలకొదవునే గా .. ..యింప
హరిపదార్చనంబె శరణుమనకు ॥63॥

అయ్య! రామానుజాచార్యుడమృతహృదయు
డాతడే నిన్ను మన్నించియాదరించు,
శిష్యుడే గురుసేవలో శ్రీసుతుడగు
యాదవచరిత్ర ప్రత్యక్ష సాక్ష్యమిందు ॥64॥

భక్తవత్సలా! నీదియపారకరుణ
అమృతమూర్తి! నీపదమె కల్యాణ పదము
వరద! నీలీలలూహించు వాడెవండొ!
తెలియుమని కాంచిపూర్ణు డదృశ్యమయ్యె ॥65॥

శ్రుతుల క్రొంగొత్త దృక్కున చూడనేర్చె
బ్రహ్మాద్వైత్యుని చూపుతో ఁబోరదోలె
ప్రజలఁదరియింప జేసెడి బ్రహ్మమతడె
తొంటి చర్యలుమదిలోన తొందరింప ॥66॥

వేరు మనసు లేక చేరి రామానుజా!
కనికరింపు మంచుకాళ్ళ బడగ
తగదు తగదనియతి తప్పించియాదవున్
శిష్య సుతునకిట్టి శిక్షతగదు ॥67॥

గురుడవు, శాస్త్రార్థ నిధివి,
పరమార్థమెఱిగిన వేద భాస్కరుడవు నీ
చిరుతలనిటు శిక్షించుట
సరియే! యని ఆసనంబు సన్నిధి సూపన్ ॥68॥

ఆ నాడెట్లుండెనో! యిత
డీనాటికి కూడనిట్లె ఏమాత్రంబున్
తానడనుడులన్మారడు,
జ్ఞానానందమయుడంచు కనులార్పకయే ॥69॥

యాదవుడారామానుజా
నాదరమును చూచి, కంటనశ్రువులొలుకన్
వేదాభ్యసనంబేటి కి ?
యాదివ్యసపర్యలందె, నీశుండుండన్ ॥70॥

అనిమైమఱచెడి గురువ
ర్యునితో దేవా! విచారముడిగి ప్రశాంతిం
గనుడనిమ్రొక్కగ విప్రుడు
తనపీఠమలంకరించె, దాసుడననుచున్ ॥71॥

క్రిందకూర్చున్నయతిరాజకృత్యమెఱిగి
చుట్టుపట్టుల శిష్యాళిచోద్యమంది
ఏటివైష్ణవధర్మమో। యిదియటంచు
తలలువంచగయతి హరిస్మరణమునిగె। ॥72॥

ఊర్ధ్వపుండ్ర గతుల నూర్ధ్వరేతస్కుడై
శంఖచక్రచిహ్న సాధువగుచు
జన్మజలధి దాటసహకరించెడిబ్రహ్మ
మంచు శిష్యజగతి యతికిమ్రొక్కె ॥73॥

గుణకల్యాణుడు నారా
యణుడే పరమావధియనియర్చించు, మతం
బునకాధారంబేదో
యనుసంశయ మంకురించు యాదవగురుతో ॥74॥

నాటికిన్నేటికిన్ మీరె నాకుగురులు
కానమీసంశయంబులగడపనావ్ర
తంబుగాదు, కురేశుడే తమకుశంఖ
చక్రముద్రాంకితమహిమచాటుగాక ॥75॥

వరదా। నీలీలమహ
త్తరమైస్మరణార్హమయ్యెతర్కింపగ దు
స్తరమీదాసునకని యతి
త్వరవరదాలయమునేరి ప్రార్థించె హరిన్ ॥76॥

యతితరలిపోవ యాదవు
డలిభక్తియుతిన్కురేశు నవలోకింపన్
అతులితమౌనిగమాగమ
గతులన్బ్రహ్మమునుదెలిపె గల్యాణగుణున్ ॥77॥

సర్వకర్త సర్వజ్ఞుడు సర్వసాక్షి
బ్రహ్మమని ముండకశ్రుతిపల్కె ముందె
సహజకల్యాణ గాత్రుని జ్ఞానబలమె
రమ్యముగశ్వేత శ్వేతాతరంబుచాటె ॥78॥

గుణగణాతీతశక్తుల కొలువరాక
పూర్ణమైనచ్చిదానందపూర్ణమైన
బ్రహ్మమునుగూర్చివచియింపవశమెమనకు
లతనివిష్ణులేశంఖచక్రాంకములిటు ॥79॥

తక్కిన కర ఛందోగ్యాది తత్త్వసూక్తి
పంక్తులవివరించ దం ఎలయు నలదు
మున్నెవింటి లత్పరమార్థమునకా గ్రహింప
గంటి కల్యాణ గురువునే గంటినేడు ॥80॥

మనసు మారపశ్చాత్తప్తమగ్నుడైన
యాదవగురు ఎన్నించె . మానుజుండు
అతడెగోవిందజీయరైయుండనే త్రి
దండిగానిల్వ భక్త బృందంబుమెచ్చె ॥81॥

దోషమేలేని వారలు దోషరులను
దోషములదిద్దు వైష్ణవ ధూర్జటి గురు
నమ్మటే భక్తి, భక్తి మనం ప్రదీప్తి
అదియె జ్ఞానకర్మ సముచ్చయంబెఱుంగ ॥82॥

గురుడె శిష్యుడై శిష్యుడే గురుడుకాగ
జ్ఞానమే భక్తి భక్తియే జ్ఞానమయ్యె
తెలిసి తత్త్వమసీవాక్య దివ్యధర్మ
మదెయిలన్విశిష్టాద్వైతమై తనర్చె ॥83॥

# అధ్యాయము - 8

గురుడె శిష్యుడై శిష్యుడే గురుడుకాగ
దిశలు శ్రీవైష్ణవ హృదయ దీప్తి మెరసె
ప్రజలు పడిగాపులైయతి రాజుఁగొలువ
కంచిమహిమలు జగముల కంచెఁద్రుంచె॥

# 8. శిష్యులే గురువులు

యామున హృదయంబెఱిగిన
రామానుజుడిత్తరి యతిరాజై వరద
శ్రీమాహాత్మ్యమున ౘవటి
భూములబండింప జేసి పూర్ణోజ్జ్వలుడై ॥1॥

వరదుని మెప్పింపకయే
మరలింపగఁజాలమతని మన వైపునకున్
తరణోపాయంబెటులో!
పరమార్థము చూపుగురుని పడయుట యెటులో ॥2॥

యామునాచార్యుడు వికుంఠ ధాముడయ్యె
రంగ! నీగూడు నేడు వెలవెలబోయె
సహచరాళియంత్రాకృతి సంచరించె
బ్రతుకువెగటుగాఁ దోచె నీ రాజ్యమందె ॥3॥

ఏమి సేయుటో! మేమెటకేగ గలమొ?
సూర్యుడే లేనిమిడిమిడి జోతులెంత
కాల మీవిశాల గృహాన కాంతులీను?
నని మహాపూర్ణుడారంగని, నుతియిందప ॥4॥

స్ఫురియించెన్ నిజభావాం
బరమున శ్రీరంగవిభుని వైభవ మెల్లన్
వరరంగాకృతికనపడి
చిరకాలమనోరథంబు సిద్ధించుననన్ ॥5॥

సంగీతస్వరములతో
రంగనికరగించెడి వరరంగడె వరదో
త్సంగపు రసికుల మెప్పిం
పంగలడనిపూర్ణుడెఱిగి పరుగుల వెదకః ॥6॥

ఏటిగట్టున వెన్నెల తేటలో లుక
పాడుకొనుచున్న భక్తుని పదమహిమల
నీరునిలిచె రాలుకరిగె నింగి తొంగి
చూచెవికృతిగాక ప్రకృతి సొగసులీనె ॥7॥

ముందుబడుచున్న నామహోపూర్ణుచరణ
జనిత శబ్దతరంగముల్ మనసు నీడ్వ
లేచివచ్చి కేల్మోడ్చి అర్చించి రంగ
డయ్య! పూర్ణులేతెంచు కార్యగతి! నడుగ ॥8॥

రంగనాథునిహృదయాంతరమ్మదోచు
మీకు నేమని చెప్పుటో నాకు తెలియ
దైన కంచికి పోయి రామానుజార్యు
నెట్టులైన నిటకుచేఁదెచ్చుటేమనవిధి ॥9॥

ఆళవందనారు లాంతరంగిక శిష్యు
లెల్లకూడినిశ్చయించిరిందు
కలిసికట్టుగమిముకట్టడిసేసిరీ
వార్తవిన్నవింప వచ్చితినన ॥10॥

సృష్టి సౌందర్యగీతాల పాడుకొనుచు
మర మహోభ్యుదయంబునే మఱచితిన్ క్ష
మింపుడైనను మీరు సాధింపలేని
దీయలతిభటుండెట్లు సాధింపగలడు? ॥11॥

యతివరుండు రామానుజుడతులితప్ర
భావశాలి యా స్వామిని వరదుడాత్మ
బంది సేసె, నాబంధమ్ము బాపుడెటులొ!
స్వామి మనకుదక్కు టెటులొ! స్వాత్మఁదలప ॥12॥

తేరుకొని, రంగడే యానతిచ్చె, మీయ
నుగ్రహంబు నాశీస్సు లనూనఫలము,
కంచి కీనాడె పోదు, రంగప్రతినిధి
నని మహాపూర్ణుఁజూచి, ప్రాంజలించి ॥13॥

దేవా! యెంతో కాలము
గా వరదునిఁజూడ కలలుగంటిపుడాల
క్ష్మీవల్లభుకరుణయె నా
కీవిధముగతోడ్పడె, గురుకృత్యంబనుచు ॥14॥

కదలె రంగడు, శయనించుకరివరదుడె
ఆత్మరూపింప, గుండెఝల్లన, నయనము
లశ్రుపూర్ణంబుగాన్ మేన్పులకలనిండ,
నులికియులికి వడుచుకంచి పొలముఁజూచె ॥15॥

రంగడే తెంచి వరదుని ప్రాంగణమును
కలయచూడగ, నరమోడ్పుకనులువిచ్చె
బరిసరజగంబు మెలమెల్లమఱుగువడగ,
మధుర మందర స్వరములు మదికదలగ ॥16॥

కుతికలోకూనిరాగాలు గుసగుసమనె,
కనుల విశ్వమోహన గాయకమణి నిలిచె,
ఓం హరియనుప్రణవ శబ్దమొకటె రోద
సీగుహాంతరాళంబున ఁజేరిపోయె ॥17॥

తీర్థమై నీ పదమ్ముల దీప్తిగందు
పూవునై నీశిరంబున తావినగుదు,
స్వరమునైనీగళంబున శంఖమగుదు,
కాంతినై నీకరాగ్ర చక్రమగుదునని ॥18॥

వివిధరాగాల వెలువడ విశ్వమెల్ల
నాదమైవిశిష్టాద్వైతవేదమయ్యె
జలధులెల్ల సప్తర్షిమండలముకాగ
కొండలన్నియు చివురించె కొమ్మలగుచు ॥19॥

వరద! కరుణింప వే యను స్వరమొకటియె
చక్రవాకమై జగములసంచరింప
చుట్టుగలజీవకోటియే సుత్రులిరుగ
గాయకునిముందు కంచియే కరగు చుండె ॥20॥

ప్రాన్పడుశరీరపంజరాల యెదలే స
ముద్రమైత్రుళ్ళి పడుచు మున్ముందుకెగయ
లేక, వరదావరదయని ప్రేల రంగ
రంగ యని కాంచిపూర్ణస్వరంబులెగసె ॥21॥

నిలునిలుమా! నీస్వరమున
ఎలుకులచెలి చేతివీణ భగ్నంబగు నా
మురళీమోహనవేణు
స్వరాళిద ప్పెశివతాండవముధ్వంసమగుబో! ॥22॥

రాగభరితమౌ భక్తియే ప్రళయమైన
బ్రతుకునే జగంబింక? నీ వలచి నటులె
బమ్మయగుయతిరాజు మీ సొమ్మనంగ
చెంతనున్నరామానుజ చిత్తమంరె ॥23॥

రంగడల్లమేల్కొనియతి రాజునరసి
బాష్పపుష్పాల పూజింప పదములంటి
రమ్ముదేవ! రంగడె స్వాగతమ్మ పలుకు
మీకు లలితకళాజగంబే శరణను ॥24॥

పండితులకు బ్రహ్మవాదులకు నలభ్యు
డగుయతిప్రభుడు ర సార్ద్ర చిత్తు
డమలభక్తికి వశుడై పాటగాని వెం
టఁబడె చెప్పలేము నాదమహిమ ॥25॥

ముందుపూర్ణకుంభమునుబట్టి అర్చకు
లొక్కవైపు భక్తులొక్కవైపు
వేద మొకట ద్రవిడవేదమింకొకయెడ
చదువుచుయతికిడిరి స్వాగతంబు ॥26॥

రంగనాథుని అబ్జ నేత్రాలచూచి
ఎచటనో చూచినట్లుండె నీసొగసని
దాశరథిపల్కయిని వరదయ్యకన్ను
లే యనుచుయతిరసవశీకృతుడుకాగ ॥27॥

యామునాచార్య శిష్యాళియతిరయమున
చెంతఁజేరి రామానుజ శ్రీచరణము
లంట గురువరున్ తలచుచునచ్చటచట
నాగనెదుట మహాపూర్ణుడగపడెనట ॥28॥

ఇంటతప్పయ్యెదేవా! క్షమింపుడనుచు
శిరము వంచు రామానుజా చెంతజేరి
అయ్య! పరమాత్మదృష్టిలో నఘములేదు
అన్నియు శుభావహములన యతిపలించె ॥29॥

ఇంతకు తమయునికి యేదో తెలియక, పు
రాస్మృతులుతలప ఫలంబులేదు
గోష్ఠిపూర్ణులకడ గుప్తమౌ ద్వయమంత్ర
ముండె తద్విభూతిపొందుడనగ ॥30॥

సద్గురునిపల్కు పరమార్థసత్యమయ్యె
నిచటగల ప్రతిమనుజుడు నీశ్వరేచ్ఛ
భక్తులేగాక జ్ఞానులై బ్రతుకు చుండ్రి
కొలువకే వీరిని హరిని దెలియలేను ॥31॥

గురుడెయామునుండు గోవిందుడే బ్రహ్మ
మీచరాచరమగు సృష్టియెల్ల
రంగభూమియిచట బ్రతుకగ జన్మజ
న్మాంతరసుకృతోదయఫలమెఱుఁగ ॥32॥

భక్తి,వర్చస్సు, తేజము, ప్రాయము సమ
యోచిత ప్రజ్ఞ, జిజ్ఞాసయున్నతగుణ
ముజ్జ్వలశరీర సౌష్ఠవంబొక్కటేల?
నిఖిలకల్యాణగుణములనిలయముయతి ॥33॥

అంగరంగభోగంబుల నందు కొన్న
రంగవిభుడె రామానుజ ప్రభుడుకాగ
మరమహాధ్యక్ష పదవి యామునులదీర్పు
ననుసరించిగైకొనె పురంబభినుతింప ॥34॥

గోష్ఠిపూర్ణులకడ కడు గుప్తమంత్ర
ముండె తద్విభవశ్రీల పొందుమంచు
మాటిమాటికి నంతరాత్మప్రబోధ
మామహాపూర్ణునాదేశమనుసరించె ॥35॥

వెంటనేతిరుగోష్ఠికి వెడలె పూరి
గుడిసె ముందునిలిచె గుబురు పొదల
జూచె ఫణమెత్తినీరెండఁగాచుకొనెడి
పాపరాకన్ను సొగసులఁబరవశించె ॥36॥

తన్మయుడయి యతివదాన్యుడే పాలరా
ప్రతిమవోలె యెంతవరకటనిల
బడెనో! తెలియలేము? పైనున్నపక్షుల
ధ్వనివిని వెనుతిరిగె తగదటంచు ॥37॥

మరల మఱియొక్క నాడాత డరుగుదెంచె
పరిమళంబులవెదజల్లు పర్ణశాల
పారిజాతమహీజాగ్ర భాగమందు
చెదరుమధుకోశమాయతిమదికలంచె ॥38॥

ఇంకొక పరిముందుకేగ నదీప్రవా
హంబెయున్నదున్న యటులె పొంగె
అవలిగట్టుకేగనడ్డు పడ, విసిగి
విసిగి వేసరి, యతివిముఖుడయ్యె ॥39॥

మరమహాకార్య మొకసారిమరలనీదు,
గాలివానలింకొకపరి కదల నీవు
తలపరానివిఘ్నంబులు తలపడంగ
గోష్ఠిపూర్ణుల జూచుటే కష్టమయ్యె ॥40॥

అమ్మహాత్ముదర్శించు భాగ్యంబునాకు
ఉన్నదోలేదో! రంగ నీయుల్ల మెటులో!
ఏదియెటులైన సాధింతునిద్ధగురుని
చూచియేనీపదంబుల చుట్టవత్తు ॥41॥

కదలె మఱియొకసారి రంగనితలంచి
చేరె, తిరుగోష్ఠికిఁ యతి శీఘ్రగతిని,
పారిజాతప్రసూనముల్బడుకుటీర
నికటు శాద్వలాంబర హిమనికరమరసి ॥42॥

చూచి చూడక యాసక్తి చొరబడంగ
తప్తకాంచన దేహుడు, ధ్యానమీలి
తాబ్జనేత్రుడు, యోగ పద్మాసనుండు,
గోష్ఠిపూర్ణుని వరుఁదాంగుష్టనుంటె ॥43॥

అంతెవిద్యుల్లతాహతి నృవలబడియె
గుండెఝల్లనె నరములు గుంజ ఁదొడగె
వాల్క రంగాయనగ యామునగురుచిత్ర
మాదరిన్ చూచి బ్రతికె రామానుజుండు ॥44॥

సాంధ్యరేఖలుప్రసరించుచరణయుగళి,
రాగమొలుకు పెదవులచిర్నగవుచింది
పరిమళింపగవాక్పుష్పవదనుడగుచు
పూర్ణుడలనల్లకనువిప్పిముందుచూచి ॥45॥

అయ్య! నీశ్రద్ధ, భక్తి ప్రయత్న మతులి
తమగుపట్టుదల,దలంపఁ దలఁపు చెదరు
ఎన్నిమారు లీద్వయమంత్రమెఱుగవత్తు
ఔర! రంగపురి కిది రా దారియయ్యె ॥46॥

రా కుమార! దండధ్వజప్రభల తోడ
శీఘ్రమేద్వయ మంత్రమిచ్చెద,తరించు
జన్మనాకు నీకును మూడుజగములకన
బ్రతికితిని దేవ! యనిగురుపాదమంట ॥47॥

సంశయించు నాతనిజూచి, సస్మితుడయి
పూర్ణుడేకరుణారసపూర్ణుడగుచు,
లోకమే మ్రొక్కునీయతి లోక గురుని
కీవిహార మేలని, యెదయెదకు ఁజేర్చె ||48||

అంత నీ చరాచరజగంబంతయు నొక
సారి గిరగిర తిరుగగ చక్రగతిని
రంగ! యనుచురామానుజ ప్రవరుడరచె
చూడరాని జగంబుల చూడతొడగె ||49||

పాలసంద్రపు కల్పవృక్షాలనడుమ
మణిమయద్వీప నీపోప వనులమధ్య
సురమణిగృహాన, మెత్తనియురగశయ్య
పై రమానాథుదర్శించి పరవశించె ||50||

ఎంతకాలమట్లుండెనో! యెవని కెఱుక?
గోష్ఠిపూర్ణుల పిల్పుమేల్కొల్పగానె
వినుత విహగమ్మైకేల్మోడ్చిగొణగుచుయతి
నిలువఅనుభవంబెట్టిదోదెలుపుమనగ ||51||

తొలుతమీవియోగభ్రమకలచె గాని
రంగనిరసదృష్టి నడపురసికునివలె
తల్లియొడిలోన నిదురించు తనయునిగతి
దివ్యలోకాల చూచుచు దేలుచుంటి ||52||

దాటితి పయోధి, నాకల్పతరులనీడ,
విడిచితి సురమణీకముట్ట కడిమిచెట్ల
గోర, దివ్యమందిరమున కోటిపడగ
నీడలసుఖించువిభుడు కన్పించెననగ ||53||

ఆయేడునుప్రాకారము
లీయద్దంకులడగినపుడిటు లక్ష్మినా
రాయణుడగుపడుయతిరా
జా! యీయనుభవ మనన్య సౌభాగ్య మిలన్ ॥54॥

అదిలేకయిదియు నిదిలే
కదియును లేదీసమరస మానంద మగున్
చిదచిద్విశిష్ట తత్త్వము
విదితంబగునీకు రంగవిభుకృప ననగా ॥55॥

బాహ్యనేత్రాలకందని పరమ పదుని
దాసునికి చూపి బ్రతుకమృతంబొనర్చు
మీమహోదారశక్తుల నేమిచెప్ప?
మ్రొక్కియోగికి యతి రంగపురికిచేరె ॥56॥

రంగ! నీవుదలచిన సర్వార్థ సిద్ధి
లేనిచో మా ప్రయత్నంబులేశ్రమంబు
యోగమూర్తిగోష్ఠిపూర్ణుడుజ్జ్వలమతి
మంత్రతంత్రమహర్షి నా మనవివినియె ॥57॥

ఏ నొకండనె గురుడిచ్చు మహామంత్ర
పుణ్యఫలము నెట్లుమోయగలను?
నీకునచ్చినటుల నియతింపుమా నన్ను
పోయివత్తునంచు పురము విడగ ॥58॥

దాశరథికురేశులువచ్చి దారి కలువ
అలరి, యామునార్యుల యోగబలములందు
కొన్ని గోష్ఠిపూర్ణుల పదాంగుష్ఠమంట
యెంత వాడైన దివ్యుల కెగసి పడును ॥59॥

అతడె మనల దాక మన దేహమమృతసుఖ
మిందలిరహస్యమేమియో యెఱుక బఱుపు
డనగ, దాశరథి స్తబ్ధుడైనిలువగ
చెంతగల కురేశుడుద్భృఢచిత్తుడగుచు ॥60॥

కాంక్షతో బదంబంటిన కలుగువెతలు
ప్రేమతో శిరంబంటగాప్రీతికలుగు
స్వామి! యిది శక్తి పాతప్రభావమనగ
నిజమునిజముకురేశ! నీనిలువె నిలువు ॥61॥

ఇంతలో ముప్పూరాపూర్ణునెదుటనిలువ
నిన్ను నొంటిగారమ్మంటినె, మఱి యెవ్వ
రంచు చూపుల వారిని ప్రశ్నసేయ
వినమితశిరస్కుడైయతివిన్న వించె ॥62॥

నాకుదండమీ దాశరథీకురేశు
డేధ్వజము, చెప్పినట్లు లొంటిగనెవచ్చి
తినన, చిదచిద్విశిష్టాత్మ దేహవిభుడు
శ్రీహరియె దోచె పూర్ణునిచిత్తమందు ॥63॥

జీవత్సగుణోపాసకు
డై వచ్చిన పూర్ణుడితడు యతిన్నుపుడనిసం
భావించి గోష్ఠిపూర్ణుడు
ఆ వైష్ణవ మంత్రశక్తినభివర్ణించెౕ ॥64॥

ఈమంత్రమతి రహస్యం
బై మహనీయంబయి పరమార్థప్రదమై
శ్రీమన్నారాయణుది
వ్యామృత పదమిచ్చు జన్మ వాసనలడచుౕ ॥

ముక్తి పడయగపరిణత
వ్యక్తులకే గాని యిదిలపాత్రులకునభి
వ్యక్తంబొనరింపదగిదు
యుక్తాయుక్తమెఱిగి యుపయోగింపఁదగుఁ ॥66॥

నరుడు ఓంన మోనారాయణాయటంచు
నొక్కపరినుచ్చరింపగ యుగయుగాల
కరుడుగట్టిన యఘరాశి కరఁగునంచు
మువ్వురికిరహస్యపుమంత్రముచెవినూదె ॥67॥

రామానుజుడామంత్ర మ
హోమహితార్థ ప్రభావ మాత్మనలర్పఁ
భూమండలమే హరికభి
రామంబనియాత్మఁదోచప్రణవోజ్జ్వలుడై ॥68॥

గోవిందా! నారాయణ!
శ్రీవల్లభ! వాసుదేవ! శ్రితజనపాలా
రావే రక్షింపవె యని
వేవేగయతిగురువరుని వీడ్కొని చనియెఁ ॥69॥

నరుడుపాపి కాడునారాయణాంశజు
డందరు హరి జేర నర్హు లైరి
ముక్తి నిఖిల జనుల ముంగొంగు పసిడి రా
రండటంచు చేర్చి ప్రజలనతడు ॥70॥

గోపురగుడినెక్కి గొంతెత్తి నారాయ
ణా న మోయని యలి నాథుడరచె
ఉచ్చరింపుడయ్యయుచ్చైస్స్వరంబున
ముక్తకంఠులగుచు ముక్తిపొంద ॥71॥

నాల్గుదిక్కుల నారాయణస్వరంబె
కంచు మ్రోగినట్లుజనాళి గళము లెగసె
దాశరధికురేశుల కండ్లు తళతళమన
మనసు దీపింప బాష్పాం బుకణములురలె ॥72॥

ఉగ్రుడై గోష్టిపూర్ణుడప్డాదగియెుదగి
వచ్చురామానుజుంజూచి పలువ! నీప్ర
వర్తనకు ఫలం బేదియోగుర్తె? యనగ
నరక మని నెమ్మదిగ యతివరుడు వలికె ॥73॥

స్వామి! నేడెయూరివారెల్ల రష్టాక్ష
రీ ప్రభావమున తరించి ముక్తి
పొంద నేనొకండ పొందకే గురుతిర
స్కారనారకియన కలగనేల? ॥74॥

ఆ పలుకుల గురి కని గో
ష్ఠీపూర్ణు డపూర్వకాంతి చే చిద్ఘనుడై
శ్రీపతితత్త్వవ్యాపన
కీపనియే నాంది యంచునెఱిగి క్రమముగాన్ ॥75॥

యతివరేణ్యుని జూచి యేకాగ్రదృష్టి
దరహసితవదనాబ్జుడై తత్త్వ మెరిగి
నీకులోకానికి విడరానిముడియుండె
పూర్వవాసన లేరీతి పోవునయ్య? ॥76॥

అన్న! స్థావరజంగమంబైనజగతి
వేయిపడగల మోపెడివిభుడవీవు
ప్రభుని విడలేనిలక్ష్మణ స్వామివి, యిల
దుందుడుకుదనంబీజన్మ దొలచి వైచు ॥77॥

ప్రథితవిశ్వంభరాశక్తిప్రజలఁగావ
నేడు రామానుజాఖ్యజన్మించితీవు
నిత్యముక్తునకీవెతల్ నిలువవింక
జగతి వెల్గెడికాలమాసన్నమయ్యె ॥78॥

ఆళవారలచరితమాద్యంతమెఱుఁగు
ద్రవిడవేది మాలాధరు దర్శనమున
భక్తియే సుప్రతిష్ఠితంబైవెలుంగు
అత్యవసరస్థితిన్జాతు నని పనివినె ॥79॥

దవ్వునగల మాలాధరున్ దరిసి, ''అయ్య''
గోష్ఠి పూర్ణులు మిముఁజూడగోరిరి నను
కరుణతోశఠగోపులకమ్మనితిరు
వాయ్మొడి గఱప హరిపదంబంటెదె నన ॥80॥

సంభ్రమానందచకితుడైసత్వరమున
శిరమువంచి మాలాధరశ్రేష్ఠుడు యతి
రాజ! మీప్రభావంబున ద్రవిడవేద
మున్నలింగొను, గురునుల్లముల్లసిల్లు ॥81॥

గోష్ఠిపూర్ణులుపంపిన గురునికెఱిగి
అశ్రుముత్యాల పూజించి ఆసనమిడి
ద్రవిడవేదము చదువ భక్త్యమృతరస
మణువణువనుభవించె రామానుజుండు ॥82॥

దాక్షిణాత్యుల భాషామ తల్లులందు
అతిపురాతనంబై మధురాతిమధుర
మై రసాత్మకంబై భక్తి తారకమగు
తమిళమొక పెద్దముత్తైదువ మతి నెఱుఁగ ॥83॥

నాయన్మారులు శివసే
వాయుతులైముక్తిగనిరి, ఆళ్వారులునా
లాయిరపాశరములచే
వాయచ్యుతునర్చ సేసి రజరామరులై ॥84॥

అంద్రుతిరువాయ్‌ముడి, మొదలాయిరమెరుంగ
నేటిశఠగోపయతులుదానిని గళముల
రన్ స్తుతించి నమ్మాళ్వారులైరి, యతడె
శ్రీహరికిబిడ్డనిడువిష్ణుచిత్తుడయ్యె। ॥85॥

స్వర్ణకమలాననొక్కడు జననమందె,
నొకడు చెంగల్వపూవున నుదయమందె
మఱియొకడు మాధవీకుసుమమునబుట్టె
పుష్పజన్ములై వాడనిపూలువారు ॥86॥

పొగిలుపొగిలను పాశరమునువివరణ
సలుపు, చా సితద్వీపవాసుల సురక్షి
తార్థమాళ్వారులుజనించిరంచుమంగ
ళమునుపాడిముగింప మాలాధరుండు ॥87॥

కాదిచటతిరువన్వేలిగలజనాళి
మంగళప్రదంబంద జన్మంబుదాల్చి
రయ్య ఆళ్వారులంచు రామానుజుండు
మరలనరమోడ్పుకన్నుల మౌనియయ్యె ॥88॥

ఇంకొకపరి "యక్కాలత్తయిందనా "ప్ర
సిద్ధపాశరమును వ్యాఖ్యసేయుచున్,ప్రి
యా యొకపరి నీగుండె పై నదుముమ నను
ముందు ముందిట్టి వెతనీకుమోపననగ ॥89॥

ఆదరమునరామానుజుడతనితేరి
పారజూచి ప్రియాశ్లేష పరవశమది
దేశకాలబంధంబులే తెగ, మరిమరి
మాటలే లేని మధుర బ్రహ్మానుభూతి ॥90॥

ద్రవిడవేదమున్ నేర్పు మాలాధరునకు
మనసువిరిగె, రామానుజు మదినెరుగక
తాయతిప్రభుండ ననెడిదర్పమెగసె
నితనితోవేగుటే కష్టమింకమాకు ॥91॥

కన్నులరమోడ్చి యేదోజగానదేలు
బాసతెలియదు మావ్యాఖ్యపట్టువడదు
యెప్పుడోయొకసారి నేమేమొవాగు
నితడుగుమ్మడి కాయంత రతనమయ్యె ॥92॥

చూడనే చూడ డొకవేళ చూచి పలుక
రింప విపరీత భాష్యమే వెలువరించు
ఈప్రతిభచేద్రవిడవేద మికనడంగు
చాలుచాలునీ గురుని శిష్యత్వమిందు ॥93॥

ఆళవారలహృదయస్థపరాత్పరు
ననుభవించుచుయతియలరుచుండ
మౌనియైవిసవిసమాలాధరుండేగె
తప్పుభక్తి తప్పు తత్త్వబోధ ॥94॥

కడకురామానుజుండు రంగా,భవత్ప్ర
భావమేమొ! పరీక్షల ఫలితమెటులొ!
నేనెవరినాశ్రయించినన్ నిష్ఫలమగు
అన్యథాశరణం నాస్తి యని కుములగ ॥95॥

పరుగుపరుగునవచ్చి దేవా! క్షమించి
కరుణచూపరే యుష్మదఖండపాండి
తీప్రతిభశేముషీభక్తి తెలియలేక
మిమ్మువదలగ వేదమే మమ్ము విడిచె ॥96॥

కంటతడివెట్టివడకుచుకాళ్ళఁబడుచు
పేదయైపోవు నిజగురువిహ్వలతను
చూడలేకయాపలుకల శోకమెరిఁగి
ఆదరమున రామానుజుండాత్మకరుగ ॥97॥

మీరు వేదవిద్వాంసు లమేయశాస్త్ర
పాండితీప్రభావులు,వర వాక్చతురులు
హరిపదార్చనారతులకీయార్తితగునె?
తప్పునావల్లలేదుకదాయనంగ ॥98॥

ఇంకను పరీక్షలాకరుణించుదేవ!
యుష్మదనుభూతి తప్పుగానూహసేసి
మొదటనేపాపి నైతి ఆ పిదపతమ య
పూర్వసందేశమున్ హాస్యమున్ సలిపితి ॥99॥

తుదకు మీయతిత్వంబునే దూయబట్టి
చేయరాని పాపంబునుచేసినాడ
గోష్ఠిపూర్ణులునాతప్పుగుర్తుసేయ
తమ అశేషశేషప్రజ్ఞతట్టె మతికి ॥100॥

నావినతిక్రూర వాక్కులో దేవ! విన్న
వెంటనేతమవలె నీద్రవిడపదముల
సహజలక్ష్యార్థ మెఱిఁగెడి జాణగాను
మెఱుపులెఱుగక యురిమెడి మేఘమైతి ॥101॥

స్వామిసన్నిధానంబున ప్రజలెగాక
పాశరములెల్లనవరసభరితమయ్యె
తత్త్వమెఱిగింపు డంచు వేదంబుజదువ
గురుడుశిష్యుడై శిష్యుడె గురుడునయ్యె ॥102॥

తిరువాయ్ ముడిమున్నగుపా
శరముల విశ్వాత్ముడైన సవిశేషబ్ర
హ్మరహస్యంబే సాక్షా
త్కరింపయతికబ్బె భాష్యకారకశక్తుల్ ॥103॥

రహినుదాత్తానుదాత్తస్వరంబులొప్ప
గాఢతీవ్రభావంబులగానమాత్మ
వేదనమెశిశుపశుఫణిప్రీతిగూర్ప
సామవేదజ్ఞుచింతించుననుయమందు ॥104॥

గురుదేవా! రసబుుషిమున
వరరంగడునాదయోగి భక్తుడు మురళీ
ధరుకరుణారస పాత్రుడు
గురుయామున లలితకళల గుసగుసలెరిగె ॥105॥

నవ్వెనా సన్నజాజుల స్నాన సుఖము
అలిగెనా హరతాండవంబనుభవమగు
అతనికీ సృష్టియంతయునమృతరూప
మాతడెప్పుడెట్లుండునో యరయలేము ॥106॥

అణువణువు నందనుస్యూతమైన విష్ణు
మహిమ రామాయణంబుగా మహినిహనుమ
పాడ రంగడురంగని స్వరములందు
జానకీరామలక్ష్మణ శక్తులెరిగె ॥107॥

కణకణంబులజీవులే గలగలమన
నీచరాచరాత్మకజగత్సృష్టినెల్ల
బయలరూపంబు రూపమే బయలుసేయు
కృష్ణమురళీత్వమెరుగుయోగీంద్రుడనగ ॥108॥

నిజమునిజము మాలాధర! నీయనుభవ
మామహాత్ముని రాగయోగామృతంబె
నన్ను బంధించె నీరంగనాథచరణ
కమల భృంగిగా పడ్డాచె కలలుపండ ॥109॥

ఆతడీయాత్మయేబ్రహ్మమంచు ఋజావు
సేయు హరిభక్తుడారససిద్ధునిమహి
మానుభూతి భజించుచు యామునార్య
లలితశక్తుల నొకయింత తెలియుటెపుడొ! ॥110॥

నిట్టూర్పులునిగుడగ యతి
చట్టపుచిత్రంబునయ్యె సంచితపుణ్యం
బిట్టిట్టని యెవడుదెలుపు?
మట్టియె మదనాకృతిగొను మాధవుడలరవ్ ॥111॥

# అధ్యాయము - 9

విషముతీర్థమయ్యె విషకంఠభక్తుడు
ఆత్మబంధువయ్యె అర్చితశిల
బ్రహ్మమయ్యె భక్తిపరమాత్మ తేజమై
కంటఁబడని శివుడె కంటఁబడియె॥

# 9 శ్రీనివాసుడే బ్రహ్మము

ఆగమోక్త ప్రకారమర్చావతార
నిత్యపూజలు నెలకొన, నృత్తనాట
క లలితకళల కేంద్రాలుకాగ ఆల
యాలు నెలకొల్పె భక్త రామానుజుండు ॥1॥

రంగనాథుని లీలావిలాస మఖిల
విశ్వమందనుస్యూతమై విచ్చుకొనగ
యతివరేణ్యుని ప్రాభవంబంతకంత
పెరిగెనలుదిక్కు, లొకటిగావృద్ధిపొందె ॥2॥

సంఘమునజాతిభేదముల్ సన్నగిల్లె
హెచ్చుతగ్గులు సమమయ్యె నీశదృష్టి
నిర్మలప్రేమ సత్యమై నిశ్చితాను
భవమె ఆనందమధువయ్యె భక్తతతికి ॥3॥

మాధవా! రమ్మిదేతిరుమజ్జనంబు
నీకుఁజేయింప గొజ్జంగి నీరుదెచ్చి
తి, తిరుచూర్ణంబు కూర్చితిదేవ! ఆల
సింపవేటికోయని యతి సేవలఁబడె ॥4॥

మంగళారతినిడు మంత్రపుష్పంబు చ
దువుచునిల్చి దూరదూరముగనె
చెంతఁజేరపంజాచేబట్టు పరిపరి
విధుల మాలగూర్చి విభునిఁగొలుచు ॥5॥

ఎప్పుడేరీతి యో గురునెఱుగనెంచు
అర్చకులనుండి పరిచారికాళిదాక
యెల్లరకు క్రొత్తచైతన్యమినుమడించె
భక్తులకు భక్తి భటులకు భయముపుట్టె ॥6॥

యతికి భిక్షయర్చకులగృహాంతరంబుల
దినదినమ్ము మధుకర వృత్తినడచువం॥
నా ప్రధానార్చకు హృదయాభ్యంతరంబు
విషము గ్రక్కె మరాధ్యక్ష విభవ మెరిగి ॥7॥

తరంబరాలుగ భక్తితాత్పర్యమహిమ
రంగనాథుని విడకయర్చనలుసేయు
మమ్మె వదలి యింటింటభిక్షమ్ము వేడు
వీని కింటటి ప్రాభవం బెటుల కలిగె? ॥8॥

ఏమిచిత్రమో! యిది, యెవ్వ రెదురుపడిన
శరణు శరణుజీయా! యనిచరణయుగళి
కనకవర్షంబు కురిపించు కళతచూడ
తట్టకాసులున్ మాకిపదక్కవేమో? ॥9॥

ప్రజలు భక్తులుకడకుసర్వజ్ఞులైన
యామునాచార్యశిష్యులేయడుగులంబడి
మడుగులిడుచుండ నెవ్వ రంగడని పొంగి
యీజగంబెల్లనీతడే యేలు కొనునా! ॥10॥

ఇంతమాచియుతానేమి యెఱుగనటుల
కటకటా! రంగనాథుడేకటకటాం
చిక్కచెక్కనబొమ్మగా, చింతగూర్చె
మాకు, మన్నించుచెట్టులోనునట యెటుల్! ॥11॥

ఆప్రధానవృద్ధార్చకుండాత్మసతిని
జేరి యన్నంబునవిషంబుఁ జేర్చితాను
దూరమయ్యె యతియుధాప్రకారమాగృ
హమున భవతి భిక్షాందేహియనుచునిలువ ॥12॥

అప్రతిహతతేజ మనుపమాన ప్రభా
వం బనిందిత హృదయంబుగూడు
కట్టుకొన్నయతి ముఖంబును జూచి యి
ల్లా లి చేతి పాత్రనేలగూలె ॥13॥

పాలిపోయిన సతిమోము పారజూచి
తనువుచెమరింప, చేతులె దప్పవశము,
తూలుచుంటి ఆరోగ్యపుతొందరేమొ!
పలుకు మోతల్లి! యనుయతిఁ తలచి, వనిత ॥14॥

క్రిందిమెతుకుల జచ్చుబల్లి దురవస్థ
గాంచలేక, యతిఁ గాంచి, గద్గదమున
వెంటనేదేవ! యీవీడు విడిచి యెచట
కైనపారిపొండన నాత డచ్చెరువడి ॥15॥

కనులు కలయ తిరుగ, కాళ్ళు తడబడ,రం
గా యని యతి ముందు కల్లనడచి
స్వామి యెదుటకూలబడె, అయ్య!మీప్రధా
నార్చకు నిక కాచు నభవుడెవడొ! ॥16॥

అనుదినమమృతాన్న మందించు తల్లియీ
పీడె విడుచుటెటులో? విడకబతుకు
టెటులో! ప్రభుని సుందరేక్షణ మాలికా
మధుకరప్రకరము మఱచు టెటులో! ॥17॥

ఇంతకున్‌దేవ! నాదోషమేమి? నాకు
దెల్పునందాక, నీముందె తీఱి పోదు,
అనిజలాన్నంబు లొల్లక యల్ల నక్కి
మూల ముసుగువెట్టి పరుండె మూడునాళ్ళు ॥18॥

స్వామికైంకర్య మొకరీతి సాగుచుండె
కానిభక్తులహృదయాల కలతరేగి,
మరమహాకార్య గతులక్రమంబుసడలె
పట్టణ ప్రజ తెలియనిబాధకుమిలె ॥19॥

గోష్ఠిపూర్ణుల యోగాత్మ కుంటువడగ
తెలిసికావేరిగట్టు పైనిలిచె నతని
నెదురుకొన యతిరాజు కట్టెండనడచి
తూలుచుఁవచ్చి గురుని పాదాల బడియె ॥20॥

యతి పరోపకారార్థమై యవతరించు
ననుభవజ్ఞాని దృఢ చిత్తు డమృతమూర్తి
సార్థకాఖ్యుడీ రామానుజ(్రనరుడె
యిట్టు పరితపింప జగంబు లింక మనునె? ॥21॥

పరమార్థప్రతిపాదక
చరమ శ్లోకంబునెరుగు సమయజ్ఞున కీ
చరితంబొక యనుభవమని
ఎఱుకదెలుపగోష్ఠిపూర్ణుడేయేతెంచెఁ ॥22॥

పావుకోళ్ళపై నిలచెడి పరమయోగి
యిసుకనివ్వలఁబడుభక్తునెట్లెరుంగు?
నిందలిరహస్య మెఱుఁగ మేమెవ్వరంచు
బలుకునంబి రామానుజుబట్టి లేపె ॥23॥

స్వామి సన్నిధి దినవార పక్షమాస
వార్షికోత్సవజ్ఞాన సంపన్నునర్చ
కుని మతిన్ మార్చి రక్షింపుడనుచు మ్రొక్కు-
యతివరున్ చూచి పూర్ణుని యాత్మయలరె ||24||

నీదుసత్యాగ్రహమెకాచునిఖిలము నని
పార్శ్వమందున్న నంబిని పారజూచి
నేటినుండి ప్రసాదమ్ము నీవెగురుని
కిచ్చికొల్వు మని యతడదృశ్యుడయ్యె ||25||

నంబిగురుభక్తిద్విగుణీకృతంబుకాగ,
గోష్టిపూర్ణులయాజ్ఞతో, గురుని కుచిత
మౌ ప్రసాదంబు మరమునందనుదినంబు
కూడె, గెలివిరంగని కనుగొనలదొనకె ||26||

ఉపనిషత్జ్ఞానమిచట తోడుపడెనొకొ
ఆళవార్లగీతామృత మాదుకొనెను?
గోష్ఠిపూర్ణులే తెంచి నాకు వివరింప
తెలిసె, నాది, నాసేవన్నదే విషమని ||27||

ఎల్లధర్మంబులన్త్యజియించియొవడు
నమ్మి నన్నే గొలచు తక్షణంబవాని
పాపరహితునిం జేసి కాపాడెదనను
గీతి తెలిసితెలియకిటులైతినంచు ||28||

భాష్యసింహాసనాదిప్రవరులుగా న
డాదురు, కురేశు, మొదలి, కిళాంబి యాళ
వారుల నలుగురుని ప్రతిభాప్రభావు
లాంతరముఖుల నియమించె నచ్చటచట ||29||

దేవా! నీ దయతో గురు
దేవుల యామున బహుముఖ తేజముగంటిన్
తావక జీవకళావృత
మౌ విశ్వ మొకింత దెలియ నాశలురేపెన్ ॥30॥

కానీసృష్టిస్థితిలయ
లానందముతో నడుపువిరాడ్మూర్తిన్ ల
క్ష్మీనారాయణు నిను క
ల్యాణాద్భుత గాత్రు నెట్టులవలోకింతున్ ॥32॥

కాంక్షలెగయగ కలలోన గానుపింతు
మాటలాడగ యత్నించు మరుగడియకె
మాయిమై, నిద్ర చెదరగ, మలి చలింప,
చుట్టు పట్టుల చూచుచుస్రుక్కు చుంటి ॥33॥

ఆలింపుచు నా పల్కుల
పాలించెడి దివ్యమూర్తి ప్రత్యక్షము గాన్
నాలోకింపగ నామది
వాలాయముతత్తరించు పగటి కలలతోన్ ॥34॥

కాంచిపూర్ణుడు వరదు బల్కింప గంటి
యామునులురంగ విభుని తోనాడి పాడి
రంట మఱియట్టి భాగ్య మేనందగలనె?
చూపుడని మ్రొక్కియలిశిష్య శోకమెరిగి ॥35॥

పూర్ణాబ్జవదనుడు మహా
పూర్ణుఁడుయతిరాజ! ప్రేమ పూరితుడా వాక్షీ
ర్ణార్ణవ దేవుడెనీతో
కర్ణానందముగ బల్కు కాలము వచ్చున్ ॥36॥

శ్రుతులతో బాటులోక సంస్కృతిని చదువు
జ్ఞానివి, నిరంతర హరిదివ్యానుభూతి
పరవశించు భక్తుడవు, నీపలుకు వినడె?
శరణు శరణంచు రంగడే సాగివచ్చు ॥37॥

దినదినంబర్చితుండగు దేవుడు, గుణ
సుందరుడె కాదు భక్తికి సులభు డిదియు
నీకు నేచెప్ప వలెనె? చింతింప కయ్య
గురుని కోర్కె తో నీ కోర్కె కూడి వచ్చు ॥38॥

నావుడు భావస్పందితు
డైవచ్చివిభు నెదుటయతి యాజ్ఞావశుడన్
సేవకుడ రంగ ।యనగాన్
గోవిందుడు స్వామి కనుల గోచర మయ్యెర్ ॥39॥

నాలీలాద్భుత విభవం
బీలోకముఁగావ నీ కు నిచ్చితి నిట పై
లాలించుచుపాలింపుము
యేలికవై వెలుగు మంచు నెదవినిపింపన్ ॥40॥

వెనుక యాదవ గురుచెంత, విద్యనేర్ప,
తోటివారలు కాదన తోడుపడుచు
ముందు నిలచిన సహజ గోవిందు డాత్మ
నిలిచె యతిరాజకన్నులనిండె నీరు ॥41॥

తలచినంతనే యెదుట ప్రత్యక్షమై తి
రుమలనంబి గురుని చూచి మ్రొక్కి నిలువ
తల్లిరూప మామోమునతెల్ల మయ్యె
అక్షులార్పక చూచి రామానుజుండు ॥42॥

మామ ! శ్రీ శైల నాథుని మనసుదోచు
గుణగణాభి రాముడవు, నాకుగల యొక్క
కోర్కె పూర్వ వాసన లెల్ల కుదుపుచుండె
నిన్ను జూచితి వెతలింక నింకగలవు ॥43॥

సఖుడు, ప్రాణ సఖుడు, చదువరి, సకలవి
ద్యా వినోది, బంధు వాత్మబంధు,
వన్నిటికిని మించి నభవార్చ్య కుండుగో
విందు జూడ మనసు వేగిరించె ॥44॥

ఎట్టులైన శ్రీకాళహస్తీ శుంజూచి
మనసుమార్చి మాగోవిందు మాకు నప్ప
గింపవే యన సుంత నిష్కంపితస్థి
తి, నిలిచి తిరువేంగడయొడయుని కృపయని ॥45॥

యతులకార్యము, వేంకట ఎతి మనంబు
భటుని సేవ కర్తవ్య మై పరగె నాకు
శ్రీ మహాకాళ విభుని దర్శింతు నేడె ,
ఆజ్ఞ యన మంగళము సేసెయతివరుండు ॥46॥

ఇంతలో ంబ్రధానార్చ కుం డేగుదెంచి
తీర్థమిచ్చుచువడకెడి దేహమెఱింగి
అఖిల కల్మష హర మచ్యుతాంఘ్రి తీర్థ
మంచు సేవించి యతికండ్లకద్దు కొనగ ॥47॥

పాహి పాహి యంచు పాదాల పై బడి
యేడ్చు విషము చిత్తు నెత్తి అయ్య
యనుదినంబు తీర్థమందించు మీసేవ!
అనుపమాన మంచు యతి తొలంగె ॥48॥

విషమునేతీర్థ మంచు సేవించె, విషము
చిత్తు నెరిగి నెరిగియు మన్నించు నితడె
సకల భూతహితుండు వైష్ణవ గురుడని
పరిజనమె కాదు జగతియే ప్రణుతి సేసె ॥49॥

కాళహస్తి కేగి కనకముఖీజల
స్నాతుడై తిరుమలనంబి ఎరిస
రప్రకృతి మనోహరగిరివ్రజంబిది
చూడవేంకటాద్రి శోభదోచె ॥50॥

కొండ పైన కొండ గుడి గోపురంబది
గుట్టప్రక్క గుట్ట గుట్టు నిదియె
శ్రీనివాసుడందు శివశక్తులిందుఁరెం
డును నదీనగసుమనోహరంబు ॥51॥

శ్రీయె సత్త్వరజోగుణ సేవధి, మఱి
కాళమన ఆత్మగుణముల కదపనేర్చు
కుండలిని, హస్తియన తమో గుణము నడచు
అభయహస్తమీ మూటికి నధిపతి పతి ॥52॥

ఇంతలో దేవదేవా! మహేశ! మంగ
ళప్రియా, మదనాంతకా ప్రణవ మూర్తి
కాలకాల! సంధ్యానటా! కావుకావు
మంచుకడవతో వచ్చు మేనల్లుఁజూచి ॥53॥

ప్రీతి నుబుక గోవింద! గోవింద! యంచు
బిలువ నాపల్కుఁగాలిలోఁగలిసి పోయె
తొలుగు తొలగుడు నాయనారు లరుదెంచి
రంచు తంబళు లాతని నవల త్రోయ ॥54॥

పేరుతో బాటు వేషమున్ మారె, పెద్ద
ఱికము వచ్చె గోవిందు ప్రకృతియె తప్పె
హతవిధీ! యేమి సేయుదు హరికృపయని
వేడినట్టూర్పుతోమామ వెను తిరిగెను ॥55॥

తరతరాలనుండి తారక మంత్రమ్మై
మాద్యుతిమతి మనసు మరులగొలుపు
భావకమల భట్టు భావముల్ పండించు
మంత్రపత్రమిదియె మార్చునేమొ ॥56॥

తాళపత్రమంత్రంబుతో కాళహస్తి
చేరి స్వర్ణనదీ ముఖద్వారమందు
పత్రమును జార విడిచి తత్ప్రాంతమందె
పొంచి నయనార్లకు నిరీక్షించు చుండె ॥57॥

తలచినట్టు లే గోవిందు డాదారిని పడు
పత్రమున్ జూచి జారె మీ పత్రమంచు
చెంతగల తిరుమలనంబి చేతి కీయ
మామ దిగజారువారము మేము కాదు ॥58॥

ఆశ్రితుల జార విడువని యచ్యుత పద
భృంగసంఘమ్మై బ్రతికెడి భృత్యులమన
వినియువినక గోవిందుడు వెడలిపోయె
వెనుతిరిగి నంబి వినుతించె వేంకటేశు ॥59॥

దేవ! చంద్రశేఖరుడె నిన్ దెలియగోరి
రామతారక దివ్యమంత్రార్థ మగుచు
నిర్గుణ పరతత్వంబు నై నిర్వికార
నిర్మల నిరంజనుండునై నెగడె భువిని ॥60॥

బధిరపంగ్వంధ కో పమ బ్రహ్మ మగునె?
వినక వినుచువిన్పించెడి వేదమయుడు
కదలికదలక కదిపెడి జ్ఞానమయుడు
చూడకే చూచు సర్వజ్ఞ శోభితుండు ॥61॥

అష్టమూర్తి మహత్తత్వ మందుకొనక
యాదవ ప్రబోధంబుచే నాత్మచెడగ
కడకుపాషండ శ్శైవుడై జడతపడియె
ఏమి సేయుదుగోవిందు నెటులదెత్తు ॥62॥

విద్యకలిగియు వినయంబువెలితి యయ్యె
చదువుకల్గియు సంస్కారమొదవదయ్యె!
తనమనయనెడి మానవత్వంబ చెడియె
కన్నులుండియుజగమునే గాంచడకట! ॥63॥

గోవిందా! గోవిందుని
నీవానిగ (జేయలేవె? నే నేమియు ని
న్నీవఱకు గోర ఆ ని
ర్జీవ పథము మాన్పి వాని నేకొనుమయ్యా! ॥64॥

నిఖిల కల్యాణ గుణముల నిలుపజగతి
గురుడుయతిరాజుకోరిన కోర్కెయిదియె
నీకు తెలియని దున్నదే నీరజాక్ష!
అన్నిటికి నీవదిక్కని హరికిమ్రొక్కె ॥65॥

వేంకటేశునిముఖమున విరిసెనవ్వు
కంఠరుద్రాక్షలున్ జారి కాళ్ళబడియె
సంబరంబున గైకొని నంబి చెంత
ద్రవిడ వేదము చదువు నాళ్వారులగని ॥66॥

శరణు శరణు భక్తాగ్రే
సరులకు మీ పాదధూళి సర్వాభీష్టం
బులు సత్వరంబు సమకూ
ర్చు రండు దర్శింప నాతిరుక్కొళ విభుః ॥67॥

ఆత డనుమతించినప్పుడే మనకు గో
విందు భట్టుదక్కు, వేంకటపతి
దివ్యతత్త్వము నలుదిక్కులన్ ప్రాకు, య
తీంద్రుల హృదయము ప్రదీప్తమగును ॥68॥

అతని పలుకుల లక్ష్యార్థ మరసి వచ్చి
స్వర్ణవాహినీ స్నాతులై వారు న చటి
పద్మనాభ సహోదరీ పతికి మ్రొక్కి
దేవ! నాస్తిక మతములు తెగిపడంగ ॥69॥

జగతి కల్యాణ భరితగాన్ శశిశిఖావ
తంస! మాకుగోవింద భక్తవరు నొసగి
కావుడని మ్రొక్కి బిల్వవృక్షంపు నీడ
ద్రవిడ వేదాధ్యయనగోష్ఠితవిలరంత ॥70॥

గోష్ఠియో! గోడా! యిదియేటిగోలయంచు
వారికప్ర దక్షిణముగ వచ్చి తరువు
నేరి నయనారుబిల్వ పత్రాళిగోయ
మామ హృదయార్ద్రగీతలా మలిని మార్చు ॥71॥

ఈ చరాచర జగతికే హేతు వైన
పద్మగర్భుని కన్న యో పద్మనాభ!
పద్మ పత్రాయతాక్ష! శశ్వద్ప్రియాంగ
పూలపూజించి నిన్ను సంపూర్ణుడగుదు ॥72॥

నీ కుద్మొక్కిన తిర్యక్కు నిజమెరుంగు
నిన్ను దలఁచిన నరునకు నిజసుఖంబు
నిన్ను విన్నచో నిచటనే నిర్వికార
సచ్చిదానంద మో ప్రభూ! శరణనంగ ॥73॥

నిజమునిజము మామ! నీ పల్కులని యున్న
దున్న రీతి దుమికి యుర్వి పైకి
అక్షమాల ద్రుంచి యడుగులన్ వ్రాలుగో
విందు జూచి వారు వెఱఁగు పడిరి ॥74॥

గోవిందా! యిది నీలీ
లావైభవమయ్య! యతితలఁపు లీడే రన్
గోవిందుడు, తిరువాయ్మొడి,
శైవులు, మేమెల్ల నీకు సాధన మాత్రల్ ॥75॥

అన్నా! వేంకటపతియే
నిన్నున్ యతివరుని సేయ నియమించె మఱిన్
ఉన్నత రామానుజు డా
యన్నకు తగుతమ్ము డైతి వనె మాతులుడున్ ॥76॥

ఆగోవిందు డె యిటమా
కీగోవిందు తగూర్చె నీశునికరుణన్
యోగంబో! త్యాగంబో!
రాగంబోయిది వచింపరాని ఋతమనన్ ॥77॥

తల్లిదండ్రి, గురువు, దైవము సర్వము
మీరెయింక నాకు, వేరెలేరు
ననుఁబరిగ్రహింపుడని కాళ్ళ పైఁబడి
యేడ్చుచెల్లెలిసుతు నెత్తి పలికె ॥78॥

రావయ్యా గోవిందా!
గోవిందుని సేవలోన గొనుమిహపరసౌ
ఖ్యాపహ యోగంబన ఆ
ద్రావిడ వేదజ్ఞులెల్లలరలిరి తృప్తిన్ ॥79॥

తిరువేంగడయొడయుగొలువ
తిరుమలనంబిపదమంటి తెరల వరుడు భ
క్తిరసావిష్కృతుడై కని
పరము శివా! యంచుమ్రొక్క వైష్ణవ భక్తుల్ ॥80॥

బెదరిరి, హామ,రవంతయు
చెదరక దరి జేరి, మమత చిందెడికనులన్
యిదిసహజము తండ్రీ, నీ
యెదనాటిన ద్వైవ తత్త్వమిట బయలయ్యెన్ ॥81॥

అని మేనునిమురి, మేల్కొని
కనుపింపని పరమ శివుడు కనుపించె ఘనా
ఘన ధూర్జటియై బిల్వా
ర్చనరతు డై నాగభోగరంజితుడన గాన్ ॥82॥

భక్తుడెద దలంచు వైఖరిప్రత్యక్ష
మౌపరాత్పరు డిదియన్నిరూపు
లందుకొన్న రూప మలవాటు పడినట్లు
కొలువు మంచు మామ పలుకఁ గానె ॥83॥

గురుడులేనిలోపంబున గురినెఱుఁగక
కర్మరుడనై తపించితి కా ప్రుడు
కలిసివచ్చె సద్గురువరున్ గాఁ ముమ్మ
అందరాని మహానంద మం ంటి ॥84॥

శబ్దమే హెచ్చరింప పంచాక్షరి రస
మయముకాగ అష్టాక్షరీ మంత్రమయ్యె
శివమెబ్రహ్మమై గోవింద శిష్యుని కిట
విగ్రహాన వేంకటపతి వెలుగులీనె ॥85॥

సగుణ నిర్గుణంబులు రెండు సత్యమయ్యె
జీవుల గుణంబు ననుసరించి సలిపెడి త
పమున కనువైన ఫలములే పడయవచ్చు
సులభుడీ మోహనాంగుని చూడగంటి ॥86॥

నాటినుండి గోవిందు డనారతంబు
నీడగా నాత్మగా గురుని కొలువంగ
కంటికిన్ ఱెప్పగా శిష్యు కాదుకాదు
ఆత్మ సఖునిగా మామ మేనల్లుఁజూచె ॥87॥

# అధ్యాయము - 10

ద్రవ్య మాభి జాత్యంబు విద్యగలశిష్యు
నడుగడుగునఁ బరీక్షించి యాత్మవిద్య
కనువుగ గురుండు చరమగీతార్థమిచ్చి
నప్పుడే జగంబునకుసౌఖ్యావహంబు॥

# 10 ప్రపత్తి విశేషం

చరమశ్లోక రహస్యం
బెరిగించిన గోష్ఠిపూర్ణు డెదనిండంగా
గురుడందీయందకయం
దరిలో నానందుడయ్యె ధర్మజ్ఞుడుగా ॥1॥

గురుదేవ! నేను మనదా
శరధియు మీకృప నపార శాస్త్రాంభోధుల్
తరచంగంటిమి గానీ
శరణాగతి తత్త్వమెఱుగ జాలమనంగ ॥2॥

భక్తుడీకురేశుడు ముక్తి పదముగోరి
కోరెను చరమగీతార్థ సారమంద
గోష్ఠిపూర్ణుల కష్టడికష్టమైన
శ్రీహరియనుగ్రహావిశేషలీలయెటులో ॥3॥

దుడుకుకు మున్నొకపరి నే
గుడిగోపురమెక్కి కూయ గురు నాగ్రహమున్
పడసితి నారాయణుడా
యెడనెల్లరకనికరించుటెఱుకకురాగా ॥4॥

ఎవని య్యె మిన్ను చూచి రామానుజుండు
నాకుదండధ్వజమ్ములనంబరగెడి
వీరి నీనమయంబున విడువ లేను
అట్లని మరువలేను బాధ్యతలగూడ ॥5॥

కటకటా! సూక్ష్మ మైయహంకార మఖిల
జగతినాడించె నేను నాజన్మ నుత్త
మమనికొందరు నాధనంబధిక మంచు
కొంద రేనె సర్వజ్ఞుగా కొందరడఁగ ॥6॥

ఆభి జాత్యంబుచే నితడణగడయ్యె
భోగభాగ్యాల తృణముగాబో ిచె, స
మస్తవిద్యాన్వితుండయ్యు మ ఱ్ఱుగొ లిచె
ఐనను పరీక్షసేయు టత్యవస ము ని ॥7॥

కేలుమోడ్చి నిల్చు కు రేశుభేదమెరిఁగి
నీవు త్యాగివి వినయ వినీతుడ స
దావిరక్త శీలుడవార్షధర్మ పరుడ
వీచరమమంత్ర మర్ధించుటే ంబు ॥8॥

కానియొకయేడు బ్రహ్మచర్యాల కొలువ
గురుని త్రికరణ శుద్ధితో చం నుగీ తి
దివ్య మంత్రార్థము ఫలించు నవ్వయిుకృప
నన్నగురుదేవు నింజూచి నిన్ను ంచె ॥9॥

దీపమున్నప్పుడే యిల్లుదిద్ద తగును
ప్రాణమున్నప్పుడే హరిన్ బట్టఁగలయు
ఈశరీరమేక్షణములో నెట్టులొయన
సంతసంబంది యలి కురేశ ! వినవయ్య! ॥10॥

ఈవ్రతంబు నీకునిష్టంబు కాదేని
ఉంఛవృత్తిఁబూనియొక్కమాఁ
మైన హరిని నిరతమాత్మ ం ంచుచు
లిరగిరాగ కోర్కె లీరుననఁ ॥11॥

గురువాక్యంబులనడచిన
కురేశుడా విశ్వనాధు గుణగణగాన
స్మరణంబున, రామానుజ
చరణంబుల, చరమగీతి సారంబయ్యెఁ ॥12॥

ఈవృత్తాంతము చేఁగ్రో
ధావశుడుంగాక, వచ్చి, దాశరథి మహో
త్మా! వలపక్రమ మని నే
నేవిధముగమిమ్ము గూర్చియిటవచియింతుఁ? ॥13॥

ఇంతకున్నేను చేసిన దేమిదోష
మో! ప్రభూ! చరమశ్లోకమొకరికిచ్చి
యొకరి కీయక నొప్పించుటుచితమొ? యని
కాళ్ళపైఁ బడియేడ్చు మేనల్లుఁజూచి ॥14॥

అయ్యో! పిచ్చితండ్రీ!యిటులాడతగునె?
జీవజగములీశుని చేరిచెలగి నటుల
నాకు నీవు కు రేశుడు నయనయుగళి
యీత్రిదండ తత్త్వమడంప నెవ్వరికగు? ॥15॥

అన్నిటికిగోష్ఠిపూర్ణుడే యాత్మసాక్షి
అపరమయోగి సంకల్ప మరయికుండ
మనకిదియు పొందతగునె? నెమ్మదిగపోయి
ఆతనియనుగ్రహంబంది యవలరమ్ము ॥16॥

మారుమాటలేక మామకుమ్రొక్కి దా
శరధి గోష్ఠిపూర్ణుదరిసి భక్తి
దేవ ! చరమగీతి తెలియంగవచ్చితి
నన్ననుగ్రహింపుడన్న నతడు ॥17॥

కొంతకాలమాతని గుణస్వాంతమెరిగి
ధనముపొందత్య మాభిజాత్యంబునల్పు
లం దహంక్రియాప్రేరకంబౌ నివియె, మ
హాత్ములందుకల్యాణగుణాకరాలు ॥18॥

ఈ రహస్యమాత్మ నెరిఁగి రామానుజ
గురుని శరణు వేడి చరమగీతి
తత్త్వమతని కరుణ దర్శింపు మన్న దా
శరథి తిరిగి రంగ పురికి వచ్చె ॥19॥

సిగ్గున తలవంచి శ్రీహరి పాదంబు
గురుపదమని తెలిసి కూర్మి పేర్మి
మామమామయంచు మరులైతి రామాను
జగురునెఱుఁగ నైతిజడుడనైతి ॥20॥

జరిగిన విషయంబంతయు
గురునకు దాశరథి తెల్పి కుములుచునిలువన్
చరమాక్షరపరమార్థం
బెరుగు సమయ మొదవు, వగవకీశుఁగొలువుమా! ॥21॥

అనుచు నోదార్చుచున్న రామానుజుఁగని
తెఱలు తెఱలుగ దు ఖంబు పొరలిపొంగ
గోలుగోలునవేడ్చెడి కోమలాంగి
నాదరంబున జూచుచు యతివరుండు ॥22॥

మామహాపూర్ణ గురుని కుమారెవమ్మ
తులసి! నీకేమి కష్టమ్ము కలిగెనొ యన
పుట్టినింట సుఖంబులు మెట్టినింట
దలప ఫలియించునే తండ్రి ! పలుకులేల? ॥23॥

దేవ! లంకంతయిల్లుమాది, పలుమంది
తో,సదాయది కిటకిట తొనకు చుండ
చేసి చేసి నాచేతులు చిక్కగాని
యింటిపని తీరదత్తకు తృప్తిలేదు ॥24॥

అనివెక్కివెక్కియేడ్వగ
వనితశిరముదువ్విగురుడువగవకుతల్లీ!
మనయీదాశరధియె మీ
కనువైగృహకార్యనిరతి నాదుకొనుమిమ్ము ॥25॥

విరబూరె తులసివదనము
త్వరపడె గురుపుత్రియింటి దాస్యమునకు దా
శరధి సహోదరుగితి నా
యిరువురికిన్ స్వాగతంబునిచ్చె గృహంబే ॥26॥

వంట వాడొచు నింటిలోఁబని మనిషిగ
నందరికి తలనాల్కగా నాదుకొనఁగ
దాశరధి సేవ కత్తమెత్తవడె తులసి
గుండెఁజేయిడి హాయిగా కునుకుదీసె ॥27॥

ఒక్కనాడింటి వారెల్లరూరిమధ్య
కరిగి హరికథాలాపంబు నాలకింప
మధ్యలో నిలునిలు హరిని మఱచితి వన
కలకలమురేగె సభయెల్లకలతబడగ ॥28॥

వేదికాసీనుడు, పురాణవేత్త రేగి,
ఎవ్వడాప్రబుద్ధుండు మాయెదుటఁబడి హ
రిమత మెట్టిదో స్థాపింపరే యనంగ
తులసియింటి వంటలవాడు తొంగిజూచె ॥29॥

పకపకనవ్వుచు సభ్యు లి
ది కూరలుడికించు నంచుతెలియకురా నాఁ
డిక్కృతికొనకతడు గురుపా
దకమల మాత్మదలచి హరి తత్త్వముచాటెఁ ॥30॥

జగమంతయు హరిరూపము
జగమంతయు రంగని పదచైతన్య శిఖల్
జగమంతయువిష్ణున హ
స్రగుణగణాంకిత మనుయతిరాజునుతింతున్ ॥31॥

భక్తియేప్రణవస్వరూపంబు న య్యె
భక్తియే పరబ్రహ్మమై పరిమళించె
భక్తియే విశ్వరూప మై పర గుచుండె
గురుని భక్తియే యెల్లరగూర్చె నిచట ॥32॥

మాటపాట యాట మాధవ కథగాన్ ప్ర
హ్లాద ఆంజనేయ యనిల సుతుల
జేయుజనుల,కానిచో యదియే కోతి
కొమ్మలాటయిదియె గురునిమాట ॥33॥

వాసుదేవ నారాయణ వైష్ణవ ప్ర
భావ మాత్మ చైతన్య మప్రతిహతమని
అడుగడుగున తత్త్వంబుచాటెడియతిన్నపు
దలతు రామానుజ పదపద్మముల గొలుతు ॥34॥

తల్లివలెఁజేర్చుతండ్రిగా త్రాతయగును
గురునిగతి జ్ఞానమార్గంబు వెలుక పరచు
శ్రీ హరి పదపద్మంబుల భృంగముగుచు
దేశకాలాల తెలియకే తేలెగురుడు ॥35॥

ఆపలుకులలోఁ గల యే
దోపరమార్థము సహృదయదోహదమై ని
త్యాపగ మై నిశ్చలసం
స్థాపిత సుఖమై సదస్యతనువుల ఁదనిపెన్ ॥36॥

వారిహృదయాలు భక్తి తో పల్లవింప
శేముషీశక్తి కనులలో చెలువ మొసగ
ఎవ్వడీమహోమహితాత్ము డేటి కిటుల
నివురుగప్పిన ని ప్పుగానిండె నిచట ॥37॥

అకట! వంటింటి శక్తిగానడగె నవెడి
ప్రజలపల్కులుములుకు లై బాధ పెట్ట
తులసి లేహృదయంబుతుత్తునకలయ్యె
అత్తగారికి తలకొట్టినట్టులయ్యె ॥38॥

ఇరువురు వెస రామానుజ
చరణంబుల వ్రాలి దేవ! క్షమియింపుడు దా
శరధి ప్రజ్ఞ నెఱుంగక
పరిచర్యల పాలు సేయు పాపులము మమున్ ॥39॥

ఇది మీ కిరీటమణియని
మదినెఱుగకయింటి పట్టుమాణిక్యముగా
గుదిగొంటిమి సేకొనదగు
బ్రదుకులపరమార్థధామ భక్తుని మిరే ॥40॥

ఈతని సంపర్క మసం
ఖ్యాతజనాభీష్టకరము గాన కుటీర
జ్జ్యోతిగ కనలేము జగ
జ్జ్యోతిగ వెలిగింపుడితని సూనృతచరితా! ॥41॥

స్వామి! మాయిల్లువెలుగయ్యె, మామనసులు
తేటబడె, నిర్వికారమై తేజరిల్లి
దాశరథి భక్తి, జగతికే తంపుఁగూరు
యింట సూర్యుని భరియింప నెందరికగు? ॥42॥

వారినాలించి, లేనవ్వు వదనమంద
గింప, రామానుజుండు భక్తిప్రపత్తు
లింటినే కాదు మహిని వెల్గించుకాల
మిప్పుడాసన్నమయ్య నంచెదిరి నెఱిగ ॥43॥

అహమెరుంగువాడెయిహమున ఁబరము ఁబం
డించునప్పుడే వరించువిద్య
ద్రవ్యమాభి జాత్యమానందకరమౌను
విశ్వసుకృతులందు విమలుడగును ॥44॥

భక్తి జ్ఞానాబ్ధి చంద్రుడు భక్తి కలయ
బండిన ఫలరస మిది నిర్వంచనము
కర్మసాఫల్య ఫలము శుకప్రముఖుల
అనుభవానందమిదికానిదన్యమేది? ॥45॥

చరమ శ్లోకార్థంబీ
పరి వివరింపగురుడు, పరిపక్వాత్ముండై
శరణాగతిశరధికి దా
శరధిశరత్పూర్ణచంద్ర సన్నిభుడగుచుఁ ॥46॥

సంభ్రమమున వచ్చిగురునిచరణ మంట
అత్తకోదండకాశ్చర్యమయ్యె వారు
మూగలై గృహోన్ముఖులైరి బుద్ధికంద
దయ్యెను గురుశిష్యుల ప్రణయామృతంబు ॥47॥

త్యాగభోగ యోగ సమన్వయప్రవర్త
కుడుగుణగ్రహణాభిరాముడు దయాప
యోధి రామానుజుడొకడేయొజ్జ బ్రహ్మ
మొకటెతిరువేంగడపతి యీయుర్వికెల్ల॥



తిరుపతి శ్రీనివాసుడు

# 11. సాక్షాత్కారము

అంతర్ముఖుడైయతి స
ర్వాంతర్యామిన్ జగద్విలాసుఁ శ్రుతిసీ
మంతములక్ష్మీకాంతుని
చింతింపగ భావవీధి శ్రీహరినిలిచెఁ ॥1॥

ద్రవిడభాషయే మధురమందారమాల,
యందులోదిరువాయ్మొడి ఆర్ద్రగీలి
ఆత్మనేచీల్చుకొనివచ్చునమృతధార
లనుభవించిన కొలదియాహ్లాదముబుకు ॥2॥

అయ్యమృతగీలి తిరువేంగడాద్రివిభుని
మాటిమాటికి వినుతింప మరులుగొని త
దీయసౌందర్యమున్ గ్రోల తేటివోలె
యతిమనంబుతిరుమల పై నాడు చుండె ॥3॥

అంతలో నడియేన్ దాసనంచు పదము
లంటి ద్రవిడదేశపుభక్తులాడిరిటుల
వేంకటపతిని దర్శించి వేగమిమ్ము
నర్చనేయగవచ్చితి మంచు నిలువ ॥4॥

ఆ దరోదారమలిని, రామానుజుండు
వారలన్ చూచియచ్చోటి వార్తలేమి?
మాతిరుమలనంబి సుఖంబె, మనయనంత
సూరిపుష్పకైంకర్యంబు సొగసులిడునె? ॥5॥

అందరు సుఖంబె స్వామి మాహాత్మ్యమేమి
చెప్ప? దేవ! శివాద్వైతశీలుడా(ప్ర
సిద్ధనాయనారులె నేడు శ్రీహరికృప
నందతిరుమలనంబితో నరుగుదెంచె ॥6॥

కాళహస్తి ని వదలనేగానియతడు
కొండకోనేటిరాయనిగుట్టుదెలియ
అర్చనావిశేష క్రమంబనుసరింప
పాటుపడె నంచు వార లాపట్టువిడువ ॥7॥

అనువుగామహాపూర్ణుడు వినయవినమి
తాంగుడైవచ్చి, దేవ! వేదగిరినుండి
వార్తలేతెంచె గోవింద భట్టుతోడ
మనతిరుమల నంబి, గిరికి మరలిరంట ॥8॥

నాకుచూడ మీరొకసారి నారణాద్రి
కేగ, శ్రీవారి సిద్ధాంత మినుమడించు
సురలునరులు తిర్యక్కులుతరులతాళి
సహజశక్తులుద్దీపించి, జగతి వెలుగు ॥9॥

అప్పుడేసప్తగిరి శక్తిజగతినలము
మనసుమారు గోవిందుడే మనకు దక్కు
విశ్వమంతయుకల్యాణ విభవమగును
సార్థకమగు మీయతిరాజ శక్తులనగ ॥10॥

అన్నిటికి రంగడేయిటనటనటింప
నేనునాదంచు నేరీతి నిలుతునంచు
అక్షులరమోడ్చి చూడనేత్రాంతకాంతి
దిక్కులెగయగ పూర్ణుని తేరిచూచి ॥11॥

తత్త్వమొకటె రెండు తనువులై నా ల్గచే
తులోకపలుకె గురుని పలుకుకాగ
రంగనాథుడె తిరువేంగడ యొడయుడై
బిలిచె నడతు మతని కొలువనేడె ॥11॥

పోయెద నేడేరంగా।
నీయెదసౌభాగ్యమెల్ల నింగికిముట్టగ
ఆయున్నతోన్నతగిరి
శ్రీయుజ్జ్వలదీపకళిక సేవింతునిదే। ॥12॥

పోయివచ్చెద నని మహాపూర్ణుజాడ
దాశరథికురేశులు వెంటతరలిరాగ
మనసుపన్నిద్దరాళ్వార్లవినుతిసేయ
కలియుగ వికుంఠ విభుఁజాడ కదలుచుండి ॥13॥

మార్గమధ్య స్థులై కడుమన్ననగొను
వరదయజ్ఞేశ మూర్తులన్ గురుడు దలచి
ముందు తమరాక యజ్ఞేశ మూర్తికి తెలు
పంగ నాతడుత్సాహ సంభరితుడయ్యె ॥14॥

స్వపరివార సమేతుడైవచ్చు గురున
కద్భుతస్వాగతంబిత్తునంచునతడు
కార్య పరతంత్రుడై పోయెగాని వార్త
దెచ్చుభక్తుల క్షే మంబుఁ దెలియడయ్యె ॥15॥

వేచి వేచి వారువిధిలేక పొరుగింట
నీరుకుడిచియెటులో। చేరిగురుని
దేవ। తమపయనముదెల్పి యజ్ఞేశుల
కిటులవచ్చితి మని యెదుటనిలున ॥16॥

వారిమోములెగాదిగపార జూచి
వేగతీర్థప్రసాదముల్ వీరికిండ
టంచు గురుడాప్తభటుల కట్టడియొనర్చి
యజ్ఞమూర్తియహంకారమాత్మకలంచ ॥17॥

ఎదిరి యాకలిదప్పలేయెత్తుకొనని
వానియైశ్వర్యమేటికి? భక్తియేటి
కి? ఫలరహితమౌ సంపంగి వృక్ష మ కట
నరుని గాదని నారాయణయన, సుఖమె? ॥18॥

వరదునింటికిందె మనమందరము పోద
మచటరంగడే కలడనియతినడువగ
సేవకులగుండెఝల్లనె శిష్యతతి, త
లంచె నేడెయేకాదశీవ్రతమునకు ॥19॥

ఇంతలోవారు ఎందుని యిల్లుజేర
మూసినద్వారము్ యతిముఖ్యుడెలిగి
పిలువ, దేవ! రాలేను ముందరికి, ...
కనికరింపుడనుగరితగళము వినియె ॥20॥

తత్క్షణమె కప్పుకొన్నవస్త్రంబు దీసి
జాలరంధ్రాన విసర నాచార్యు డువిద
ముందుకేతెంచిగురునకు మ్రొక్కి యె ...
భక్తులనుజూచి, తంవంచిబలికెనిటుల ॥21॥

ప్రక్కనున్నవాగున మున్గిరండు, నెంత
నే, హరిప్రసాదంబువడ్డింతు నయ్య,
యింతలో, మన్త్రియుడిట కేతెంచుటనుచు,
తన్నులాంజూచుకొంచొడ్డిదారిబట్టె ॥22॥

తన్నువలచు కామాంధవర్తకుని గాంచి
తెలినగవుదోప నీరేయితృప్తి పరతు
నిన్ను మద్గురు భిక్ష కై నీవు వెంట
నే పదార్థముల్ మాయింటనింపుమనుచు ॥23॥

వెనులిరిగిశుచిస్నాతయైవివిధ భక్ష్య
భోజ్యముల సిద్ధవరచె, నమ్మోహనాంగి
సతి జరిగినవృత్తాంతంబు పతికిదెలుప,
వరదుడుత్సాహియై భక్తి నిరతి మునిగె ॥24॥

సపరివారంబుగాశుచిస్నాతులగుచు
గురుడు గురుశిష్య బృందంబునరుగుదేర
అడుగులకుమడుగులిడుచు నాసతీప
తులనుపమ గురు భిక్షచే గొలిచిరంత ॥25॥

కట్టుగుడ్డకే గతిలేని కాంతగూడి,
పూటపూటకు భిక్షాన్నము గొని, బ్రదుకు
ఈకటు దరిద్రుడెక్కడ? యీయపూర్వ
షడ్రస సోపేత భక్ష్య భోజ్యాన్నమెటులో?ి ॥26॥

హరిలీలావిభవంబో!
గురుకరుణాప్రాభవ మిటుకూడుకొనెనో! ఆ
వరదుని ప్రపత్తిఫలమో!
స్ఫురింప దీమహిమయంచు చూపరులాడ౯ ॥27॥

తూర్పుకొండపై చలివెల్గు తొంగిచూడ
ముసుగుచీకటు లపరాబ్ధిమునుఁగ దొడగె
ప్రీతిగురుని నైవేద్యమున్ చేతబట్టి
మగువతోవచ్చి వైశ్యుని, మగడు చూచె ॥28॥

నీవు పంపుపదార్థముల్ నిర్మల మయి
గురుని తీర్థ ప్రసాదమ్మై కూడె, నిదిగొ
నీవుగోరిన రూపసి, నీదెయనగ,
వరదు జూచి వర్తకుడు దిగ్భ్రాంతి మునిగె ॥29॥

ఈవతి వ్రతాదేవత, మీపవిత్ర
మౌయచంచలగురుభక్తి మతినెఱుగక
కేవల శరీరతృష్ణనికృష్టుడైతి
తల్లి! మన్నింపుమంచు పాదాల బడగ ॥30॥

అయ్యా! యిది మహావిద్వాంసులందుకూడ
కలుగుహృదయదౌర్బల్యమీకలుషముడచి
తల్లియైనతి జీవులందరినిగాచు
కానరిత్త శోకింపక జ్ఞానివగుము ॥31॥

లెమ్ము, గురునితీర్థప్రసాదమ్ములందు
కొనుము, జన్మజన్మల నుండి గూడుకట్టు
పాపరాసులుక్షణములో బా యు, నంచు
గురుని తలచుమతీర్థమా వరదు డిచ్చె ॥32॥

ప్రీతితో ప్రసాదమటంచు (బెట్టెతల్లి
ముప్పురేకాత్మ లైవచ్చి మోకరిలగ
కరుణరామానుజుండు మంగళము పలికె
వారు పరమ వైష్ణవకళాప్రభువులైరి ॥33॥

శరణుశరణంచు యజ్ఞమూర్తి రభసమున
వచ్చిరామానుజాచార్య పదములగన
వలదువలదు నీమోము చూపవల దింక
రంగడీదృష్టిసోకినరగులు ననగ ॥34॥

వడవడవడంకె వేదవిద్వాంసు డాత్మ
తడబడె, నొడలు చెమరించె నుడులడంగ
నివ్వెఱపడు దీనుగని, సన్నిధిగలపరి
వారమంతయు దిగ్భ్రమ స్వాంతమయ్యె ॥35॥

వరదుడు సతీ సమేతుడైవచ్చి దేవ!
యితడు మీబంటు మాయూరికెల్లపెద్ద
యితని గురుభక్తియే మాకు నేడుగడ తె
లిసియొ, తెలియకో తప్పుకలిగె మహాత్మ! ॥36॥

దయఁదనుపఁదగు స్వామియే తాల్మిదప్ప
తల్లి చనుబాలె విషమైన ధాత్రి పగుల
బ్రతుకుటెట్టులో! బ్రతికి పైఁ బడుట యెటులొ!
తాళుటెట్టులో దప్పించు దైవ మెవడొ! ॥37॥

అనగ, నిలునిలువరద, నీవ్యధయెగాదు
వీనియైశ్వర్య గర్వంబు, విదితమయ్యె
కడపఁదొక్కు భాగవతులగాదని హరి
గొలుచునాడంబరమె మహాప్రళయమయ్యె ॥38॥

మీవిమలప్రణయమె నే
డీవిపరీత ప్రళయమునిటుదప్పించెన్
పావనమౌ వైష్ణవసం
భావితభక్తి ప్రపత్తి బ్రతికించుమహిన్ ॥39॥

ఈ మెయింటి చాకిరియొక్కటేగతి మన
యజ్ఞ మూర్తికి సిరిజగ ద్వ్యాప్తముగ ప్ర
మించుటవే వైశ్యునకు హింబిమెసాహ
చర్య తపమె, వరదుని వైష్ణవబలమని ॥40॥

దాశరధికురేశులు ముందుదారి చూప,
కలియుగవికుంఠనాధుని కలిమి తలచి,
తలప పన్నిద్దరాళ్వార్ల తత్త్వమెఱిఁగి
సత్వరంబున యతిజూచె సప్తగిరిని ॥41॥

పూర్ణకలశంబుతో యతిన్ పూర్ణుడెదురు
కొనగ గోవిందు డానంద కుధరమయ్యె
ప్రజలు భక్తులు మండల ప్రభులు పొగడ
నేదియు నెఱుంగ కా చార్యుడెదుటనున్న ॥42॥

శేషపర్వత ఫణిఫణాశేషరుచుల
కనులమిర్మిట్లు గొలుపగకదలడయ్యె
అంజనాద్రి మహైశ్వర్యమాత్మనిండ
ముందుబడలేక యతిరాజు మోకరిల్లె ॥43॥

గరుడగిరిని స్మరించిన క్షణములోన
కట్టుపడినిల్చె భక్తాగ్రగణ్యుని హృది
వృషభ శైలమున్ తలపోయ విప్రవరుడె
శ్రీనివాసుని కీర్తించె చిత్తమలర ॥44॥

శాక్తులకిది శ్రీచక్రము శైవ తతికి
లింగ మయ్యె భక్తులకీ గిరిప్రకరము
నిర్వికార సాలగ్రామ నిభమటంచు
మాటిమాటికి మ్రొక్కురామానుజుండు ॥45॥

ఇదిపవిత్రమౌ శరణుల హృదయ సీమ
త్రొక్కలేనని మోకాళ్ళతోయతిపతి
ప్రాక్కిపైకి చేర నారాయణాద్రి
కందరాల విన్పించె నాకాశవాణి ॥46॥

లెమ్ము లేలెమ్ము నెత్తురుచిమ్ము భయద
సేవ నీక్షింప లేక నిర్జీవమయ్యె
నీ సురారామసుందర సృష్టి అయ్యె
నీపద స్పర్శ విరియు వనీవనులన ॥47॥

ఎచటిదోయని యతిలేచి యిటునటుగన
కొమ్మకొమ్మయు కోకిలకూతలురలె
పూలగంధమ్ముతోకొండ గాలులెగసె
జలజల ధ్వని సెలయేళ్ళుగళము విప్పె ॥48॥

దాశరథికురేశులకంటతడి తొలంగె
భక్తుల ముఖారవింద ముల్ పరిమళించె
పరిచరభటాళి కీర్తింప పరమగురుడు
కొండకెఱఁగె సాల గ్రామగోపురమని ॥49॥

సాధు వర్య పద స్పర్శ సంతసించి
అలరుదండలందించి యనంతభట్టు
దేవ! యివి గురుభక్తిలో దినదినంబు
హరి పదంబుల వాడని విరు లనంగ ॥50॥

అన్న నీ శ్రద్ధ భక్తినత్యంత సుంద
ర సుకుమార భాగ్య ంబుచే ప్రకృతివిరిసి
కొండకోనలేయద్భుతగుణములందె
బ్రతుకు సార్థకంబై శుభప్రదముగాంచె ॥51॥

నిజమునిజమని ఘోషించె నింగి కెగయు
శుకపిక పరభృతమధుర సూక్తులవిని
దరహసితవదనాబ్జంబు మరుల గొలుప
అనుఁగు భక్తుని యతికనులార పొగడె ॥52॥

అంత తిరుమలనంబి యత్యంత భక్తి
తెచ్చి తీర్థ ప్రసాదంబులిచ్చి లేవ
గ యతి యాయాస పడుచుంటఁ గాంచి రక్త
సిక్త మగు జానువుల ఁజూచి,చెదరగుండె ॥53॥

కలగి దివ్యౌషదమని వేంకటపతి పద
తీర్థ మందించి సురవల్లిఁదెచ్చి బజ్జి
చేసి రసము మోకాళ్ళకుఁ బూసె ప్రణము
క్షణములో మాసె యతి, తల్లి చలువ నెఱిఁగె ॥54॥

ముందు నిలచిన శ్రీశైలపూర్ణుఁజూచి యిపుడ
స్వాగతంబిచ్చియంతలో శైలమెక్కి
స్వామినర్చించి తీర్థ ప్రసాదములిట
తేర శిష్యులే మీకరు దైరెయనగ ॥55॥

గురుని సేవింప నాకంటె చిరుతలిందు
నెవ్వరున్లేరు లేరయ్యాయీవయోవి
కారగుణములు తనువుకేగాని మనసు
కంటువన బుధవ్రాతమేయతనికెఱఁగె ॥56॥

తనువుగాయంబుమాన్పమాతల్లివగుదు
మనసు నిల్ప తీర్థమొసగుజనకుడగుదు
అహమడపశే ముక్షీ భక్తుడగుదు వీవె
మామవో ! గురుడవో కాచుమాధవుడవొ। ॥57॥

తెలియదని పుష్కరిణిలో జలకమాడి
ప్రకృతి నవనవోన్మేష సౌభాగ్యయంచు
నడుగడుగున గోవిందనామాక్షరాల
స్మరణసేయుచు ముందుకు సాగుచుండె ॥58॥

ఇంతలో మల్లె పూ పొదరింట నొక్క
కాలనాగుగరళగళగహ్వరంబు
తెరువ మృత్యు దంష్ట్రల మధ్యకరముసాచు
వ్యక్తి నింగాంచి చకితుడైయలినిలువగ ॥59॥

అన్న! యంచుగోవిందుడే యతి పదంబు
లంటి నిట్టూర్పు లెగయ నోరారపిలుచు
మామనే తలపోయక మఱిమఱి హృది
నంటు మిమువీడి యేకాకినై తిరిగితి ॥60॥

ఈమాటలటుండనీ నీ
వామృత్యుముఖంబునందు హస్తముచాపఁ
నామదివిలవిలలాడెను
హే మృత్యుంజయ! రహస్య మే మోయనగాన్ ॥61॥

దానిదౌడముల్లు దవిలి మ్రింగఁగడు
బాధ పడుటెరింగి పట్టినోటి
ముల్లుదీసి దానిపోవిడిచితి నాన్ వి
శాల నేత్రుడగుచు సద్గురుండు ॥62॥

కేవలమృత్యుంజయుడవు
కావయ్యా భూత కోటి కావగ నిలవై
గోవిందుడవై పుట్టిన
గోవిందుడవంచుదబ్బుకొనె సహజన్ముఁ ॥63॥

అదృశ్యమునుహరాత్తుగ
యాదృచ్ఛికముగకనుగొన అశ్రుకణంబుల్
పోఁదుడుచుకొంచు తిరుమలు
డాదేవియనుగ్రహమని యంబాయనగాఁ ॥64॥

మేనల్లుండ్రదిరి పడుచు
మానసముల్ విహ్వాలింప మామా యనుచుఁ
మ్లాన ముఖంబుల వచ్చిరి
దీ నాలాప భ్రమణ పు దృశ్యము చూడఁ ॥65॥

ఏ యాపద వాటిల్లెనొ!
యీయెడ మీకంచు నిటకు నేతెంచితి మ
య్యా! యన గురువులసన్నిధి
అయీ శుని దాసులకెటు లాపద లొదవుఁ ॥66॥

మీయిద్దఱి కలయకలో
మీయిద్దరతల్లులాత్మ మెదలగ నొకట్టై
ఆయమ్మలగన్నమ్మయె
మాయమ్మకు నంబ యించు స్మరియించితినా ॥67॥

కుదుట బడి మూల దేవర కూర్చివారు
చింతసేయ శ్రీ శైలుడత్యంత భక్తి
యతివరేణ్యుని కెఱఁగి యాచార్య దేవ!
పెద్ద లాడు కధనొకింత విన్నవింతు ॥68॥

మాతండ్రీ గిరి శిఖర
జ్యోతి సమీపంబునందు శుద్ధ వ్రతుడై
తాతలమెప్పించు జగ
న్మాతను పూజించి పొందె మమ్మని వింటిఁ ॥69॥

అంతెకాదు మాయయ్యనిరంతరంబు
త్రిపురసుందరిన్వ్రేళ్ళ పై త్రి ప్పుచుండు
ఎప్పుడిట కేగు దెంచిన నెలుగు నెత్తి
బాలబాలా యని అరచి పరవశించు ॥70॥

లలిత మోహన లావణ్య లక్ష్మి [illegible]
శుక్రవాసర పూజల సుస్థిరమైన
రింప నొకసరి యామును లేగుదెంచి
నన్ను పిలిచె శ్రీశైల పూర్ణా! యటంచు ॥71॥

ఆ పలుకు లాదరించి నేసల్లులిరువు
రు కడు భక్తితో మానుకుమ్రొక్కగా
నాల్గు చేతుల తల్లికన్పట్టెనంచు
సంభ్రమించి పూర్ణుడు హరిస్మరణ ॥72॥

పజ్జనున్న గోవిందు డీప్రణయమె నను
కాళహస్తిని మర పించి కట్టితెచ్చె
తుదకు బ్రహ్మణ్య దేవుని పదము చూపె
రూపమే లేని వానికి రూపమబ్బె ॥73॥

గుణములే లేనివానికి గుణములనగ
నిజమునిజము నీ మాటలు నిక్క మనుజ!
మేన మామ అనుభవంబు మేల మగునె?
ఆళవారల వాక్కులత్యంత ఋతము ॥74॥

పదములంటుజటయు, ప్రభలొల్కు మకుటంబు,
శాతభల్లమొకటు, చక్రమొకటు,
పన్నగాభరణము, బంగారు మొలతాడు,
కలుగు తిరుమలేశు గొలుతు మనరె? ॥75॥

ఒకనాటి తల్లి యే యిం
కొకనాడు కుమారుడై మహోన్నత భక్తా
ళికి అనువగు రూపంబున
ప్రకటిత మగు చున్న బ్రహ్మ పదమీ పదమే! ॥76॥

ఈపరబ్రహ్మమును జగద్ధిత మొనర్ప
సకలవేద వేదాంగముల్ సాక్షిమనకు
మనిషి దేవుడై దేవుడే మనిషికాగ
కావ్య గీతామహాత్మ్యముల్ కలియఁబలికె ॥77॥

తిరుపతి చరిత్రకందని
పరతత్త్వమనాది నుండి భక్తుల కోర్కెల్
నెరవేర్పగ వివిధాకృతి
వెలసిన నారాయణుండె వేంకట పతియౌ ॥78॥

హరియే నారాయణియై
హరునింగూడగ త్రినేత్రుడని మనయాళ్వా
రులకీర్తించిరి గిరి శం
కరనారాయణుడె మమ్ముకరుణించుసదా! ॥79॥

ఎిరబిరరామానుజుడున్
తిరువేంగడయొుడయు ఁదలప దేవా! నీ పా
ద రజమ్మె భూషణ మీ
శరణున కని మ్రొక్క దివ్యశక్తులు దోచె ॥80॥

జీవంతకళల్ వెలిగిడి
యావేంకటపతి పదాబ్జ మంటు మధుపమై
గోవిందుడు, వక్షస్థలి
దేవీ హారముగ మామ తెల్లంబయ్యె ॥81॥

అంతనంబి పాదంబుల నంటి పలికె
తల్లి హృదయస్థ మణివి తత్వార్థ నిధివి
రామ తత్త్వమే కంఠ హారంబు నీకు
కొంతవివరింపు మని యతికోరగానె ॥82॥

మీకు దెలియని దున్న దే? నాకు దేవ!
కొండ పై యూడిగము చేసికొనెడి వాడ
పుణ్యమున మీకు బంధు వై పుట్టితి ని ట
తత్వ మేమొ! కాని కథ కొంత వచియింతు ॥83॥

అందఁబోయెడి రాజ్య సింహాసనంబు
క్షణములో త్యజియించిన తనయుడతడు
విడువకే వెంట ఁబడు సతిఁ పుడమిగావ
కాము కత్త రించినవిలుకాడతండు ॥84॥

సకల భోగభాగ్యంబులు సంక్రమింప
పుట్టనున్న నాత్మజులనే పో విడిచి, అ
హంక్రియ , నెఱుఁగ కే జగదాత్మ యైన
నరుడె నారాయణుండయ్యె నన నిరువురు ॥85॥

మామ పాదాల పై మఱి మఱి పడి మది
తత్తరింపగ ధారలు ధార లైస్ర
వింప కన్నీరు మాటలే పెగలవయ్యె
సంభ్రమానంద చకితుడై చల్లగ యతి ॥86॥

ఏడు దీవుల కను సన్న నేలుకొన్న
అమర భోగంబు లివట నే యందుకొన్న
నిఖిల వేద శాస్త్రముల జీర్ణించుకొన్న
భక్తి చే కల్గునీప్రజ్ఞ పడయమెందు ॥87॥

కోరికల్ లేని సంసార సారమైతి
తన్ను తానెఱుంగకయె యందరనెఱిగితి
కొండనే నమ్మి కొండంత గురుడ నైతి
యోగమో! జ్ఞానమో! భక్తియో యెఱుంగ ॥88॥

రాజ్యము రమణి పుత్రు లీత్రయము చూడ
నుత్తరోత్తర ప్రబల మ్మై యొప్పు చుండు
తనుమనో హంక్రి యలెరుగు ధర్మ నృపుడె
బ్రహ్మ మీ రాజ్యమే రామరాజ్యమగును ॥89॥

కన్ను లార నాటి కధ నాల పించు వా
ల్మీకి వాక్కు గేయ కృతిగనెరిఁగి
మనిషి దేవుడైన మర్మ ముబ్రహ్మను
భూతి తెలిసి తెలిపె మాతులుడన ॥90॥

అన్న మాట లాలించుచు చిన్నవాడు
మామకాదుకాదు గురుని మాటలిప్పుఁ
డిప్పుడే సుంత నడ నుడు లె ఉుక పరచె
కాని దేవుడే నరుడైన గతియెటు?లన ॥91॥

అయ్య గోవింద! యీ సమస్య సడలింప
నాకు గాదే నెఱిగిన దంతయు నొకటియె
ఎంత మమకార ముండిన నితనిఁ దలప
నాటి రామానుజుండె కన్పట్టు నాకు ॥92॥

తల్లిదండ్రి గురుడు దైవ మీయందఱున్
రాముడనుచు బ్రతుకు లక్ష్మణుండె
నన్ను నిన్ను జగములన్నిటిఁదా గావ
పుట్టిన మన పూర్వ పుణ్య మితడె! ॥93॥

ఇతడనుగ్రహింప సమస్యలెల్ల తీరు
అంత నారాయణుడె నరుడైన తీఱు
మనమెఱింగెద మన్న రామానుజుండు
ఉలికి పడుచు, నంతర్యామి పలుకులవిని ॥94॥

ప్రకృతి నేర్పినటుల శ్రుతుల్ పలికినటుల
గురుడనుగ్రహించి నటు నాకు మతి దట్టి
నంత నిర్వంచనముగ నుతింతు నంచు
కన్నులరమోడ్చ కృష్ణుడే కానుపించె ॥95॥

చెరలోఁబుట్టుట, శిశువై
పరి మార్చుట శత్రుల, ఫణి పై నాట గిరిఁ
ధరియించుట హరిహరుల
బ్బుర పడ రసగీతి వినుచు పూర్ణుని గొలుతుఁ ॥96॥

బాల గోపాల మురళిని ప్రస్తుతింతు
రాసకేళీ విలాసుని ప్రణుతి సేతు
శ్యామ సుందర మూర్తి నే సంస్మరింతు
భువన మోహన స్వామినే పూజసేతు ॥97॥

మతికి చిక్కనిచేష్టలు మఱపురాని
రూప మూహింప గాని స్వరూప మాత్మ
కందరాని విరాడ్రూప మందర మది
నాడుచున్న యంతర్యామి నర్చ సేతు ॥98॥

బ్రహ్మమయ్యు సామాన్యుని వలె నటించు
నిర్గుణుండయ్యు కల్యాణ నిలయుడగును
యందియందకయంతటవ్యాప్తి చెందు
కృష్ణుడేసరుండౌచు రక్షించు జగతి ॥99॥

ఆ పరబ్రహ్మ మీగిరిన్ వ్యక్త ...
అతని కనులార వీక్షింప ఆశకలుగి
పుష్కరిణీ జలంబు లశుచీభూతుడగుచు
పరమనిష్ఠాగరిష్ఠుడై భక్తులదరి ॥100॥

దీక్ష నేక భుక్తంబుతో దివ్య మైన
రామకావ్య రసా స్వాది య్యైమెరయగ
వెంట నే వేంకటపతి కన్పించు నంచు
చేరువగల జనాళికి చెప్పియతియు ॥101॥

రాముడె నారాయణుడై
రాముడె వైదేహరాజ్యలక్ష్మీ ప్రియు డై
రాముడె తనకు సమస్తం
బై ముందు నిలువ ప్రమోద భరితుండయ్యెౕ ॥102॥

పితృ వాక్యంబున సత్య
వ్రతుడై సతిగావనేక పత్నీ వ్రతుడై
క్షితి ధర్మ రక్ష శరణా
గతవత్సలు డై జగాలఁ గాచె నృపుండై ॥103॥

గృహము సంఘము రాజ్యము బృహదఖండ
భువనముల్ వెల్గ లీన ముప్పురిగొని
సత్యధర్మ విక్రమముల్ స్వామియయ్యె
నన నిజము నిజమని మాము నరుగు దెంచి ॥104॥

రామతత్వా భి రతుడవై ప్రజల గావ
పూను వ్రతము మాసాంత మై ముగి సెగాని
చెప్పరాని దుస్స్వప్నాన చెదరె మనసు
కలియుగమున కుతర్కమే గ్రక్కె విషము ॥105॥

ఆర్థికోన్మాద పూరి తంబైన జగతి
భయమె పడిపోయె భక్తియే పట్టుదాయె
హృదయ మెప్పుడో శుష్కించ నీశవాల
చుట్టు క్రొత్త దయ్యము లేవా కొట్టు కొనును ॥106॥

తల్లి బిడ్డలకున్న బాంధవ్యములెగె
దేవుడను మాట నవ్వులఁ దేలె గాని
నిన్నుఁ జూడ నా మది కడు నిర్మల మగు
పరిణతజ్ఞాన మొకటి యే భక్తి యగును ॥107॥

అనచింతింపకు మామా!
మనవెనుక యుగాల పుట్టు మర్త్యామర్త్య
ప్రణుత ప్రాభవముల్ నె
మ్మనము తలచినంతనె కలిమల మడగారున్ ॥108॥

ఇంతయేల? దివ్య మీ యేడు కొండల
గాలి సోక గానె కర్మ రోగ
బాధ బంధమడగు ప్రత్యక్షముగ చూడ
నింక వేమి యగునో! యేమి చెప్ప? ॥109॥

కలలన్న భ్రమించెడి మది
చిలువల పొరలగును కాని స్థిరమగునే జీ
వులనలరించెడి కళలఁ
కలకాలము వేంకటపతి కనుపించునిటన్ ॥110॥

పుట్టుకలేనిది గిట్టని
దిట్టిట్టని చెప్ప రాని దిది యే బ్రహ్మం
బుట్టివడ శ్రీ విరహమె
గట్టులతపియింప జే సె కమ్మని పొడ వై ॥111॥

నలువ ధేను వై శివుడె వత్సమ్ముగాగ
వచ్చివిరహ వాల్మీకి పై ఁబాలు కురియ
మేల్కొనుచు మింటి రా కన్నె మేన్పులకల
కట్టుబడి కట్టెదు ట పద్మ కై తపించె ॥112॥

అంత నా స్వామి స్థాణు వై యాగిపోవ
పద్మ పత్రాయ తాక్షుడై పద్మ ముఖుడు
పద్మనాభు డై పద్మ గర్భ ప్రముఖుల
ప్రస్తుతింప వెలుపుల లోపలను వెలిగె ॥113॥

వాసుదేవు డే వాసనావశుడు కాగ
విష్ణు వే జగత్కల్యాణ విగ్రహంబు
కాగ నారాయణుండె వేంకటపతిగ చ
తుష్కరాబ్జుడై నిల్చి భక్తులు తరింప ॥114॥

రండు దర్శింతు మని యతిరాజు గిరిని
చేర నాలయ కుడ్య భాగాల రామ
కృష్ణుల చరిత్ర చదువుచు విష్ణు లీల
యంచు నాలయంబును చుట్టు నవసరమున ॥115॥

సింహ శూద్రికల్ కాంచి నిశ్చింతుడగుచు
పద్మనాభ సహోదరిన్ ప్రణుతి సేసె,
అల్లనల్లన ముందున కరుగుదెంచి
గాంచిహరిని ఓమ్మని పులకాంగుడగుచు ॥116॥

మాధవా! మధుసూదనా! మహదనంత
తేజ! మన్మథ మన్మథా! ది వ్యమూర్తి!
మన్మ నోనాయకా! చూపు మ భవదద్భు
త స్వరూపంబునా వేంకటేశ్వరుండు ॥117॥

నాగ భోగి యై బిల్వార్చ నంబు తల్లి
తల్లిగతిరు మజ్జన మాశ్రితజనకోటి
గావ వైష్ణవ శంఖ చక్రాల తోడ
నటనె నారాయణుండు ప్రత్యక్షమయ్యె ॥118॥

ఎదలోస్పష్టంబుగఁదో
చుదివ్య మంగళ కరుండె సుందరుడై క
ట్టెదుటన్ గన్పింపగయతి
చిదచిత్తులకీశుడితడె సేవార్హుడనె ॥119॥

నంబి పులకిత గాత్రుడై నతియునర్చె
పొంగిగోవిందుడానంద పూర్ణుడయ్యె
వంగిదాశరధి కురేశ భక్తజనము
మఱిమఱినమస్కరింపుచు మౌనమూన ॥120॥

కర్మయోగినంబి, కడువిరక్తుండుగో
విందు డలర, సిద్ధులందుకొన్న
యతినృపుండు, గురుడెయాపరతత్వమం
దఱకుఁజూపె భక్తి దనిపె జగతి ॥121॥

శాక్తులాదిమశక్తిగా సన్నుతింప
శైవులాపరాత్పరు సదాశివ మొవర్ప
వైష్ణవులు ప్రాణపదమని పట్టుకొనగ
తలచినట్లు ప్రత్యక్ష మౌ దైవమితడె ॥122॥

స్వామికల్యాణ గుణముల సంతరించు
కొన్న పుణ్యమూర్తులు మీరు వెన్నునికి ప్ర
తిస్వరూపమారంగ డీ దివ్యలీల
చాట గురుకార్య మీడేర్ప సాగెదనన ॥123॥

కట్టెదుటకన్నులార్పక గాంచుచున్న
సహజునింగాంచి ముందుకు సాగనట్టి
యతినెరిగి మామగోవిందు హస్తమిడ్చి
గురుని పాదాలఁజేర్చి వీడ్కొల్పగానె ॥124॥

అనుజు డేతేర ప్రీతి రామానుజుండు
ఎల్లరకు మ్రొక్కి విడ లేక యేడుగిరుల
వేంకటపతిం స్మరిం చుచు వీడెనటులో!
ప్రణయ బంధమేయిమ్మహిఁ భాగ్యమొసగు ॥12

గురుకార్యవ్రతులీశ్వర
వరసంజాతులు మహాప్రభావజ్ఞులు విశ్వరహస్య
మెఱుగు కారణ
పురుషులిరువురు వెస రంగపురికే తేరఁ ॥126

యామున గురుశిష్యప్రశిష్యతతివచ్చి
స్వాగతంబిచ్చి రామానుజ ప్రవరుల
పాదపద్మముల కెరఁగి ప్రక్కనున్న
భస్మ రేఖాంకితలలాట వదనుజూచి ॥127

అపరశంకరుడనియాత్మదెలిసిన గో
విందపదములంటవిముఖులైరి
అంతవెంటనే మహాపూర్ణు డేతించి
వారిపదములంటి ప్రణుతి సలిపి ॥128

శంకరప్రియుండుసాక్షాన్మహావిష్ణు
గన్నులారకన్న జ్ఞానమూర్తి
సర్వ భూతహితుడు సహజాతుడయ్యెరా
మానుజ ప్రవరులకన్నిగతుల ॥129

ఈగోవిందునిగొలువక
ఆగోవిందునిఁ గనలేము హరిహరభేదో
ద్యోగము తగునే? యంత
ర్యాగపరీ పాక సుకృతు లౌభక్తులకుఁ ॥130

హరుడు రామతారకమంత్రమగుచు కడకు
సచ్చిదానందమూర్తి యై జగతి పూజ
నీయుడై భక్తి లోనప్ర మేయుడయ్యె
కాళహస్తీశు డీరూపుకదలి వచ్చె ॥131॥

ఈ మహాత్ముని రాకచేనిచటనున్న
మనకె కాదు శాంతి సమస్త మహికి కలుగు
హరిహరాత్మ కంబైన యీ పరమశక్తి
నాల్గుపాదాల ధర్మంబు నడపు ననగ ॥132॥

కాదు కాదు మహాత్మ, అగ్రజుడు నాకు
అన్నివిధములయగ్రజుండయ్యె నాత్మ
నాత్మతోఁగాక కనులతోనాలకించి
చెవులతోఁజూచి పరమాత్మ సేవసేయు ॥133॥

నాల్గు పాదాల కాదీయనంతశక్తి
వేయితలల విశ్వంబు నే మోయుచుండె
ధర్మమున్ గావ మెత్తని తనతనువునె
పదము లొనరించి కదలియు కదల కుండు ॥134॥

త్యాగభోగ యోగ సమన్వయప్రవర్త
కుడు గుణగ్రహణాభిరాముడు దయాప
యోధి గురుడు రామానుజు డొకడె, దేవు
డన్న తిరువేంగడ పతియెయవని కనగ ॥135॥

ఆ పలుకుల నాలింప క
దాపునగల రంగ విభుని ద ర్శించి యతి
క్ష్మాపతి దేవా, నీదయ
శ్రీపర్వత శిఖరిఁగంటి ఁచిన్మయుఁగంటిఁ ॥136॥

శ్రీవేంకటపతి సన్నిధి
నావైకుంఠ మహిమ మహదైశ్వర్యము స
ప్తావరణమంటపము రా
జీవాక్షుని చూడఁగంటి చిత్తంబలరన్ ||137||

విష్ణువె శివ రామకృష్ణు లై వేంకటే
శ్వరునిగా గిరిపయి కరుణఁజూపి
మత విభేదమడచి మనుజాడై గోవిందు
డిందు మాకుదక్కె డెందమలర ||138||

# అధ్యాయము - 12

జాతికంటె ఘనము సచ్ఛీలము కులము
కంటె ఘనము గుణము కాన యెవడు
గుణముశీలములకు కొఱగాఁడో, వాడె పో
దేవుడై జగతిని తీర్చిదిద్దు||

# 12. గుణమే శివం

గోవిందుని పోకడలున్
గోవిందుని భాషణములు గోవిందుని సే
వా వైచిత్రియు మరమున
కే విపరీతంబటంచు నెంచుచు మదిలోఁ ॥1॥

కొందరేగుదెంచి గురువరా, క్రొత్తగా
వచ్చు శిష్యుని గుణవర్తనములు
వింతగూర్చి వారకాంతల పంచలో
బడె పకపకమంచు ప్రజలు నవ్వ ॥2॥

రంగనాథుని సేవింప రాడు, భక్త
జనములంగూడి కుడువడు, సరసికాడు
సతత మేకాకియై చిత్ర జగతి దేలు
నితని నిత్యర్థమున్ జేయ నెవరికగునా! ॥3॥

విన్నవికన్నవి యెన్నో
యున్నవి వల్లించి యన్నియును మీమనసుల్
భిన్నమొనర్పగలే మన
ఖిన్నత గోవింద యంచు కేల్వ్రేటిగినటుల్ ॥4॥

బిగ్గర యతి కూయ, వేంటనే గోవిందు
డన్న, యంచు నెదుట నంజలింప
మేజా వాణి పంచ మెదలితి వంట స
త్యమొ? యిది యన నాతడవునవు నని ॥5॥

తడముకొనక మరముకడకేఁ గుదెంపుచు
కమ్మని యొకమధుర కంఠము విని
మనసు పులకరింప మైమఱచె పదప
దమ్మెన గురు భక్తి చిమ్మ గంటి ॥6॥

మిమ్ము మీరూపు మీ వాక్కు మెదలగమది
కట్టువడిపోతి నాగమై కదల కుంటి
నెటులో, స్పృహ గల్గ ని చటి కేగుదెంచి
తి నన నది ధనుర్దాసు నిల్లనె గురుండు ॥7॥

తప్పుతెలియగానె తత్తరంబునవారు
తలలువంచి గురుపదాల ముట్టి
నాకుగాదు మీప్రణతులెల్లగోవింద
పాదులకని గురుడు వారిజూడ ॥8॥

వారు వెంటనే గోవింద పదములఁగని
మిమ్ము మీవేష భాషలు మీప్రవర్త
నంబులక్ష్యమెఱుగక పాపంబుగంటి
మయ్య, దాసుల దండింపు డనుచుదరియ ॥9॥

ఒక్కరొక్కరి కేల్పట్టియురుతరగురు
భక్తి దీపింప గోవిందు పాదములన
నివియె యీధూళి యీదలకెత్తు కొనగ
నీకునాకు నీజగతికే నిజసుఖంబు ॥10॥

రండటంచు నతడు రామానుజ పదాల
మాటిమాటికి ప్రతిమనిషితోడ
వచ్చి తానుమ్రొక్కి వారితోఁమ్రొక్కించు
అనుజుఁ జూచి రాము డదిరి పోయె ॥11॥

ఇంతలో సంభ్రమంబున నేగుదెంచి
శోక దేవత రీతి నిల్చు పినతల్లిఁ
జూచిమాడని గోవిందుఁ జూచి లేచి
యతివలించుచు తల్లికి నంజలించె ॥12॥

లోనికేగ నిర్వ్వరిదల్లిదానిటులనె
అయ్యా, యనుకూలవతిగాని ఆలినివిడి
యీ వు యతి వరుండై జగంబేలు టొప్పు
గాని వీడొ, గోవిందు ముఖంబుచూపి ॥13॥

కాళ హస్తి బైరాగుల కలియ నాడె
మరచితిమెటులో, కాని మామమత రేగ
వీని నిటకీడ్చి మమ్ము నేడ్పింప దగునె?
ముల్లు దీసికొ ఱ్ఱడచుట ముద మె మీకు? ॥14॥

చిన్నది సుకుమారి జీవితాశలు వీని
పైన నిల్పు పుష్పవతిని కట్టు
కొన్న సతినిగోలు గోలున నేడ్పింప
నేటి ధర్మమొ యిది యేటి బ్రతుకొ? ॥15॥

ఏమి? ఋషులు పెండ్లాడరే? యింతులన్న
ద్వేషమే? సంతులేక జీవింప దగునె?
ఒక్క మగమొలక్క నాయూహ లూపు చుండె
ధర్మ సూక్ష్మ మేరీతియో? తట్టదనగ ॥16॥

అమ్మ, మీ మాటలందు ధర్మమ్మె కలదు
తత్త్వమునకెప్పుడున్ విరుద్ధంబు కాదు
ఈవుకాంక్షించినటు తమ్ము దేగుదెంచు
ధర్మ పత్ని తోనేకాంత తల్పుడగును ॥17॥

ఆగిరీశుడే సాంబుడై యలరుచుండు
శారదా చతుర్ముఖుడె సంసారి యయ్యె
లక్ష్మితో హరి యీ జగద్రక్ష సేయు
ప్రేయసీ ప్రియతత్వమే ప్రీతిమాకు ॥18॥

మూగయైయున్న తమ్ముని ముఖము చూడ
ఆజ్ఞయంచు నాతడుతల్లిననుసరించె
నింటివారెల్ల రేనుగునెక్కి నంత
సంబరమున జామాతకు స్వాగతమిడె ॥19॥

ఎవ్వరెవ్వ రేయేరీతి నెదఁదలంప
వారివారికాయారీతి వలపు చూపి
నిఖిలగురుపదార్థ నా నిరతి నాత్మ
సార్థకాఖ్యుడై గోవింద చరితుడొప్పె ॥20॥

ముగ్ధమోహన లావణ్య పూర్ణయై య
ధోముఖంబున దుగ్ధ పాథోధి తరగ
ల గతి తడబడుచు లతాంగి రాగ ప్రియుడు
పైట సరిదిద్ది గురుడయ్యె ప్రథమరాత్రి ॥21॥

రెండవ దినాన ప్రేయసి ప్రియుని పూల
పాన్పు కరుదేర గబ్బి గుబ్బల పరిమళ
మల్లనల్లనగది నిండ నంఘ్రి యుగళి
కెంజిగు సలిని జూచి మగడు హరునిదలచె ॥22॥

మూడవ దినాన సతియాత్మ పాదవికొనగ
పార్వతీపరమేశ్వర ప్రణయరక్తి
శారదా చతుర్ముఖుల సంసారలీల
శ్రీపతికథల రాత్రియే దోప దయ్యె ॥23॥

సేవలో దేహమే నవ జీవనగతి
మెరసె, ప్రేమలో హృదయ మమృత పయోధి
దేలె నేకశయ్యాస్థితిందెలియక సతి
అద్వయానంద జగతిలో నైక్యమయ్యె ॥24॥

తెల్లవారె ప్రకృతి తెలియవచ్చె జనని
చేరి చెంత కూతు చేష్టలగని
ఆలుమగల చేత లరుదయ్యె నింక నీ
బ్రతుకు లింతెయనుచు వెతపడంగ ॥25॥

వెతలేటికి తల్లీ, నా
పతినాకేకాదు జగతి పరిరక్షణకై
జితకాముండై పుట్టిన
యతులైశ్వర్యుడు గురుపదార్చకు డనగా ॥26॥

ఏమి విడ్డూర మేయిది? యెవ్వరైన
గురుని సేవింపుచున్ కూడు కొనుసతి నిటు
గూల్తు రే?యింటి దీపంబు నార్చి వీధి
దీపమున్ పెట్టు ధర్మ మే తెలియమనగ ॥27॥

అమ్మ, నీ మాట లే మొ యర్థమ్ము కావు
వెలుపువిరిగె మనసు దేలె భేదమడగె
ఆత్మం గలపతి పశుపతి యయ్యె నింక
గురుని గోవిందు దాసినై కొలుతుననగ ॥28॥

మ రుదినంబున వచ్చి రామానుజాంఘ్రు
లంటు త మ్ముమ నింజూచి కన్నార్పకుండ
మూడు రాత్రులు నేకాంత పుష్పశయ్య
ధర్మ పత్ని వ్రతము ఫలో దయమొ? నాగ ॥29॥

దేవ, రాత్రి యేకాంతము దేవి యాచ
రాచర ప్రపంచమ్ము సర్వంబు మీస్వ
రూప మై గోచరింప నా రూప మేదొ,
యనగదిట్రమ స్వాంతుడై యతి నిలువగ ॥30॥

ఇంతలోవచ్చి పినతల్లి యేమి చెప్ప
నయ్య మీ వాని ఘన విజయంబు? చెంత
చేరిన కుల వధువునె దాసి నొనరించె
వీధి కీడ్చె వియ్యంకులు విఱుమకపడ ॥31॥

అనగ మీ స్వభావ మనుజుని తత్త్వమీ
శ్వర నియామకంబు సహజ ధర్మ
బద్ధమౌ హరిప్రభావంబు చిత్రమై
త్రిప్పె. జగతి మార్పు లేను తల్లి ॥32॥

గురునిఁగొలిచి గోవిందుడు గురు పధాన
నాకు మీకు జగతికె మాన్య గురుడయ్యె
నితని యిల్లాలు హరి సేవ నీతని వలె
బ్రహ్మ చర్యంబులో బరబ్రహ్మణియన ॥33॥

దేవ, దాసాను దాసుడ సేవకుండ
ననుభవత్పద పంజరస్థు నొనరించి
ప్రీతి తారకమున్చదివింపు మంచు
కాళ్ళబడుచున్న తమ్ముని గౌగి లించె ॥34॥

ఇంక ఫలము లేదంచు నిస్పృహ జనని గృ
హాభిముఖి యయ్యె గురుడు రామానుజుండు
ద్వయ మహా మంత్ర మిచ్చి త్రిదండ మొసగి
కావులిచ్చి గోవిందుని గౌరవించె ॥35॥

అన్న, నీవు జగన్నాథమందు ప్రజలు
మెచ్చుమన్నాథనామనమెరయగలవు
ఎండుకట్టెలందీశ్వరునెరుగువారి
భక్తి నిర్జీవ సృష్టికే ప్రాణమయ్యె ॥36॥

ఆ మఱచితి వెందిరుగ సింహాచలనర
సింహువాత్సల్యమెంతని చెప్ప? ఆడి
పాడి పదముల భజియించి పరవశించు
కృష్ణమాజార్యుడే ధన్యుడాంధ్రులందు ॥37॥

మఱిజగన్నాథ మావలమహిమలేమొ
యెట్టులోవారి మాహాత్మ్యమెఱుగలేము
రామకృష్ణులవతరించు భూములవియె
అపదంటె యార్యావర్తమయ్యెమనకు ॥38॥

రామతారకమంత్రముదాత్రిపగలు
సతతము జపించు నాస్థాణు శక్తి వీవు
శేముషియె భక్తిరూపమై చెలగునీప్ర
భావముత్తరా పద మెల్ల పరగుగాత ॥39॥

గురుభక్తి నివృత్తగతిఀ
పరగ జగన్నాథ మందు స్వామింగనె సో
దరు డదియెప్రవృత్తగతిం
పరగ ధనుర్దాసు గురు శుభాంగుండయ్యెఀ ॥40॥

కలడు 'శ్రీరంగపట్టణఖ్యాతబలుడు
స్నేహ సౌందర్య జీవి కుస్తీలజెట్టి
కుసుమగాత్రి హేమాంగిని కూడి యాత
డద్వయ సుఖంబనుభవించు న హరహంబు ॥41॥

గరుడవాహనా రూఢుడై కదలి, రంగ
నాధుడూరేగ మండుటెండలను సరకు
గొనకగుంపులు గుంపులై కూడె జనము
కానిరంగనిఁ భజియింప కా పురంబె ॥42॥

వెనుకనుండిగొడుగుబట్టి ప్రేయసిఁ భ
జించు జెట్టిని పరికించి ఛీయటంచు
సిగ్గు చేటంచు నగుబాటు చిత్రమంచు
చూడరాదన్న జనముల చూచె గురుడు ॥43॥

పిలువఁ బంపగ ప్రేయసీ ప్రియుడువచ్చి
కేలు మోడ్చి దేవా, యన ఆలకించి
కండబలమున్నవాడ వేకాగ్రమతివి
ఏటి కీకాంత చేజగమెరుగనైతి ॥44॥

అనగతలవాంచి పలుక నోరాడకున్న
జెట్టిఁదరిజేరిభుజమును శిరముదువ్వి
గురుడు లాలింప మదికొంత కుదుటఁ బడగ
ప్రేమ విస్ఫార నాతడువిన్న వించె ॥45॥

ఏమి సెప్పుదు స్వామి, ఆమోము చూడ
తత్తరించు దేహము గుండె దడదడమను
చెంత జేర లోకంబులే చెరగు నన్ను
నేనెతెలియ కాకనులలో లీనమగుదు ॥46॥

చెలితనూలతనెండకు చిట్ల నీక
భటుడనై సతతంబుకాపాడుచుంటి
అనగ లేనవ్వు చిందరామానుజుండు
ఇంత కంటె మించిన కన్ను లెరుగుమ యన ॥47॥

దీనికి సరిదీటుచెలువ మే నెరుంగ
నింకమీరిన దెచ్చట? నెట్టులనగ
నిపుడె యిచటనే చూపింతు నేగుదెమ్మ
టన్నగురునితో గుడి కాతడభిముఖుడయి ॥48॥

మారుమాటలేక మనసురామానుజ
పాదపద్మ సరణి బట్టి నడువ
ప్రేయసీప్రియునకు వీక్షింపు మయ్య రా
జీవ నేత్రుని రసభావ మనగ ॥49॥

అర్చకుండిచ్చు కర్పూర హారతి న్ ఘ
నాఘన శ్యాము డరవింద నయను డమృత
హృదయుడై యట సాక్షాత్కరింప చూచె
యోగనిద్రాసనా సీను నొడలు మఱచి ॥50॥

కనులె కాదు ముఖమె కాదు కరంబులే
కాదు పాదయుగళి కాదు కడకు
ఈస్వరూప మెల్ల హృదయాభిరామమై
దివ్యరుచులజగతినివ్యయమగు ॥51॥

అంత గురు కర స్పర్శ చే నా రసాత్మ
మేలు కొనె విశ్వ సౌందర్య మే విరిసిన
సరసిజాక్షుడీ రంగని సన్నిధి విడి
వాడి పోయెడి పూలకై వలపు గంటి ॥52॥

దేవ, హేమాంగి నేత్రాబ్జధీ ధితులకు
జీవమీవంచు తెలియక చెనటినైతి
విశ్వ చైతన్యమెఱుగక వెడగునైతి
సచ్చిదానందు చూడక జడుడ నైతి ॥53॥

కావు మనిపలుమార్ల రంగని పదాబ్జ
భృంగమై చుట్టి చుట్టుచుక్రింద బడుచు
ఆళవారల కీర్తనం బందు కొనగ
ఆస్వరమ్మున స్వరము రామానుజుఁదయ ॥54॥

రంగ।నీ కన్నులే కాదు రాగ రసభ
రిత హృదయమెంత చైతన్య భృతమొ, తెలిసి
తెలిసి తెలియని నీలీలఁదేలితి నని
శిష్యునింజేరి గురుడు భజింపఁదొడగె ॥55॥

ఇంతలోవచ్చి హేమాంగి యిరువురి పద
సన్నిధిఁ(వ్రాలి రంగని చరణమంటు
విడివడని సత్య సౌందర్య విభవ మగుచు
బ్రతుకుడనియలిదీవింప వాడు భక్తి ॥56॥

మల్లయుద్ధవు పట్టురీ మచ్చు కంటి
కొంటె చూపుల మఱచి తీగురుని కరుణ
పుండరీకాక్షు దృక్కిలీముఖములురల
తుంట విల్తుని నిర్జింపఁ గంటి నేడు ॥57॥

నాయినై వీధులన్ బడ్డ నన్ననుగ్ర
హించి నవ్వులోకస్థితి నెఱుకపరచి
విశ్వ సౌందర్య నిలయు చూపించిన గురు
దేవ, మీ ఋణంబేరీతి తీర్తు నంచు ॥58॥

నాటినుండి యాతడు రంగనాథు భక్తు
డై గురునికాప్త శిష్యుడై యణువుల గల
పరమ సౌందర్య భావనా పరవశుడయి
ప్రజలలో రస జీవియై బ్రతుక దొడగె ॥59॥

రంగనాథుని కనుబొమ్మల చెలువంబు
తప్పు త్రాగుటచే ధనుర్దాసువైతి
దాసకూటాన నీ పేరు తారకమని
గురుడు రామానుజుండు తా పరవశించె ॥60॥

స్నానమొనరించి రామానుజార్యు డనుది
నము ధనుర్దాసుమూ పురానకరమూని
ఆలయంబున కరుదెంచి యర్చసేయ
గొణగొణగొణగుశిష్యాళి గురుడెరింగె ॥61॥

శిష్యుడొకడు సాహసించి కంచెయె చేను
మేయ కాపుకింక మే తగలదె?
ధర్మరక్షకులగుతామె కులవిహీను
భుజము భుజమొరయగ ముట్టదగునె? ॥62॥

జెట్టికులమున బుట్టిన చెనటియితడు
పణ్యకాంతా సమాగమ పతితుడితడు
ఎంతదాసుడైన, గురుండెయితని తోడ
నిట్లు వర్తించు టొప్పునే? యుందనంగ ॥63॥

యతిచిరునగవె యుత్తరంబయ్యె కొన్ని
నాళులు గడవ గుట్టుగా నమ్మినయొక
బంటుచే ఛాత్రవర్గపువస్త్ర తతిని
ఎండ పేలికల్ సేయించె నెఱుగకిదియు ॥64॥

వారిలో వారురేగి దుర్భాషలాడు
కొనగ క్రొంగొత్త బట్టలం గూర్చెగురుడె
తనకువిశ్వాస పాత్ర ఛాత్రద్వయంబు
తో ధనుర్దా సుకాంతను దోచుడనగ ॥65॥

దాసులేని రాత్రి తరుణి నిద్రింపగ
యతిభటు ద్వయ మట కరుగుదెంచి
కలికి నగలు నొలువ కనుమూసి ప్రక్క కున్
తిరిగెవనిత వారు పరువులిడిరి ॥66॥

పూర్తినగలుకొనక పొన్నాచినచటనే
విడిచివచ్చిలిమని విశదపరచ
చింతలేదు మీరుశీఘ్ర మే వారిచే
తలెరుగు డన మరలతరలివచ్చి ॥67॥

వారు,పొంచిధనుర్దాసుపలుకులాల
కించి యెకవైపు సొమ్ముల నుంచితి సతి
శివుని యర్థాంగి వయ్యె దో చెప్పు మనగ
చౌర్యవృత్తాంతముం కొంత సాగగానె ॥68॥

కటకటా కర్మ చండాలి! కదలినీవు
దూరమొనరింపదగునె? భక్తులనెరుగక
నీకునీసొమ్ము పైమోజు కాని భక్తు
లెంతనలిగిరో, మీ జాతి కెటుకయొ? యన ॥69॥

కాదు కాదు ప్రియా, మరొక యెడనున్న
భూషణములీయ ప్రక్కకుపొరలనేను
వారుమేల్కొంటి నను భ్రాంతి పారి రనగ
అతివపల్కులకానందమంది భటులు ॥70॥

గురునికెఱిగింప యతిరాజు మరుదినాన
ప్రవచనార్థమై శిష్యవర్గంబు రాగ
దో చినసగిల మూట ముందుకిడి చూర
వదలునాధనుర్దా సుదంపతుల పొగడ ॥71॥

అంతలో ధనుర్దాసు హేమాంగితోడ
రుద్రుడై సనుదెంచి గురువర! యిది మ
హాత్ములగువిష్ణు భక్తులయాత్మనెరిగి
యు, తన నగలీయ లేని కామోప భోగి ॥72॥

దీనితోకాపురము సేయలేను దేవ!
మిరెమియిచ్చువచ్చినవారి కిచ్చు
కొనుడన సతి కన్నీటితో గురుని కాళ్ళ
వ్రాలె, ఆచార్యుడద్భుత స్వాంతుడగుచు ॥73॥

సతిని చూచి ధనుర్దాసు మతినెరింగి
స్వార్థ పూరిత చిత్తుల ఛాత్రులగని
ఇచటవలచిన శిష్యులకిత్తునీమె
నెవరు వలదనరాదటంచెల్ల రలర ॥74॥

ప్రేయసియెగాదు హేమాంగి విభుడు మెచ్చు
సతి, ధనుర్దాసు శెట్టి పతితుడగునె?
వీరె యాదర్శమిధున మీ విష్ణు భక్తు
ల కని యాప్రేయ సీప్రియుల తోగూర్చి ॥75॥

గోచిపాతలకిట కుక్కల రీతి కా
ట్లాడు మీకును ప్రియురాలి నగలు
నృహరి భటుల కందదే యను మన ధను
ర్దా సుకుగల యంత రమిదెయనగ ॥76॥

జాతికంటె ఘనము సచ్ఛీలము, కులము
కంటె ఘనము గుణము కాన గురుడు
గుణము శీలములను గొంచు పై వైభేద
మడచెనంచుశిష్యు లరసిరాత్మ ॥77॥

# అధ్యాయము - 13

యజ్ఞదాన తపోనిష్ఠలంది, తత్త్వ
మసి అహం బ్రహ్మమనెడి వాక్యార్థ మనుభ
వింపనందరి కందని విధముగాన
సులభమౌ భక్తిమార్గంబు చూపె గురుడు ॥

# 13. శ్రీ భాష్యకారులు

యజ్ఞదాన తపోనిష్ఠలంది, తత్త్వ
మసి అహం బ్రహ్మమనెడి వాక్యార్థ మనుభ
వింపయందరి కందెడి విద్యగామి
సులభ మౌ భక్తి మార్గంబు చూపె గురుడు ॥1॥

యామునాచార్యు లాశించినట్టుల సరి
క్రొత్తభాష్యంబు బ్రహ్మసూక్తులకు వ్రాయ
గోష్ఠిపూర్ణాది యోగుల గుణములెరిఁగి
అనుభవ జ్ఞాన సాహాయ్య మాదుకొనగ ॥2॥

కదలి కదలని జగములగమ్యమెరిఁగి
తనుమనోబుద్ధిచిత్తాది తత్త్వమెరిఁగి
దర్శనోపనిషత్తు పదంబులెరిఁగి
అనుభవోచిత రచనకై యతివరుండె ॥3॥

ద్రవిడటంక బోధాయ[illegible] [illegible]త్త్వ [illegible]
శారదా ప్రసాద ప్రజ్ఞ [illegible] మెరిఁగి
ధాత్రుని యఖండ ధ[illegible] [illegible]కి తోడు
పడగ శ్రీవైష్ణవ హృదయ భా[illegible]మ్యె ॥4॥

బ్రహ్మసూత్రములకు భాష్యంబు సెప్పెద
దెలిసి వ్రాయవలె కురేశ, నీవు
ఎటత్వదీయ హృదికి హితముకాదో, సంశ
యంబొ, యచటనీవు నాగవచ్చు ॥5॥

అనుభవంబునాది అనుసరించెడి వ్రాత
నీది, శ్రీనివాసుని కరుణాక
టాక్షమె కరదీపమై రచనాపథం
బుననిరువురి నిందు ముందునడువు ॥6॥

ఇరువురికి నచ్చినటు భా
ష్యరచనగావింతు మనెడి సమయంబునకుఁ
గురుశిష్యులిద్దరట బ
ద్ధు లైరి రచనాక్రమంబు దొరకొను చుండఁ ॥7॥

ఉన్నదున్నటులకురేశు డొక్కనాడు
కలము పడవైచి గురుని ముఖంబు చూడ
నతని నేటి కీ వైరాగ్య మయ్య, యీ ప్ర
ధాన ఘట్టంబులో నిటులైన నెటుల? ॥8॥

అనగ లేచి బద్ధాంజలి యై కురేశు
డోమహాత్మ,జీవుండు నిత్యుడని తెలియ
దగిన వాడంచుఁబలుక న ద్వైత సమ్మ
తమగు జీవుడే సర్వస్వతంత్రుడగును ॥9॥

అనుభవమున కే కాదు సత్యంబునకిది
దూరమౌ దేవ, జీవి నిత్యుడను మాట
సత్యమే కానియీశ్వరాంశజు డగునత,
డీశుడేయని వ్రాయ శంకింతు ననగ ॥10॥

శంక నీకేల? చెప్పిన సరణి వ్రాయు
మన కురేశుడు మౌనియై యతి 'పదాల
కన్నులార్పక చూచుచు కలము గొనమి,
విసుగు తోలేచియతిరాజు వెళ్ళి పోయె ॥11॥

గురుడు చింతలో తనమాట మఱచె నేమొ,
యేమిసేయుదు నని క్రుంగు హృదిని నిలిపి
మఱిమఱికురేశు డాత్మ సద్గురునిఁదలప
హసితవదనుడై వచ్చి రామానుజుండు ॥12॥

నిజమునిజమయ్యా, నీమాట నిర్మలాత్మ,
జీవుడీశ్వరాధీనుడై సృష్టి సంస్థి
తి లయల పరి పూర్ణ స్వేచ్ఛ కలుగకునికి
అంశమై శేషమైదేహమై ప్రియమగు ॥13॥

ఆయఖండ పరబ్రహ్మమందు జీవు
డొక్క భాగమైయంగమై యొప్పు చుండె
అలల విఱిగినన్ నంభోధియణగదనుచు
మరల భాష్యంబు చెప్పె రామానుజుండు ॥14॥

ఇంకొకపరిజీవాత్మ ప్రకృతిని గూర్చి
యిరువురిమనంబుల విభేద మేర్పడంగ
వారుగోష్ఠి పూర్ణుల తీర్పుఁగోర నతడు
విష్ణు చిత్తుని వాక్యముల్ పేరు కొనుచు ॥15॥

జీవుడు సదా భటుండై భజించుచున కు
రేశుజూచి రామానుజ హృదయ మలరె
అడ్డమాకలు లేక భాష్య రచన సుర
గంగయైదిగి వచ్చె లోకంబులలర ॥16॥

జీవజగముల తలపులో సృష్టి సేయు
సచ్చిదానంద తత్త్వమే సప్తగిరుల
బ్రహ్మపద వాచ్యమై శ్రియ పతిగ వేంక
టేశ్వరుడెఱిగి శ్రీభాష్య మెత్తు కొనియె ॥17॥

జగముల సృజించు బ్రహ్మయే శ్రద్ధ కాచు
హరియె భక్తి త్రుంచు హరుండె ఎఱుక యాత్రి
కంబ యేరీతి నాశంబు కాదొ యటులె
జీవజగదీశ్వరులకు విచ్ఛిత్తి లేదు ॥18॥

ఇయ్యదియెవిశిష్టాద్వైతమెన్నగప్పాది
నిటజగజ్జీవ డీశ్వరులీత్రికంబు
స్థూల సూక్ష్మ కారణ దేహ శోభ తిరము
సకల కల్యాణ గుణగణ స్వామికరుణ ॥19॥

జీవజగములురెండును శేషమయ్యె
తానుశేషియై విష్ణువు దనరుచుండు
విడివడని బంధమందు జీవి హరికరుణ
నిత్య సూరి య్యై యానందనిలయుడగును ॥20॥

నిజతత్వంబున రామా
నుజుడుఁ గీతాశ్రుతులకు నుడివెను భాష్యం
బజితుండ్డైయందరు మె
చ్చుజే సె గద్యత్రయంబు శాశ్వతుడయ్యెఁ ॥21॥

యామునులకోర్కె దీరభాష్యము ముగించె
వైష్ణవాచార ధర్మము వ్యాప్తిఁజేంద
ప్రబలులైరి వ్యాస పరాశరాఖ్యులు తిరు
వాయ్‌మొడికి ప్రసిద్ధ వ్యాఖ్యవ్రాసిరందె ॥22॥

# అధ్యాయము - 14

అంతఃప్రేరణ లక్ష్మీ
కాంతుని కర్ణాటసీమగని ప్రార్థింపఁ
కొంతార ప్రాంతీయుల
స్వాంతంబున విష్ణు భక్తి పదిలంబయ్యెఁ॥

# 14.అంతర్యామి

పరమ శైవుని వైష్ణవ ప్రముఖుఁజేసె
వృషభ గిరినాథుని యిలచక్రినొనరించె
నరులకే గాదు కడకుబండలకు కూడ
పట్టె నామాలు దాసయ్య పెట్టుచుండె ॥1॥

శంకరుడు పాదుకొల్పిన షణ్మతాల
సమరసమడగె వెట్టి వైష్ణవమె ముక్తి
దాయకము సరిక్రొత్త సిద్ధాంతమంచు
బుధజనావళి నలజడిపుట్టనేసె ॥2॥

దొంగలుదొరలైరి ధూర్తులుబలిసిరి
శీలవతులు చెడిరి సిగ్గువిడిచి
నామమున్నచో ననామ ధేయులుకూడ
భక్తిపట్టుమంది ప్రభువులైరి ॥3॥

ఇంటతనపూజతనదైన నెగ్గులేదు
స్వమతము పరులపై రుద్ద బాధకలుగు
భయముపుట్టు శాంతిచెడును ప్రాజ్ఞులందె
మనసనాతన మార్గధర్మమెనశించు ॥4॥

ప్రభు డుపేక్షనేయ ప్రజలలోకల్లోల
ముల్జ్వలించు మొట్టమొదలె దొసగు
త్రెంచుటుచితమంచుఁ దెల్పు సదస్యులన్
జూచి యొగసి పడుచు చోళనృపుడు ॥5॥

మేముశైవాభి మానులమై మెదలిన, వి
సతము వ్రతము పంచాక్షరీ జపమెయైన
పరులభంజించుకంటకప్రభులగాము
అందఱకు గూర్తుమాత్మ రాజ్యానర్క్ష ॥6॥

ఇదిపరంపరాగతమైన నృపులధర్మ
మిదియె విధ్యుక్త మీప్రజాభ్యుదయమార్గ
మెఱుగకొక్కరొక్కరు విషమించిరేని
వదలదాత్మ శాసన మెంతవారినైన ॥7॥

నాజనని పతివ్రతయన్ననయమువాని
మాతృభక్తిప్రశంశార్హమౌ పరులకు
కానినీతల్లికాదన్న కలతపుట్టు
ఈసహనము తప ఫలమెఱుకరికగు ॥8॥

ఇంత కామతాంధు డెవ్వడోయనిరాజు
చుట్టునున్నవారిఁ జూడ, వారు
పేరుచెప్పలేక పెద్దగానసిగి రా
మానుజుడను మాటనల్లఁబలుక ॥9॥

ఏమీ, రామానుజులే,
యామహనీయుని పదంబులంటగనే మా
యామేయంబగు ర్వాక్షస
మే మానె నటంచు వింటి మి యన సచివుడుఁ ॥10॥

రాజ సేవలో శిరము నెరసినవాడు
లేచియంజలి ఘటియించి ప్రీతితో ప్ర
భూ! మతము మన ప్రజలలో పొత్తు పొసగ
తోడ్పడునుగాని, విడదీయ దెపుడు ॥11॥

తనపదంబున త్రొక్కించె తమ్మని వృష
శైలముం శైవ శాక్త వైష్ణవ మత త్ర
యమున కనువైన సామరస్యంబుగూర్చె
కనని బ్రహ్మమున్కన్నులంగట్టంజే సె ॥12॥

బలహీనులబలవంతుల
సలుపగ హరిభక్తి పథము సౌఖ్యద మనుచుఁ
దలచిన దయార్ద్రహృదయుని
తెలిసి యుపేక్షించిలిమని తిన్నగఁబలుకఁ ॥13॥

పరమ శైవులు, సచివుడు పలుకు పలుకు
లాలకించి విచారించి, యవని విభుడు
రంగపురిని రామానుజ ప్రభుని శిష్య
కోటి నొక కంట గమనింప గుణముమనకు ॥14॥

దండనాథ, రంగమండలంబంతయు
భటుల తోడి నింప వలయు, శాంతి
దాంతి నిలుప, సంప్రదాయధర్మమునకు
హానిరానిరీతి యదుపు తగును ॥15॥

అప్పటప్పటికిని నటంబుట్టు చర్యలు
అప్పుడపుడె మాకునందవలయు
అంగరంగభోగ మారంగనాధుని
కెప్పటివలె నడుపుటే మనవిధి ॥16॥

ఏపరిస్థితులందైన హితమితవచ
నాభిరాముడౌ రామానుజార్య హృదయ
మెఱిగివర్తింపుడోయని యెదుటనున్న
వీరభద్రసైన్యాధిపున్ విభుడు చూడ ॥17॥

రంగపురము మిడిసి పడు రాచభటుల
తో కిటకిటలాడగ భయాందోళ నలకు
ప్రజలు గురియైరి క్రొంగొత్తవైష్ణవాళి
చెంతగల పల్లె సీమలు చేరివారు ॥18॥

కనులకానంద మొనగూర్చు కమ్మని సుకు
మార సుందర మూర్తి రమావిభుండు
అతని పూజింపుడయ్య, అత్యంతసులభు
డయ్య భుక్తి ముక్తి ప్రదుండయ్య మఱియు ॥19॥

రూపరహితుడు, రుద్ర స్వరూపి, యఖిల
భూతగణముల కధిపతి, బూదిగోరు
కాటికాపరి నర్చింప కలుగుకలిమి
తిరము కాదని ప్రజకు బోధించు చుండ్రి ॥20॥

పామరుల శైవవైష్ణవ వర్గభేద
ము, రగిలిరగిలి జ్వలియించె, ముప్పుదెచ్చె,
రాచభటులంత, యమభటులై చెలగిరి
వారినదుపు సేయగ సైన్యపతియె వచ్చె ॥21॥

చారచక్షులీ వార్తల జనవిభునకు
ఎఱుకపరుపగ నాతడదిరి పడె, వెస
శాంతి దళములఁబంపించె సత్వరముగ
వైష్ణవోత్తముల గలియఁబలుకు డంచు ॥22॥

రంగ విభుని కెఱగి రామానుజాచార్యు
సంప్రదించి ప్రజల చక్క దిద్ద
రాజశాసనంబు ప్రకటింప నేతెంచు
వీరభద్రుని విని విబుధు లలర ॥23॥

మరములో మహాపూర్ణుడు మన నృపాలు
డార్థధర్మాభి రతుడు, శైవాగమప్ర
వర్తకుడు ఈశ్వరార్చనాపరుడటంచు
నలు చెరంగుల ఘనయశ స్తిలకులైరి ॥24॥

వారికిమనగురువులన్న భక్తి శ్రద్ధ
గౌరవాభిమానంబులు గలవుకాని
విష్ణు భక్తి మహోజ్జ్వల విభవ మెఱిగి
కన్నుగుట్టిడి వారును గలరటనట ॥25॥

రంగపురము నిండె రాచభటాళితో
వీరభద్ర సైన్య విభుడువచ్చె
ప్రజలలో వలజడి ప్రబలె, నీస్థితి చూడ,
గురునికేదొ, ముప్పు కూడ నుండె ॥26॥

ఈగొడవ లేవియును యతియెరుగ డితని
నెట్టులైన కాచుకొనుటె, యిప్పటిమన
విధి కురేశ నీవే స్వామి వేషమున్ధ
రింపు మని త్రిదండముకావు లిచ్చి పలికె ॥27॥

మనరాజ్య పు సరహద్దుల
వెనువెంటనె గురుడు వీడు, వెంటనె నడువుం
డనిదాశరథిఁ జూడ, య
తి నృపుడు స్నానంబు చేసి తిన్నగ రంగా! ॥28॥

నీ లీలల పరిణామం
బాలోచింపగ తరమగునా? మాకనుచుఁ
ఆ లోకింపగ రంగని,
తో లో గరినాడు సీమలో నను గనుమా ॥29॥

వినియంతర్యామిఁ, యతి
కనుల తెరువ, దాశరథియె కనబడె, దేవా,
మనవీక్షణమే రాజ్యం
బునువిడువ వలయు మహాప్రపూర్ణుడు చెప్పెన్ ॥30॥

నిజమునిజము దాశరథి, విన్పించె రంగ
విభుడుకూడ నీమాటలే, వెంటనే మ
నము చెలువకన్నడ పదంబున కరుగవలె,
నంచు నున్నదున్నట్టుగా యతి నడువగ ॥31॥

గురుడు పూర్ణుడు రంగడు కూడఁబల్కి
నట్టులందరొకేరీతినాన వె ట్ట
నందిన సితాంబ రాలతో యతివరుండు
నరిగె చింతలం దవిలి దాశరథి నడచె ॥32॥

అంధ తమసంబు శిష్యాళి నావరింప,
వెతపడిగురుడు రంగనిమతి దలంప,
చంద్రు డేతెంచె దారియు స్పష్టమయ్యె
రాత్రికూడ భక్తులకు మార్గంబు సూపు ॥33॥

మసక సంజ పైఁ బడిమదిన్ మరులుగొలుప
ఆప్త శిష్యాళి గురువేగ మందలేక
వెనుకఁ బడలక్ష్మణయతి వే వేగనడచె
కడలికెదురీదు గజయాతగాని వోలె ॥34॥

మెలికలు మెలిక లై నదీజలము సాగ
సాగునందాకరంగడు సాచుకేలు
పుష్ప గంధమ్ము లలసట పొంద నీక
యతినినడపించె కంట కావృతవనాల ॥35॥

అచ్చటచ్చట చిరుమబ్బు లావరింప
దుర్గమారణ్య భూముల త్రోవ చూప
మింటతళుకులు తళతళ మెరయతొడగె
తమిళదేశపు హద్దులు దాటి రంత ॥36॥

నీలగిరి నిసర్గ శ్యామునిన్ స్తుతించె,
సత్యమంగల సస్యకోశముల చూచె,
రామనాథ సాల గ్రామలక్ష్మి నెరింగె,
తొండనూరున రామానుజుండు నిలిచె ॥37॥

చిమ్మ చీకటి గోడలు చిల్లువడ, గ
వాక్షరంధ్రద్యుతులన, ది వాకరుండు
తూర్పు మొగసాల నలనల్లతొంగి చూచె,
ఆత్మనేత్రము వికసితంబయ్యె నంత ॥38॥

గజపదంబంత బృహదగ్ని ఖండమనగ
నరుణబింబమ్ము నుదయాద్రి హోయిఁగూర్చె
తల్లి వెచ్చని ఱెక్కల దనియు కొదమ
పిట్టల కిలకిలారావ ముట్టి పడియె ॥39॥

కాలినడకల శ్రమ హెచ్చె, కంటి ఱెప్ప
మూత పడుచుండ, యతిదేహము మెల మెల్ల
నలమె ప్రాభాత పవనాంకు రాళి, నంత
ప్రాణ మెట దేలెనో నిద్ర పైబడంగ ॥40॥

అలసి సొలసి రాతి పలకపై రామాను
జుండు గాఢమౌసుషుప్తి మునిగె,
సాంధ్య రాగములమె స్వామి పాదాలపై
కావు కావు మంచు కాకులరచె ॥41॥

గురుని రాకఁజాటుటకనగువ్వగూళ్ళు
కోడికూతలు మేల్కొనె, కోయగూడె
ము తొలి పొద్దు కెఱఁగి, ముందుకుబోవశిష్య
చయముతో నిదురించు నాచార్యుఁ గనియె ॥42॥

బెట్టనిళిదు బందపెరియాళవారలీ,
తీరుమూడ, డస్సి నారలంచు
నిండ్ల కేగిపాలు పండ్లు తేనెగొని తె
చ్చి, యతివరునిగొలువఁజేంతచేర ॥43॥

కలకలస్వనంబులగూళ్ళు కలయరేగె
చల్లని మలయ మారుతస్పర్శలయతి
వరుడు వామనస్తుతి పరత్వమున లేచె
మబ్బుమనుషుల జూచి సంబరముతోడ ॥44॥

చూపులోవారిజన్మల సుకృతి చదివె,
భాష తెలియకే వారలభావ మెరిగె,
అమృతహృదయాభి రాముడైయతి గురుండు
దేశ కాల భాషల నేయతిక్రమించె ॥45॥

లెమ్ములేలెమ్మ నిద్రచాలించి చూడు
మెవరు వచ్చిరోయిచ్చటి కి ప్పుడనగ
ఉలికి పడి లేచి, వచ్చి, దాశరధి ఆట
వికజనవ్రాతమున్ చూచివెఱగుపడుచు ॥46॥

వీరునల్ల మలై ప్రాంత చోరులో, మ
ము పసిబట్టి బంధించెడి భూపభటులొ
చారవర్గమో, యంచు దాశరధి వెఱువ
పిలుచు కొనిరమ్మనియతి పంపింపగానె ॥47॥

మాటలాడ కాతడు భయం బధిగమించి
చేరి సైగల (బిల్వగ వారువచ్చి
ఒడయ! మిము జూడనేటికో, యొడలుపొంగె,
తమపదాల పైఁ బడ, మదితత్తరించు ॥48॥

జీయ! మేము దరికి చేరని వారము
తేనెపాలుపండ్లు తెచ్చినాము
స్వీకరించి మమ్ము (జేకొనుడనికేలు
పెదవిచేర్చి భక్తివిన్నవింప ॥49॥

కల్లకపట మెఱుగని యీకంటిపాప
లందు వరదుడే కన్పించె, ఆత్మలందు
అమృతమేచిందె, నీచేత లఖిలజన సు
ఖైకరక్ష, రంగని మహిమాన్విత మి ది ॥50॥

రంగడిందు ప్రసాద మొసంగె, మనకు
వీరె లేకున్న స్వామిదయారసప్ర
భావ మీలోకమెఱుగునే? భాగవతులు
హరిజనుల్ వీరె యీ సేవె హరికి ప్రీతి ॥51॥

గోగణంబుల కొలువకే కూడెపాలు,
చెట్ల సేవింప కే పండ్లు చిక్కెఁ, మనకు,
యత్నమే లేక మకరంద మబ్బె, హరిఁ ద
లప, సిరులనేక గతులసంప్రాప్తమగును ॥52॥

శ్రద్ధ భక్తి ఆదరాభి మానంబుల
దలచినంత నూరుచెలము లివియె
కొండజాతి వారికోర్కెఁలదీర్ప, క
ర్తవ్య మంచు దాశరథిని చూడ ॥53॥

వారు వారి పెద్దలతోడవచ్చి తెలిసి
తెలియని తమిళ భాషలో బలుక నతడు
పంచ సంస్కార విధులతో వైష్ణవులుగ
మార్చి, వారికష్టాక్షరీమంత్రమిచ్చె ॥54॥

నారాయణుడే దేవుం
డారామానుజుడె గురువు అష్టాక్షరియే
చేరువమంత్రంబీసం
స్కారాన్విత జీవతతికి జనకులు వీరే ॥55॥

గగనమై వ్యాప్తి చెందును, గాలి యై స
దామనుచు, వెలుంగై వెచ్చదన మొసంగు
సలిలమై డ ప్పిదీర్చు శ్రీ స్వామి యే స
మస్త జీవులం గాచు సంబంధియగుచు ॥56॥

కనబడని పరాత్పరుడే
కనబడు విశ్వంబు నయ్యె కరుణా కరుడై
మనల సదా రక్షింపగ
ననంత రూపములఁ దాల్చునచ్యుతు డతడే ॥57॥

అన్ని రూపంబులతని వేయంచు విష్ణు
వాసుదేవు నారాయణుఁబ్రస్తుతించి
సకల భూతముల సమరసాన జూచి
బ్రతుకు వాడె శ్రీ వైష్ణవ భక్తుడనగ ॥58॥

ఇంతలోఁబరిచారకుండే గుడెంచి
స్వామి కైంకర్యమున్ సేయ సత్వరాన
రండటంచు దెల్పగ దాశరధి తనబల
గంబుతో సంభ్రమంబున కదలివచ్చె ॥59॥

గురుడు పదిలంబుగా దెచ్చుకొన్న వరద
విగ్రహంబుగట్టెదుట (గన్పింప, నిలిపి
షోడశోప చారంబులుత్సుకత నెరప
పాలుపండ్లు తేనె ప్రసాద పక్వమయ్యె ॥60॥

దివ్య తేజంబుతో మోము తేజరిల్ల
రాగరంజితమయ్యె నేత్రాంచలాలు
భావమారంగ నాథుని పాదపంజ
రస్థమై వాసుదేవ నారాయణయనె ॥61॥

నీకు భేదమే లేదు కానీత్వదీయ
సృష్టియందు భేదమ్మె వి స్పష్టమయ్యె
జీవులందు భేదాభేదమేవెలింగె
నీవు నీది నీవానిగా నెగడుటెటులో! ॥62॥

పరవశానంద గీతల పాడుకొనెడి
స్వామి రామానుజుంజూచి భక్తగణము
సంభ్రమాశ్చర్య జనిత బాష్పముయిరాల
తనువులెమరచిరి సన్నిధానమహిమ ॥63॥

సమయోచితముగ దాశర
థిమెలగ, గురుదేవుని కృప దివ్యామృతమై
సుముఖోల్లాసంబై శు
ద్ధమనస్కుల జేసె నాశ్రితవనేచరులన్ ॥64॥

వరుసగానొక్కరొక్కరు వచ్చి తమకు
తామెతెలియక వరదు పాదములకెఱగ
గురుడొ సంగు తీర్థంబు నేకొనగవారి
జాతిమతకుల భేదముల్ నమసి పోయె ॥65॥

స్వామికి నివేదితం బైన పాలు పండ్లు
తేనె పంచామృతంబయ్యె దివ్యమగుప్ర
సాదమై పాయసాన్నమై సత్త్వమయ్యె
ఎల్ల రేకపంక్తిని భక్తి నారగింప ||66||

క్రొత్త తేజంబు వారిలో గొట్టవచ్చె
సాహసోదారగుణములు సంక్రమించె
అందరన్నదమ్ముల బోలెనలరుచుండ్రి
భేదమందభేదమె మతివిచ్చుకొనియె ||67||

భక్తి నిస్వార్థకైంకర్య భావ రతియె
విశ్వకల్యాణలక్ష్మికి విందుగూర్చె
హరిజనులుమీరు శంఖచక్రాంకితు లిహ
పరసుఖప్రాప్తి మీకని గురుడు నడచె ||68||

వరువారికగ్ర హారంబుసూపి, రా
మానుజగురుకరుణ మురలి రంత
రంగనాథు డంతరంగంబులో నిల్వ
ఎటులనే తటస్థ హృదయులుగనె ||69||

పొలిమేరల యతి చరణం
బులాగెయుందేవరదుని పూజించుచు ని
శ్చలభక్తి గురుడుంర, ను
జ్జ్వలమతి దాశరథి విప్రవాటికఁ జొచ్చెఁ ||70||

వాడవాడల వేదమున్వల్లె వేయు
ఉగ్రశక్తులకచ్చెరు వొందె భిక్ష
లేదు, సరికదా, పలికెడి ప్రీతిలేదు
ఎట్టులీయుగ్ర హారాన నిముడగలము ||71||

తిరిగి తిరిగి విసిగిన దాశరధి వచ్చి
యిమ్మహియనంత భోగభాగ్యమ్ముల ఘని,
గాని సాటివారల సరిగాదలపని
ఈతటస్థ వైఖరి కర్థమేమొ? తెలియ ॥72॥

భస్మధారులగుచు ఫాల మందర్ధచం
ద్రాంక మరుణరేఖ లలమ నగ్ర
హారమాక్రమించు నగ్రజన్ములె యహం
భావపూర్ణులగుటబాధపెట్టు ॥73॥

శక్తి దేవతారాధకుల్ జగతినెల్ల
తృణసదృశముగానెంచి వర్తింతురకట
వీరియాంత్రిక జీవనంబింకి మరల
మనుజులనొనర్చి మనిపెడు మార్గ మెటులొ ॥74॥

చిరునగవు పెదవుల మెరయుగ ఆచార్యు
డా పలుకల మర్మ మాత్మఁదెలిసి
ఆప్త శిష్యుఁజూచియన్న! సత్వరజస్త
మోగుణ ప్రకృతియెస్త్రీగమారె ॥75॥

ప్రకృతి, శక్తిమాయగాస్థితిని బట్టి
వేరువేరుగవిబుధులు పేరుకొనిరి
కాని భగవ దధీనమైక్రాలనిదియె
తల్లి ప్రేయసి, తనయగాఁదనుపు జగతి ॥76॥

ఇదిగుర్తింపక జీవుడు
అదనునకొదవిన భగవతి యని శక్తిని తా
నదుపునొనర్పఁదలంచుచు
తదను చెడి యహంకరిష్ణుడై వెతలబడుఁ ॥77॥

ప్రకృతి పరిణామకార ప్రభావితయని
మధువు మదిర,మాంసము, ముద్రమ్మైధునముల
నరుడహంకార మమకారనారకీయగు
రసమయంబగు జగతి రుద్రసదృశమగు ॥78॥

నాదినేననురెండు పో నాడి దేహ
మాహరి ప్రసాదమని జీవాత్మ నతని
దే నవవిధాలయాశ్వరాధీనమంచు
తెలిసి భజియించు వాడె పోధన్యుడన్న ॥79॥

అతిథినర్చింప రాని భాగ్యంబు భాగ్య
మే? యదియె శవాభోగమ్మై హేయమగును
తల్లియన్న నారాయణ తత్త్వమంచు
ఎఱుక లేనివారలఁ గూర్చియేమిచెప్ప? ॥80॥

రక్తమాంసంబులర్పించు శక్తిరతుల
కకట! తీర్థప్రసాదంబులనుభవింప
దుర్లభంబగు చుండె, నీదురిత మడప
శ్రీహరిమతం బొకటె సుప్రసిద్ధమయ్య ॥81॥

అన్నతీర్థ ప్రసాదంబులఖిల జీవ
రాసులకు కూర్చు వాపీ జలంబు శ్రీహ
రిపద పాదోద్భవంబంచు బుజువొనర్చు
సమయ మాసన్నమయ్యె దాశరథి! లెమ్ము ॥82॥

చెంతగలరెండుకొండల చిక్కుచెఱువు
నీపదస్పర్శ తీర్థ మ్మై నింగి నేల
నంతయు పవిత్ర మ్మగఁ జేయ నరుగమంచు
నిశ్చల ధ్యాన యోగాన నిలిపె హరిని ॥83॥

దాశరధి చెంతగలజల ధారనంటి
చెఱువుతూముకడ పదాలఁ జేర్చి హరిప
దార్చనారతుండై దినత్రయముగడప
తజ్జలమె తీర్థమై విప్రధరణిమార్చె ॥84॥

భక్తి పాదోదక ప్రభావమని యెరుగి
వైరి, యైననూ తత్ప్రజాభ్యంతరాల
అల్లవిరిసె అజ్ఞాత సౌహార్ద భావ
ములు పరస్పరానంద సంభరితమగుచు ॥85॥

అగ్రహారవిభుం డంట, నతులభక్తి
శక్తిముద్రతో కుంకుమార్చన మొనర్చె
మదిర మాంసఖండంబుల నెదుటఁబెట్టి
చేకొనుమని తీర్థమును ప్రోక్షింపగానె ॥86॥

మదిర పానకంబయ్యె నా మాంసమెల్ల
పనస తొనలయ్యె దేవి జీవత్స్వరూపి
యై కనబడె నా కనుల ప్రత్యక్షమయ్యె
శాంత తేజస్వి, వైష్ణవాచార గురుడు ॥87॥

ఇంతలో శిష్యుడే తెంచి వింతయయ్యె
దేవ! యెవ్వరో ఆచార్య దేవుడంట
ద్రవిడ దేశస్థుడంట, శాంత ప్రియుడట,
ఏటికో మన వీటి కే తెంచె నంట ॥88॥

చిత్ర మతనిముక్కు-చివర త్రిశూలచి
హ్నములు కురులు తెల్లమయెనాచె, వయసు
జారుచుండ జనుల చల్లగ చూచు, సి
తాంబరుడుగడిగుడి నలరెననగ ॥89॥

అతని శిష్యుడీ వీటభిక్షార్థికాగ
జైనుడని మన వారు పోజార్చ, నతడు
మనచెఱువుకడ నిశ్చితమది తపించె
కప్పపాము పక్షు లతని కాళ్ళుజుట్టు ॥90॥

కొమ్మ చివురించె కోయిల కూతలెగసె
పూలకన్నెలు తుమ్మెద పోరునైచె
ప్రకృతి కాలముగాని గాలాన వికృతి
యయ్యె, నీ జైన విద్యలకంతు లేదు ॥91॥

చూడతగునన్న నెల్లరాచోద్య మెఱుగ
చెఱువుకడజేర చిత్తముల్ సెదరిపోయె
పద్మనాభసహోదరీ భక్తి రూప
మెత్తి నట్లు దాశరధి కట్టెదుటఁ దోచె ॥92॥

ఊరివారల కలకల మురవడింప
కాళ్ళు శీతల స్పర్శచే కదల మతి చ
లింప కన్నులు తిరుగ తూలివడగ నొడ
లెట్టులో దాశరధి నిగ్రహించి, నిలువ ॥93॥

తప్పు సైరింపుడంచు పాదముల వ్రాలి
వేడువారలన్ జూచి, ఓవిప్రులార
నేను చేసిన దేమియు నిందు లేదు
పరమ కారుణ్య మూర్తి సద్గురుడు గలడు ॥94॥

ఆతడిప్పుడు పొలిమేర ఆలయాన
నిశ్చలాత్ముడై విశ్వ శాంతికితపించె
రండు దర్శింత మాయతి రాజు ననగ
అందరటు, శుచిస్నాతులై యరిగిరంత ॥95॥

ఆలయద్వారమున నిల్చి యంబ రాంచ
ల శశిరేఖయ్యె గిరిశిఖరాల కెగయ
శ్యామ! కౌస్తుభ ధామ! రమామనోభి
రామ! యని భక్తిలోయతి ప్రభుడుమునిగి ॥96॥

అగ్రహారాధినాథుడంబాయనె, దవ్వు
దవ్వులన్ ప్రజ స్తంభించు, తత్తరమున
నూహతెగ, నిశ్లె యాళ్వారులూడి పడగ
దాశరథి గురుమూర్తి పాదముల బట్టె ॥97॥

దేవ! యీయగ్రహార మేతెంచె మిమ్ము
కొలువ, మీరే కటాక్షింప వలె నన యతి
పిలుపిలువుమన్న యాతల్లి బిడ్డల కను
లార కాంచుటే లోకకల్యాణమనగ ॥98॥

శ్యామలాంగుడు, కమలాయతాక్షుడు, సువి
శాలఫాల భాగంబు పై చంద్ర వంక
నడుమకుంకుమబొట్టు మిణమిణ మెరయు
వాడు, వచ్చి ఆచార్యుఁ దిగ్భ్రమత జూచె ॥99॥

తెలుపు బట్టలు పూర్ణిమఁ దెలియజేయ
చేతి దండమువశియని చెప్ప చెప్ప
కె, తిరు మూర్ణము వైష్ణవాగ్రేసరుడన
అంబ చూపిన రూపె ప్రత్యక్షమయ్యె ॥100॥

ఈరూపమెనామనమున
సొరెకుకన్పించి నన్ను చకితుని జేసెఁ
తీరనికోర్కుల నేడే
తీరగ నాతల్లి చూపు దేవుం డితడే ॥101॥

అనిసాష్టాంగపుదండ
ప్రణామ మొనరింపగ, యతి భావము నారా
యణుఁ దలచె నింత మెత్తని
మనంబు గలమీకు నుగ్ర మార్గము లేలా? ॥102॥

వడహనంబి! నీవు వామమార్గాన వై
రాగ్య మూర్తి వగుచు బ్రతుకఁజూతు
సహజసుందరమగు సవ్యమార్గంబున
జనని నడపి నటుల సాగుమన్న ॥103॥

నిజమునిజము దేవ! నీమాట మాపెద్ద
లెపుడో! వేంగి వదలి యిటకువచ్చి
నను! దినదిన మాజనని గొల్చు పద్ధతి
విడువరదియె మాకు విస్తరించె ॥104॥

ఆత్మఁదోచిన రూపమాయంబ దివ్య
తేజమిప్పుడీ కన్నులం దెల్లమయ్యె
సర్వభూత హితులయి సాక్షాత్కరించు
గురుని గంటి ఆచార్యుని గొలువగంటి ॥105॥

ఇంట పాదపూజయిూ పేద భిక్ష సే
కొన కృతార్థుడగుదు ననుచు మ్రొక్క
ప్రక్కనన్న దాశరధి పంచ సంస్కార
విధుల పక్వ జీవి భిక్షనొకటె ॥106॥

దాసులకు బ్రసాదంబుగాఁదప్పకెప్పు
డైన నెట నైన మనగురుండనుభవించు
నిదివిధి ప్రయుక్తంబంచు దృఢతఁబలుక
అంబయాజ్ఞగా దాసోహమనియె నంబి ॥107॥

వడహానంబి లేచి స్వపరివార సహితు
డైగురునిఁజూచి హరిదీక్ష కాశపడగ
దాశరథి శంఖ చక్రముద్రాంకితులుగ
నందఱను మార్చె శ్రీ వైష్ణవాగమ  విధి ॥108॥

అందరుహరి దాసులై నిల్వయతియంద
రికి నమస్కరించి, లేచి, శ్రీహ
రి పద భృత్య భృత్య భృత్యుండ నని నమ్ర
డై సహస్ర బాహునాత్మనెరిగి ॥109॥

ఆసహస్ర బాహువుల ల క్ష్యార్థ మొకటె
కొలువ రామానుజుడొకడే గురుడు, విష్ణు
వే పరబ్రహ్మమని చాటె  వేయినాల్క
లడుగులకు మడుగులిడుచు వడహ నంబి ॥110॥

గురుపాదార్చనమొనరిం
చె, రసభరితభిక్షనిచ్చె శ్రీహరిమెచ్చన్,
గురుకరుణ నంబ గృహమే
హరిప్రసాదనిలయమ్ముగ నందఱఁ జేర్చెన్ ॥111॥

అన్నమే ప్రసాదమయ్యె, కుటుంబమే
సంఘమయ్యె, శరణు శరణనునుడి
మంత్రమయ్యె, గురుడె మాటాడు  హరియయ్యె
కావులధరియించికనికరింప ॥112॥

రామానుజ ప్రభావము
సామాన్యుల కన్నమయ్యె, శాస్త్రజ్ఞులమే
ధామధనమయ్యె, నానం
దామృత మై భక్త జనుల నలరించెనటన్ ॥113॥

జ్వరతప్తుండై యతివరు
శరీరముమెరికలతిరుగు సమయంబది దా
శరథింట లేమి తప్పని
సరి నంబి తరుణి భజించె సద్గురు తిలకున్ ||114||

తెరలు తెరలుగ స్మృతిగలుగ
తరుణీ సేవలు తగదను ధర్మ గురున్ చూ
చి తరుణి అయ్యా! బిడ్డల
పరిచర్యల విడువదగునె? పరిపూర్ణులనన్ ||115||

ద్రవిడ దేశపుపెద్ద ముత్తైదువ చను
దెంచి నంబి భార్య ననుసరించియొక్క
రాత్రి యతి పతి సేవనిర్మగ్న కాగ
అతని విషమజ్వరమ్మెల్లనదుపు తముగ ||116||

మబ్బు పొరవోలె నామెతో మఱుఁగు పడగ
నతివ కన్ను మూయుచు దరియంటి యున్న
ఆంధ్ర పూర్ణుని బిలిచి నాయంత్య కర్మ
దీర్పు మీవె యనుచుతుది యూర్పు విడిచె ||117||

కోలుకొనెయతి ఆసాధ్వి కోర్కె దీర్ప
చివరి సంస్కారమున్ నంబి సేయుచుండ
నేగుదెంచి వృత్తాంతంబు నెఱిగి దాశ
రథి విధి విలాస మాత్మలో ప్రణుతి సేసె ||118||

అతని యోచనాచలన చిత్రాంబరమున
మామ, సంసారి, యతి జగన్మాన్యుడగుట
అత్త, సంప్రదాయనిబద్ధ, యమల చరిత,
సాధ్వి పతినిఁ గొల్చి తుది శ్వాసవిడుటెరిఁగె ||119||

ఎవరి పుణ్యము వారిది యెటు॥ మేము
పుణ్య మాచరించెనో! యాంధ్ర పూర్ణుడత్త
కృత్య సంస్కారమొనరించి యాత్మజుడయి
యిలని ఫలము భజించు భాగ్యంబు గాంచె ॥120॥

# అధ్యాయము - 15

అనుభవైక వేద్యమై అమృతానంద
తత్త్వమై జగన్నిధానమై య
నంతకోటి జీవనాడుల ప్రాణమై
వివిధరీతుల హరి వినుతుడయ్యె

# 15. భక్తి ప్రభావం

నాటికర్ణాట సీమ జైనమతదీక్ష
సుప్రతిష్ఠితంబయ్యె రాజుహొయసలుడు
బిట్టి దేవుడు గుణగణాభిరతుడతడు
సర్వమత సమాదరణీయ చక్రవర్తి ॥1॥

అగ్రహారంబులే గాక యుండనున్న
పల్లె పల్లెలు వైష్ణవ భక్తి మెరసె
జైనులమనంబులో భీతి సందడించె
రాజుయలిరాజచర్యల క్రమము తరచె ॥2॥

తానుగురుడయ్యు శిష్యులందఱను జేర్చి
ప్రేమలాలించి సేవల ప్రీతినెరప
జాతిమత కుల స్పర్ధలు సన్నగిల్లె
అందరికి హరిభక్తియే హాయినొసగె ॥3॥

రెండుకొండల ముడివెట్టె నిండు కొన్న
జలము కల్యాణి సరసిగాఁ జనులకిచ్చె
ప్రకృతి నర్చించె శ్రీహరి ప్రతిమయుంచు
సంఘమే సంతసించె దాసత్వ మహిమ ॥4॥

ఇంత మహిమాన్వి తుండేటి కిటకు వచ్చె
చోళభూముల గాదన్న చోద్య మేమొ?
ఎవరి పున్నెము వారిది యిప్పుడాచి
తూచి మెలగుటే మాకువిధ్యుక్త మంచు ॥5॥

రాజలాంఛనంబుల నడి సరిగమె
ఉదయియలిని జూ డలరి భక్తి
మ్మై సౌంధ్యరుమిం వ్రైపు తెజమూ
పంటి కొలు శంలు ంల ంప ॥6॥

ని యూ ప్రై నె ని నంయు పె
ప్రాల్య కిరా ప్రు నె సిత ప్ర షురా
ార్య బంద్ర వచ్చెను జాని చొక్కు
ుతి పదముబంటు రాజంబు నంసి పలికె ॥7॥

విష్ణువర్ధనా! శ్రీనారి ,, యుండె
లలితలావణ్య లక్ష్మి ప్రపజ్జనించె
కళం కాణాది సీయిల్లు, కర్మ యోగి!
ఘనయశచ్ఛంద్ర చంద్రికా కరుడవైతి ॥8॥

సార్ధ కాఖ్యుండవై నీవు జగతి నేల
రాలు రమణీయ శిల్పంబు లైస్తుతిగాను
వీటు నిగమాగమాలవిస్పించునింక
కంది పోయినబ్రతుకు లానందమొసగు ॥9॥

అన మహా ప్రసాదమని రాజదంపతు
లా యతివరు పద నఖాగ్రరుచుల
కచ్చెరు వడి నగరు కరుదెంచి రీవార్త
పాక్కి జైన గురుల స్రుక్కఁజేసె ॥10॥

ద్రవిడభూమి నీదాఎయ్యు బ్రతుకలేక
ప్రాణ సంరక్షణార్థమై వచ్చె నిటకు
అందరికి మంచివారు కర్ణాటకు లగ
వేద వాదుల ప్రతిమ య్యై వెంయుం నా యతి! ॥11॥

అనుభవంబున నాత్మజ్ఞు డైన నరుఁడు
స్థిరత తీర్థంకరుండౌ చు మెరయు గాని
మరిమరి పరస్పర విరుద్ధమౌ శ్రుతి ప్ర
మాణ మను విప్రుల కితడే ప్రాణమగునొ। ॥12॥

తత్త్వ మిప్పుడు చర్చింపఁ దగదు మనకు
శాంతలా ప్రియదర్శిని జైన ధర్మ
రక్షణార్థమై పుట్టు కారణ చరిత్ర
ఆమె సహకారమే మనకాత్మరక్ష ॥13॥

ప్రభునకే ప్రాణరక్ష ,యీ ప్రజకభి మత
భిక్షయౌయన్న పూర్ణ ,సాధ్వి, కరుణాళు
ఆమహాతల్లి నేఁజూచు టవసరమని
జైనగురుడంతి పురిజేరె సత్వరగతి ॥14॥

దవ్వుదవ్వుల గురుడాగె మువ్వల గతి
వివిధ రాగాల కనువుగా విందు ఁగొలుప
చిత్ర చిత్ర భంగిమల సృజించు కొంచు
కళలలో లీనమైపోవు కాంతనరసె ॥15॥

శాంతలన్ నాట్య భారతీ సన్నిధాన
మందె గుర్తించి జైనమహాగురుండు
నిర్వికారుడై నిల్వ మంజీరనాద
మున్నదున్నట్టు లాగె మున్ముందుఁ జూడ ॥16॥

విద్యలన్నియు రూపింప వినమితయయి
గురునిదరి మోకరిల్లగ పరవశుడయి
శాంతి। యానంద నాట్యమేఁస్తబ్ధమయ్యె
నేటికో మె ట్టులోయన నేమిచెప్ప? ॥17॥

స్వామి! మీ యడుగుల సవ్వడి కదలింప
నన్ను, కదలి నే నెకన్నులార
మిమ్ముగంటి కారణమ్మేమొ? మీరాక
కానతియని శిరము రాణివంచె ||18||

అమ్మ! రామానుజా చార్యుడంట, వైష్ణ
వ ప్రభా భాసురుండంట, పక్వ జీవి
యంట, పండువయసు మహిమాన్వితుడట,
పరమతస్థుల శాసింప వచ్చె ననగ ||19||

లేదు లేదు దేవ! యాదయా పరమూర్తి
కంటి కొలకులందు కమ్మ దనము
వదనమందు బ్రహ్మ వర్చస్సు న జ్ఞాత
సౌఖ్యమొదవు నతని సన్నిధి మరి ||20||

ఎదిరి కదలిక లక్షణం బెరుగ నెంచి
చారులందించు వార్తల సత్య మెరుగ
స్వయముగాఁ బరీక్షింప నృపాలు డేను
పోయిదర్శించి నాము మాపున్నె ముబుక || 21||

ఆ మహాత్ముని రాకచే తీమనకరి
నాడు కళలతో విరిసి యనన్య శిల్ప
లక్ష్మితో బ్రపంచమున స్థిరమగు కీర్తి
నంది తరియించు నంచు మాయాత్మఁదెలిసి || 22||

అన జైనగురుని కన్నుల
కనపడె తీర్థంకరాళి కమనీయతపో
ధనవైరాగ్య గరిమ సాం
త్వనమున దర్శింత మతని తత్త్వంబనగాఁ ||23||

ఇంతలో రాజు సనుదెంచి యెదుటనున్న
గురునిఁ జూచి సంభ్రమ భక్తి నెఱఁగి దేవ!
శిష్య శాంతల కీనాడు చిక్కు వచ్చె
భక్తియో! జ్ఞాన వైరాగ్య పథమొ తలప ॥24॥

నేడు మనవీటి కేతెంచె నిర్మలాత్ము
డొకడు చోళుల శైవంబు నోర్వలేక
క్రొత్త వైష్ణవము సృజించు కొంచు చల్ల
ని మననీడ జీవింప గానెంచెననగ ॥25॥

రాజ ! సమదర్శివే కాదు ప్రజలకేది
తగునో! తెలిసినవాడవు తాతతండ్రు
లనుసరించు ధర్మంబు తప్పని ఋజుప్ర
వర్తనుడవీవు నీకు చెప్పఁబని లేదు ॥26॥

కాలకర్మల కనువుగా ఁగలుగుచున్న
మార్పులను వీడి కేవల మౌలికమగు
తత్త్వముంగాంచు టానందదాయిగాన
లక్ష్య సిద్ధికి సులభమార్గంబు తగును ॥27॥

ఇదినిర్ణయింప తమరే
యదనెరిగి సభ నొకటిచట నాదేశింపన్
తుది ధర్మము వైష్ణవమో!
మదినంటిన జైనమో విమర్శింపఁబడున్ ॥28॥

అంతజిజ్ఞాసులందున్న నారడి యెడ
గారు భక్తియో అనుభవ జ్ఞానమో యొ
కటియె సుప్రతిష్ఠిత మిట్టి కార్య మందు
తమయశస్సుదిగంతాల తళుకులీను ॥29॥

గురుడాడిన మాటలకా
యిరువురు మౌనంబుదాల్చి యేదోభావం
బురవడివెట్టగ దేవా!
త్వరలోనొక నిర్ణయంబు దర్శింతుమనన్ ॥30॥

వెడలె నూరారు బసదుల వినుతికెక్కు
జైనగురుపండితుల రహస్యముగఁ జేర్చి
మనకు మనధర్మమునకు సమయ పరీక్ష
వచ్చె ననతి కాలంబున ప్రాజ్ఞలార! ॥31॥

ఒకనాడు శంకరుని మా
యకుచిక్కక పైబడు కుమతాంధతమస్సుల్
అకలంకప్రజ్ఞనడచి
సుకృతాటవుల మనవారు జ్యోతిర్మణులై ॥32॥

పరమవైరాగ్య సత్వ సంపన్ను లైరి
నేల ప్రాకెడి చీమకు నింగి నెగయు
పక్షికి శుభంబు గోరుచు బ్రతుక వనము
లే, హొయసల రాజ్యేందిరకిక్క యయ్యె ॥33॥

నాటినుండి నేటివరక కీనాడులోన
మంత్ర తంత్ర శాస్త్రజ్ఞుల మానవాభ్యు
దయ పథ ప్రవర్తకు లున్నతగురుపీఠ
భద్రులై మనవారు శుభంబుఁగనిరి ॥34॥

కానీ నేడొకవైష్ణవు
డీనాడునఁ జేరి విభుని యెదకరగించెన్
రాణిని మెప్పించెను మన
జైనంబడగార్చునేమొ! జనజాగృతిచే ॥35॥

మొలక లోనెత్రుంచలయు కాదేని ము
న్మందు మనకె కాదు పురజనులకు
విభునకీ సమస్త విశ్వంబునకె ముప్పు
తప్పదనగ నాప్రధాన గురుడు ॥36॥

రానీ చూతములే, మన
జైనము శంకరునిఁ గూడ (జెల్లార్చె) తృణ
ప్రాణులు దాసయ్యలె మన
పై నెత్తుట? యెత్తి వారుబ్రతుకంగలరే? ॥37॥

జినుడే కలడని కొందరు
గుణాగుణం బెఱిగెదమని కొందరు సర్వ
జ్ఞ నిరూపణకిదికాలం
బని కొందఱుపల్కఁగ సభనావశ్య మగున్ ॥38॥

ధర్మదర్శనం బేదియోతప్పదింక
నిర్ణయింపగ రాజసన్నిధియెతగును
జైన గురుముఖ్యులెల్లరు చని జనవిభుఁ
జూడనాతడు వారల శక్తి యెఱిగి ॥39॥

వారి నుచితాసనంబుల గౌరవించి
మీరు నిగ్రహానుగ్రహ మేరుసములు
ధర్మ సూక్ష్మంబు తెలిసిన తత్త్వవిదులు
జీవకారుణ్యముఁ జాటు దైవతములు ॥40॥

తాతముత్తాతలందరు తమయనుగ్ర
హాభిరక్షిత క్షితిగౌరవార్హులైరి
ఎప్పటికిని మాగురుపీఠమిదియె యేటి
కీకలవరంబు? మీయట్టిదృఢమతులకు ॥41॥

గురువులెరుఁగనట్టి పరమ ధర్మములేదు,
జాతివైరమున్న సత్వచయమె
కలసిమెలసి మిమ్ము (గొలుచుటెరుంగమే?
ఆ శ్రమ ప్రభావ మబ్బురంబె? ॥42॥

ఎవరిధర్మము వారిది సృష్టిలోన
ఒకరి ధర్మమింకొకరికి నుగ్రమగును
కానిదేశభద్రతకు భంగంబుగాక
యెల్లర సమదృష్టిని శిష్యుడేలవలదె? ॥43॥

శైవులుశాక్తులు వైష్ణవు
లీ విశ్వంబునఁబలువురు నిచ్ఛావశులై
పోవుచువచ్చుటసహజం
బే వారల నియతి ధర్మ వృక్షముగాచు౯ ॥44॥

మదికుదుట (బడంగ మహనీయు లగు వారి
నెదురుకొనినమస్కరించి చూచు
టార్య ధర్మమంచుయత్నించితిని గాని
వైష్ణవంబు కొనెడి వలపులేదు ॥45॥

శైవ వైష్ణవ భేదముజ్జ్వలత రేగ
పొరుగు రాష్ట్రమువిడి మన భూమిఁ జేరు
యతి నెరిగి పరీక్షింపస్వయముగ మేమె
పోవనతని భేదాతీత బుద్ధితెలిసె ॥46॥

ఇంతమాత్రమునకెయెదవిచ్చు జినపాద
పద్మ పరిమళంబు భంగ పడునె?
యతులతోడి వాదమౌచిత్యమగునె? ఫ
లా ఫలములమది (దలపవలె నన ॥47॥

బిట్టి దేవ! మీమాటలే ప్రీతిమాకు
కాని సామాన్యులకిది ప్రమాణమగునె?
జైనమో! వైష్ణ వమో! సభాస్థాన మొకటె
తేల్చునని జైన గురువులు దృఢతఁబలుక ॥48॥

ఏక గ్రీవ పు వాక్కుల
కాకర్ణాటక్షితి పతి యంతర్ముఖుడై
మీకోరిన గతి శీఘ్రం
బేకాగల దాత్మ ధర్మ మీభువి నలర ॥49॥

జైనగురుల నృపుడు సముచితంబుగఁ బంపి
శాంతల ప్రియఁగన నంతి పురము
చేర సతి వచించె చిన్నవోయె ముఖంబు
మదికలంగినట్లు మాకుఁదోచె ॥50॥

శత్రు బాధలేని సౌజన్యమూర్తివి
ధర్మము కలనైన తప్పుకొనని
విభుడవుసతమాత్మవిద్యచే వడచెడి
తమకు చింతయె? యని తరుణిదరియ ॥51॥

ఇంతిని గని గురువులీ నాడు జినధర్మ
దూరులగుచు దారి తొలగిరిందు।
కేవల ప్రలిప్త కై విరచుకపడి
రకట! విధి బలీయ మయ్యెదేవి! ॥52॥

శైవమెదిరించి నిలిచెడి చేవలేక
వెఱచి యలిరూప మంది నుర్వినె యడంప
వచ్చె నంచు రామానుజ ప్రవరునాత్మ
శక్తినూహించిరే మనస్వాములకట ॥53॥

కాలుదువ్వి వాదమున కై గంతులిడిరి
ధర్మ సంస్థాపనార్థ మై తగుసదస్సు
నేర్పరచి యామ హాత్ము జయింపఁజూతు
రిది మహాక్షోభ కల్పించు నేమొ యనగ ॥54॥

దీనికింత విచారంబు త్రెళ్ళ నేల !
గురువు లాశించినట్టులే జరుగుఁగాక
ధర్మనిర్ణయంబగు సభ తత్ఫలమున
ప్రజలకానంద మగునంచు బలికె సతియు ॥55॥

దేవి! నీవు సదా జినదేవు పాద
పద్మముల భజింతు, పరమపావనమ్ము
నీ మది కలంచు నంచు చింతింతు గాని
ధర్మ నిర్ణయ సభ కూర్పతడవె? మనకు ॥56॥

ఇంతేకాదు నిరంతర
మంతర్ముఖుడై చరించు ననుభవ మతికీ
పంతములు వాదములు సి
ద్ధాంతంబులు నచ్చవంచు దలచె మునుల్ ॥57॥

ఈచరాచరాత్మకమగుసృష్టియెల్ల
ప్రథిత జైన తీర్థంకర ప్రభల వెల్గు
దోషమేదియు నామది దోచదింక
యతులు వాదింతురో! లేదో! యతనియిచ్ఛ ॥58॥

సతిశాంతలచిత్తంబున
కతులిత సంతుష్ట హృదయుడైకర్ణాట
క్షితిపతి తనరాకను యతి
పతికి దెలిపి ముందె కదలె పరివారముతోఁ ॥59॥

నృపతిరాకకు కారణంబేమొ యంచు
నిశ్చలధ్యాన యోగాన నిజమెరింగి
స్వపరివార పరీవృత ప్రభునిం జూచి
ప్రభువరా! మీరు ధర్మ నిర్ణయముగోరి ॥60॥

ఒకమహా సదస్సునుప్పగించితి శుభం
బౌను విబుధజనములందరికిని
శ్రుతిపురాణ శాస్త్ర చోదిత ధర్మమే
శ్రీహరియని జగతి బుజువొనర్చు ॥61॥

లనుభవైక వేద్యమై అమృతానంద
తత్త్వమై జగన్ని ధానమై య
నంత కోటి జీవనాదుల ప్రాణమై
అప్ర[illegible] వారివెలుంగు ॥62॥

అతడఖిల కల్యాణ గుణాభిరాము
డతుల తేజోమయుం డచింత్య విభుడు భువ
నఖిల సృష్టి స్థితిలయల నాడుకొనెడి
బంధ రహితుడు భక్తుల బంధు వతడె ॥63॥

వంతలేల? విష్ణువర్ధనా! నీప్రియ
త్వంబు లెల్ల సమ్మతంబె మాకు
జైనమున్న నాత్మ సంవేద్యమై చతు
ర్వర్గశోభితమయి వరలుచుండె ॥64॥

అదియపార కృపాబ్ధిక నానవాలు
లందరియినర్ఘ్య రత్నంబులందుకొందు
మతి రసానప్త కనుగుణంబై వెలుంగు
స్వాత్మ కలదన్న మాకును సమ్మతంబె ॥65॥

కాని తన్ను తానె గాంచి మిన్నంటుచు
గోడరీతి పెరుగగుణము కాదు
ఆత్మరక్తి జగతికానందమయముసం
సారనుందరికిని సారమయమె ॥66॥

శ్రుతులు కాదంచు విడనాడ గతములేని
వర్తమానమై మున్ముందు బ్రతుకదంచు
చెప్పుకోలేని స్వప్నమై చెదరిపోవు
అనుభవానంద చైతన్యమాత్మ యగును। ॥67॥

జైనుల సిద్ధాంతంబెటు
లైనను జినదేవుని దయ శ్రీహరిచిత్తం
బైనుతిఁగను ధర్మ సద
స్సీనాడున జరుగుఁగాక యెల్లరుమెచ్చఁగ ॥68॥

# అధ్యాయము - 16

ఓటమిగెలుపు మాటయే యూహరాదు
జైన తీర్థంకరశ్రేణి సత్యమెఱుగ
సర్వమత సమాదరణీయ చక్రవర్తి
సాధువుల గెల్చుయతిరాజ చరణమిదియె॥

# 16. సమయ పరీక్ష

ధర్మ నిర్ణయ సభ దిశదశల ప్రాకె
భక్తియో! జ్ఞానమో ! యని పండితాళి
జైనమో వైష్ణవమొ! తేలు సమయమంచు
రాజబంధువు లేతెంచి రచటికంత ॥1॥

రామానుజుడాజిన సే
వామండలినడుగు భక్తి వైరాగ్యపుధ
ర్మామృత మాస్వాదింపగ
శ్రీమన్నారాయణా! కృపసేయు మనంగాఁ ॥2॥

గణగణఘంటలు మ్రోగగ
ఘనాఘనశ్యామువేణు గానంబై వే
ద నినాదంబై పరగు త
రుణమిదియని తొండనూరు రుచిమతి చేరెఁ ॥3॥

ఆత్మ బలము మంత్ర బలమునర్థబలము
నన్నిటికి మించి నృపబలం బాసరగొని
సప్తశతజైన గురువులు సత్వరమున
ఆహాళే బీడు కరుదెంచి రాశలుబుక ॥4॥

పరమవైరాగ్య మూర్తు లై ప్రణుతిఁగాంచు
పార్శ్వ నాథ తీర్థంకర ప్రతిమలఁగని
శాంతి సౌజన్య శక్తి సాక్షాత్కరింప
మీయనుభవ జ్ఞానమె మాకు మేరువగును ॥5॥

పరులగెలిచి మేము బ్రతుకవలె నను పే
రాశలేదు జీవరాశినెల్ల
కాచు సాధుమతము కరముద్ధరింప య
త్నింతుమంచు మ్రొక్కి నిలువ వారు ॥6॥

బయలనిల్చి భావాంబర పథ విహారు
లై దిగంబరాత్మల మధురాను భూతి
వారికనుమొగ్గలందు విప్పారు ఒరసి
జైనగురువర్గ మంతయు సంతసించె ॥7॥

తొందరించెడి మనసుల తొండనూరు
జేర విజిగీష భూపాలు డేర్పరచిన
ధర్మ సంస్థాపనాసభఁదరియ రాజు,
మంత్రి సైన్యాధిపతులు సంభ్రమముతోడ ॥8॥

మున్నురికి స్వాగతంబిచ్చి ముందె వారి
వారికనువైన ఆసనాల్ వరుస చూపి
గౌరవింపగ జైన వర్గంబునందు
గుసగుసల్ రేగె యతివరున్ గూర్చికొంత ॥9॥

శైవులనెదిర్చినిల్చెడి చేవలేక
మాల పల్లెల మంగళంబంచు జేర్చు
కొనిబతుకుబికారి, మహేంద్రమునిజనభట
కలిత చండమార్తండులగెలువ గలడె? ॥10॥

గెలుచు టట్లుండనీ ముందు నిలువగలడె?
యీమహాత్ముల మహిమ లూహింప లేము
మింటహర్మ్యల నిర్మించి మెరయుగగఁ
రింటబంధింపఁగలరు దేవేంద్రు నైన ॥11॥

వీరుదలచిన గిరులుబంగారుకాల్వ
లైస్రవించు సముద్రాల్ హిమాద్రులగును
పగటిసూర్యుడు మనకంటి పాపయగును
చంద్రుడమవస తమ్మిమ్మెయి చేదలవెలుగు ॥12॥

కట్టుకదలక లోకాలు కదప ఁగలరు,
పట్టు విడువక గాలిని పట్టగలరు
రోగరుజనాల చిటికెలోరూపు మాపి
మృత్యుముఖజీవి నైన రక్షింపగలరు ॥13॥

అఘటన ఘటనా ఘటికులయ్యూ మనగురు
లహరహం బహింసావ్రతులైచరింతు
రఖిలభూత హితులు వారి యాత్మ శక్తి
నూహ నెఱిగెడి దక్షులీ యుర్వి లేరు ॥14॥

ఒక్కరొక్కరొక మహోన్నత శిఖర మిం
దరొకటైన నెదిరి తాళగలడె?
తప్పుకొనెనో! యేమొ! ద్రవిడవైష్ణవుడిప్పు
డంచు నతని రాకకాతురపడ ॥15॥

అడుగులకు మడుగులిడుచు యతినృపునకు
శాంతలామహాదేవియే స్వాగతంబు
బలుక తొప్పులార్పక చూచివశముదప్పి
లేచి కేల్మోడ్చె జినగురు శ్రేణి యంత ॥16॥

ఏమి యీయతులిత తేజ మెవ్వడీ త
డితనిలో జిన మూర్తికన్పించు చుండె
శాంతిదాంతి సౌజన్యమే చాటు వెడద
నేత్రములు జగత్కల్యాణనిలయములగు ॥17॥

ఎంతచూచినన్ దీరదు తృప్తియుంచు
స్తబ్ధమై సభమౌనముద్ర నడగారె,
చూచె నారాయణాయని జోతలిడు య
తిన్ త్రిదండమున్ కావులన్ దెలిసి వారు ॥18॥

వైష్ణవుడెఱుంగ మాయావి జిష్ణు డీ త్రి
దండమే మంత్ర దండము దరియుజనుల
భ్రమలముంచు కావియెవీని వస్త్రమకట
కట్టువిద్యలివి యనుచు (గలత(జెంది ॥19॥

అయ్య! మీ ప్రభు శక్తి మంత్రార్థ సిద్ధి
కనుగుణంబైన వేషంబునత్యధిక మ
ధురమగు తమవాక్కు(ల మర్మ మెఱుగు మమ్ము
నెంతమాత్రమునిర్జింప వింతయేల? ॥20॥

అనుభవజ్ఞాన పూర్ణ మా యాత్మ దెలిసి
సత్య ధర్మ శీలంబుల చర్చ సేసి
మమ్ముగెలిచిన మేము మీమతము నే గ్ర
హించి మీ సేవలో (దరియింతు మనగ ॥21॥

ఓడుగెలుపుల మాటయే యూహరాదు
మాట మాయమంత్రంబులే మాకులేవు
అప్పుడిప్పుడే గాక యెల్లప్పు డెల్ల
నిండునొక్క(నింగొలుచు దాసుండ నేను ॥22॥

వాదమేగాని జల్ప మీ పట్ల లేదు
శైవ శాక్త తత్త్వమొకింత భావ మెఱిగి
జైనతీర్థంకర శ్రేణి సత్త్వమెరుగ
సాధువుల(గొల్వ వచ్చు వైష్ణవ భటుండ ॥23॥

నాది నీదను భేదమే లేదుమనకు
ఒకరినొక్కరుతెలియగ నొదవిన శుభ
సమయమిది విష్ణువర్ధన శాసనమున
నిందఅనుగంటి విక జగద్ధితమగునన ॥24॥

యతివర! మీవినయ విధే
యతామహోన్నత గుణంబు లార్య ప్రతిపా
దిత ధర్మంబగు కానీ
అతివినయంబుగదలంప మాచార్యునిలోఁ ॥25॥

ధర్మ మేది? చరాచరాత్మక జగంబు
నిత్యమే? నిత్యమై వెల్గు సత్యమేది?
జీవులవిచార మాచార శీలగతుల
కేదిమూలమింతకు మనమెవ్వరయ్య? ॥26॥

ఇంకను జనియించెడి ప్ర
శ్నాంకురములు వేన వేలు సముచితరీతిఁ
శంకాతంకములడచు జ
యాంకితమతమున (జరింతు మందరమిచటఁ ॥27॥

లేదా జగదారాద్యం
బౌదయధర్మం బహింస లనుపమ నిత్యా
మోదంబగు జైనంబిట
నాదరమున జేకొనుడన యతివరుడంతఁ ॥28॥

చేకొన్నది జైన మనుచు
వాకొనతప్పగును(గాని వ్యాపక మై వి
శ్వాకృతి యై నిత్యంబై
చేకొను కల్యాణ గుణమె శ్రీవైష్ణవమౌ ॥29॥

దయ ధర్మ మహింసలెరుగ
త్రయీజగద్విదిత గుణనిదానమె మఱి అ
వ్యయమానంద ప్రద మా
త్మ యజాండవ్యాపృతమగు తత్త్వంబయ్యెన్ ॥30॥

దృశ్యమాన ప్రపంచంబు దృక్కుద్రష్ట
జీవజగముల రూప విశేష శక్తి
ఆదిమధ్యాంతముల నాత్మ నరయ
వాసుదేవనారాయణ ప్రాభవమగు ॥31॥

ఎదురయిన ప్రభాసుడు దరహాసిత వద
నాబ్జుడగుచు వంద లాది మమ్ము
నొక్కడెదురుకొనుట యుక్తంబుగాదన్య
లసహకారమవసరంబకాదె? ॥32॥

ఉన్నతోన్నతమగు నుజ్జ్వల వేదికా
సీనతఁబరికింప జైనగురుల
నెల్ల చూడవచ్చు నిందఱప్రశ్నల
కు నవధానశక్తిఁ దనుపవచ్చు ॥33॥

నిజమునిజము మాగురు దేవుని వచనమని
బిట్టి నృపుడు రామానుజు ఁబ్రీతిజేరి
యతివరా! యిదేసప్త శతాధిక గురు
వరుల చూడుడోయనయతి వరుడులేచి ॥34॥

వేదికాగ్ర పీఠస్థుడై వినయవినమి
తాంగుడై రంగ! నీలీల లద్భుత మని
కొలువుకూటము నొకసారి కలయఁజూడ
జైనగురువర్గ చిత్తముల్ స్తబ్ధ మయ్యె ॥35॥

అహమెవచ్చిన వీనియీా యబ్జ నేత్ర
ములసదృశ కాంతి మామనంబుల చెదర్చి
ఇతనితోమాకు వాదంబు హితముకాదు
ఐన నిదెపరీక్షింతు మీయాత్మశక్తి ॥36॥

వాసుదేవ నారాయణ పదము లొక్క
ఆత్మకేర్పడ్డ వివిధ పర్యాయపదము
లగునొ। లేక వేర్వేరుగా వ్యక్త మైన
ఆత్మలో వైష్ణవ మతిరహస్యమనగ ॥37॥

ఆత్మయొక్కటేజీవులఅక్షిగోచ
రమగు ప్రకృతి క్షణక్షణ ప్రభల సత్య
సుందర శివంబుల సదా ప్రశోభితుడగు
హరియె, చిదచిద్విశిష్ట కళలకనబడు ॥38॥

చేతనాచేతనాత్మకసృష్టి యెల్ల
శ్రీహరివిభూతియే యని స్థిరమొనర్చ
జీవునకు ప్రపత్తియొకటే సేవ్య మై శ్రు
తి ప్రమాణమై సులభ మైతేజరిల్లు ॥39॥

బ్రహ్మమే విష్ణు విచ్చుట ప్రభవ మందు
అంశ కణములే జీవులీ యఖిల ప్రకృతి
రంగభూమి, దేహేంద్రియ ప్రతతి ఆత్మ
కణగి నటుల జీవజగాలు హరికి లొంగు ॥40॥

బ్రహ్మమెంతటి సత్యమో ప్రకృతి యంత
నిత్య మది యెంత చైతన్య నిరవధికమొ
సృష్టియంత సౌందర్య రాశి యికజీవు
లందరారసగుళికలే హాయియొకటె ॥41॥

యతివరుండాత్మ విశ్వాస మధిగమింప
ఖచ్చితంబుగ (బల్కు వాక్యములు వేద
మంత్రములుగ శాసింప నామంత్రిత బుధ
వర్గమలరె కానీ ప్రతి పక్ష మలిగె ॥42॥

బ్రహ్మ విష్ణు శబ్దములు ధర్మ ములు గాని
ధర్మిరూపాలు గావు వాస్తవముగా దు
శ్రుతి పరస్పర తత్త్వవిరుద్ధ మగుట
జగతి పరమ ప్రమాణమై సాగదెపుడు ॥43॥

కల్పిత పరమాత్మ కన్పట్టు లోకాల
మూల మంచుశిలకు మ్రొక్క లేము
జీవలోక మందు సృష్టి స్థితిలయలు
సహజ గతిని సతముసాగు చుండు ॥44॥

భిన్న భిన్న ప్రవృత్తుల వృద్ధి యగుచు
జీవులోక మనేక మీసృష్టియందు
ఆత్మ కనువైనరూప మై యమరు తదను
గుణముగ అనుభవంబందుకొందురెపుడు ॥45॥

తన్నెరిగి యెదిరి నెరుగు టాత్మ గుణము
తద్విరుద్ధమై జడము సదా యడంగు
చేతనాచేతనంబుల జీవుడగుచు
నాత్మకాల కర్మగతుల నలయుచుండు ॥46॥

జీవుడే స్వయం కృషితనను తానెర్గి
చిచ్ఛ్వరూపియగుచు సిద్ధుడగును
అనుభవాత్మ సచ్చిదానంద తత్త్వ మై
కాలకర్మగతుల కట్టువడడు ॥47॥

జీవుడు చేసెడికర్మకు
జీవుడెబాధ్యుండుగాని చిక్కనియేదో
దేవుడు ఫలమిచ్చు ననెడి
మీవాదము జల్పమయ్యె మేధావులకే ॥48॥

దేవుడీశుడంచు తేలని కల్పిత
వ్యక్తులకధికార మంటగట్టి
ప్రజలమభ్యపరచి ప్రస్థాన వాక్కుల
పౌరుషమని వంతపాడలేము ॥49॥

మనము చేయుపనికి మఱియెవ్వరో ఫలం
బిత్తురనుట కల్ల యెవని కర్మ
వానిది కృషికి తగు పంట తదనుగుణ
సంస్కృతిన్ బ్రతుకుట సహజమగును ॥50॥

వెక్కుమాటలేల? నిక్కమీ జీవుడే
యాత్మ నెఱుగ బ్రహ్మ మగును జగతి
నిత్యసత్యమయ్యె నిజమిందె సచ్చిదా
నంద సిద్ధు డగుట యంతిమదశ ॥51॥

బ్రతుకులే గుణకర్మ విభాగ వశత
నాల్గువర్ణంబులై భువి నడచు ననగ
జైనధర్మ మాలించు రామానుజుండు
సాధువని సంభ్రమోత్సాహ చరితుడగుచు ॥52॥

జగతి నిత్యమనుట సత్యము జీవుల
నేకులనుట కూడనిజము, నాల్గు
వర్ణ ధర్మములను వాక్కులున్ సమ్మతం
బయ్యె వైదిక మతమందు గూడ ॥53॥

ఆత్మయత్యంత సూక్ష్మ మై యఖిల జీవ
కోటి లోఁబ్రవర్తించుచు ఁగూడియుండు
ప్రాకృత శరీరగుణముల పట్టువడకు
యంటియంటక యంతటు వ్యాప్తిఁ జెందు ॥54॥

ఆత్మకలదన్న మీవాద మలరుకాని
కరికికరిగ దోమకు దోమగా ప్రమాణ
మందు న్యూనాతి రిక్త తల్ ఆత్మకబ్బు
ననగ దేహాత్మ వాదమ్మైయణగి పోవు ॥55॥

చాలవరకు హరికి సమ్మతంబయ్యె ప్రా
మినుకులందు మాకు మీకు కొంత
అర్థ భేద మొదవె నాద్యంత వేదమే
మాకునచ్చు తుదియె మీకునచ్చు ॥56॥

ఎవ్వని కృషి వాని దేయనుట నిజము
ఎవని కెంతశక్తియెటులకలిగె
తెలియ వలదె? తెలియ వలె నన్నబ్రహ్మాండ
మెంతవరకు సహకరించుమనకు ॥57॥

ఎదుగగనొదవిన అనుభవ
మిదియది యని విరచి చెప్ప నెవ్వాని కగుఁ
తుదిమొదలెరుగక వెలువడు
నదియే శ్రుతి యనుభవజ్ఞానానందమగుఁ ॥58॥

పురుషుడంతర్ముఖుండౌచు భోగరాగ
వర్జితుడయి కేవల రసావస్థ నుండ
వెలువడిన యాత్మ వాక్కులే యిల అపౌరు
షేయ మై శ్రుతులుగ సుప్రసిద్ధిఁగాంచె ॥59॥

జీవులందరీశ్వరులైన సృష్టినియమ
మెల్లవిపరీతమై పోవు నెవని సృష్టి
వానిదగు ఁగాన జైన మప్రస్తుతమిక
నొకటె జీవుల నియతించి యుర్విఁగాచు ॥60॥

ఈ యఖండ సత్యమెవరెవ్వ రే దృష్టి
నెంతమూడగలరొ యంతవరకె
వారివారికనుభవంబౌ ర సాంబుధి
చూచు వానిఁ బట్టిసాగను లెగయు ॥61॥

కారణము లేక కార్యంబు కలుగ దెపుడు
కార్యములనంత రూపాలు కంట బడును
కారణాతీతమాత్మ సూక్ష్మాత్మతి సూక్ష్మ
మాత్మ లేక యీదే హేంద్రి యాలు జడము ॥62॥

జీవి అల్పజ్ఞు డై మిత స్వేచ్ఛ మెరయు
అల్ప శక్తున కేరీతి యఖిల భువన
సృష్టి సంస్థితిలయలనేచింతగలుగు?
అది యొకపరమాత్మయధీనమై చెలంగు ॥63॥

ప్రకృతి వోలె జీవి పరమాత్మ చేతిలో
కీలు బొమ్మ దానికి తనవిభుడు
తలచి యిచ్చినంత బలముతో నడచునే
గాని ఫలము గోరు కాంక్షలేదు ॥64॥

జీవుడెంత శ్రమించినన్ సిద్ధి పొంద
నీశ్వరానుగ్రహమొకటియె సహకారి
లేనిచో బూదిపాలౌను వాని కృషియు
వాఙ్మనముల కతీత మౌబ్రహ్మమిదియె ॥65॥

ఇతడు ప్రచ్ఛన్న జైనుడై యెదుట వడియె
నితని తోవాద మిట పై నహితమటంచు
జైనతత్త్వాధి నేతలే జారుకొనిరి
ఆస్తిక జన ముఖాళి విప్పారె తృప్తి ॥66॥

సప్తభంగి శాద్వాదమే జైన ధర్మ
మదియు నీకునచ్చినను మా కనభి మతము
రంగ! శ్రీరంగ రంగా! వరద! గజేంద్ర
వరద యని వేదికఁదిగి సరగువ యతి ॥67॥

తనయాశ్ర మంబు సేరగ
ననంత ఫణియంచు ప్రజ మహాద్భుత మని బి
ట్టి నృపాలుడు యిలి మతివ
ర్ణన కందనిదంచు దాశరథి వెన్నంటన్ ॥68॥

వచ్చి వారాశ్ర మాంచల భాగ మందు
నిలువ యతి శుచి స్నాతుడై నిష్ఠనిష్ఠ
దైవతమగు లక్ష్మీ పతిన్ ధ్యానమందు
నిలుపకోటి ప్రజలు కొలుచు టెరిగె ॥69॥

వచ్చిన పనిముగియవచ్చె పాతాళాంత
రమునన్నున్న నన్ను ఁబ్రజదరింప
నాగమోక్తి కొలువు మన్నయంతర్యామి
ఆలకించి కన్నులల్లఁ దెరచె ॥70॥

దాశరథి! వైష్ణవాలయ స్థాపన కిక
యత్నమొనరింపవలె స్వామి యాజ్ఞ యనగ
గురువరా! విష్ణువర్ధన నరవరుండు
వేచె, దర్శనార్థ మనివిన్నవించె నతడు ॥71॥

చూడరమ్మందు రా యన సుంతకనులు
మూసిరమ్మనుమాయన భూవరుండు
వచ్చియతిరాజు కాళ్ళ పై వ్రాలు చుండ
లెమ్ములెమ్మని కేల్పట్టిలేపె నతని ॥72॥

నృపుని యొడలెల్ల పులకించె నీరుకనుల
గ్రమ్మె పల్కులు నాల్క పై రాకనిలిచె
భక్తియో! రక్తియో! యతి స్పర్శ ఫలమొ!
అనుభవంబును వర్ణింప నలవిగాదు ॥73॥

తేరుకొని బిట్టి దేవుడు దేవ? మిమ్ము
జూడగనె జైనుల స్పర్ధ సురిగి పోయె
వినగ పారవశ్యానంద వివశులైరి
యందఱకు నన్ని గతులనా హ్లాదమబ్బె ॥74॥

మరల వైదిక భక్తి పై మనసుమరలె
మిమ్ము విడలేక నుం టి ఎదమ్ములంట
నన్ను నేన తెలియని యానందినైతి
నింకనీరాచ భోగంబులేలయనఁగ ॥75॥

కేవల నివృత్తి చూడ శుష్కి కృతంబు
కేవల ప్రవృత్తియు నహంకృతిని రేపు
పండ్ల మధ్య మెదలు నాల్కవలె నరుండు
నంటి యంటక శ్రీహరి నందవలయు ॥76॥

నాదినీదియనెడిప్రభేదంబువిడిచి స
కల మతములు సకల కళలు సకల
భాషలు సకలంబు వర్ధిల్ల చూచుటే
హరియనుగ్రహంబునదియెనీవు ॥77॥

నీవ లేకున్న జైనుల నేను చూడ
గలనె? వారి ధర్మంబును తెలియగలనె?
యిందరమహోను భావుల నెరుగగలనె?
యందరికి సూత్రధారి నీవైతి వయ్య ॥78॥

ఇంకను మహామహత్కార్య మీవె నడుప
వలె ననన్ మహాభాగ్యము దెలుపుఁ డనగ
బిట్టి దేవ! సమీపాన గట్టిపడిన
దిబ్బపై నిత్య మల్లెల తీవలెగసె ॥79॥

నాగు లీ చెల్వ నారాయణ ప్రభుని ని
రంతరము సేవ సేయుచు బ్రతుకు చుంద్రు
రమ్మ దర్శింత మని యతిరాజు ముందు
నడువ నాగేంద్రు డెదురయ్యె, నరవరేణ్య! ॥80॥

జంకు గొంకులు విడనాడి సాగుమయ్య!
పడగవిప్పిన కుండలి బ్రహ్మపదము
దెలుపు ననయతి గమ్యంబు తెల్లమయ్యె
అల్లనల్ల గరుత్మంతు డంబరాన ॥81॥

ఆత పత్రమ్మై మేల్కొట కరుగుదెంచె
ఫణి అదృశ్య మ్మై కొండ పై పక్షినిలిచె
జైన భక్తు లత్యాశ్చర్య చకితులగుచు
ముందుఁబడ భటుల్ తొలచిరి ముండ్లపొదలు ॥82॥

పూలదిన్నె నిర్మాలమ్మై పోయె, దిశల
చెలువ నారాయణ స్వామి కళలె గవిసె
దవ్వు దవ్వుల పనివారు తలగగ యతి
చూచె సంభ్ర మానందుడై సుందరాంగు ॥83॥

పెన్నిధిని గన్న పేదయ్యె పెను తపః ఫ
లంబనుభవించు సిద్ధుడై లక్ష్మణ యతి
చేతికందిన శ్రీపతిఁ జేర్చియెదకు
అనుపమానంద మూర్తియ్యె అశ్రులవిడె ॥84॥

అంతర్ముఖులగు ఋషుల ల
శ్రాంతము చింతించు దివ్య చైతన్యమె శ్రీ
కాంతుండై కృప జగదా
ద్యంతము రక్షింప మనకు దర్శన మిచ్చెఁ ॥85॥

కార్య కారణాల కెవడు కట్టు వడడు,
కాలఖండిక లెవ్వనికదపలేవు
తగులడెవడు ధర్మా ధర్మ తంత్రములకు
అఘనాఘను డిందు ప్రత్యక్షమయ్యె ॥86॥

నారాయణనామంబే
పారాయణమై యనంత భాగ్య ప్రద మై
ఘోరాతి ఘోర పాప వి
దూరంబై మనలఁ గాచుదొర దొరకె నిటఁ ॥87॥

నాగవిష్ణువర్ధన మహీనాథుడంజ
లించి ప్రాకృత సృష్టి చలించు కాని
చెలువ నారాయణ స్వామి చిత్కళలిట
విజయవీర్యయశ శ్రీల వెలుగు లీను ॥88॥

వైదికులు బ్రహ్మ మన శివోపాసకులు శి
వుడన బౌద్ధులు బుద్ధ దేవుడన జైను
లర్హతుడన కర్తయని నై యాయి కాళి
కర్మయంచు మీమాంసకుల్ గౌరవింప ॥89॥

అఖిల భువన సృష్టి స్థితి హరణ లెవని
లీలగా సాగు వినత భూతాళి గావ
బద్ధ కంకణుండెవ్వడా పరముడిందు
చెన్నకేశవుండగుచు! నీ సీమనిలిచె ॥90॥

బేలూరు గదగు తలకా
డాలయములె హరివిలాస మత్యద్భుత మై
రాలకు జీవము పోయగ
పాలింపుడు మమ్ము మీతపము పండెననఁ ॥91॥

రామానుజుడు తథాస్త నె
భూమీశుని రసహృదయము పొంగులు వారఁ
భూమింగల శిల్పుల సే
వామందిర మయ్యె విష్ణు వర్ధన పురమే ॥92॥

శిలల జాతక చక్రంబు చెప్ప నేర్చు
శిల్పులు రస సిద్ధులు చెంత జేరన్నపుడు
వారివారి కనుగుణ మౌ వసతులొసగ
గదగు తలకాడు బేలూరు కళల విరిసె ॥93॥

ఆగమోక్తి రామానుజుండాత్మ బోధ
కనుగుణంబుగ నారాయణుని ప్రతిష్ఠ
సలుప మేల్కోట వైకుంఠ నిలయమయ్యె
కాని ఆచార్యునాత్మలోకలత రేగె ॥94॥

విశ్వమంతయు చుట్టికన్విందు సేయు
విష్ణుమూర్తి దివ్యోత్సవ విగ్రహంబు
మునల మానుల చేతిలో ముసుగునబడె
ఉత్తలాపథంబంతయు నుడుకు చుండె ॥95॥

జలనిమగ్నమై పోయిన స్వామిని మును
శంకరభగవత్పాదులు స్వాత్మ నెరిగి
బదరిలోఁ బ్రతిష్ఠించె ప్రపంచమలర
దిశలనెల్లనారాయణుఁ దీర్చె నాడు ॥96॥

బదరీనారాయణుడీ
యదనునయన్యుల చెఱబడ నలజడీరేగెఁ
తుదిమొదలెరుగనిబాధల
నొదవెన్ పరిదిద్దదెత్తునుత్సవమూర్తిఁ ॥97॥

ఇప్పుడా శక్తి నన్నావ హించె మించె
హరికరుణ కామగమనాదులాత్మదోచె
దెత్తునుత్సవ విగ్రహంబిత్తు మహికి
యోగనిద్రకు భంగంబు నొదవ కుండ ॥98॥

నాశరీర మిందె నలగకుండ సురక్షి
తంబొనర్పుడంచు దాశరథిని
కట్టడియొనరించి గాలిని బంధించి
చిత్త మదుపుజేసి శ్రీహరియని ॥99॥

యతివరుండు యోగియ్యై కాశి గయ అయో
ధ్యాప్రయాగ మధుర సుప్రసిద్ధ
బదిరికా వనములఁ బరికించి యార్థికో
న్మత్తచిత్తులవశ మౌటచూచి ॥100॥

అప్పుడప్పుడే మహమ్మదీయులు మత
వ్యాప్తికైయలుఁగులు పదను వెట్టి
తెరలు తెరలగపడ దేశీయ నృపులాంత
రంగిక కలహాల క్రుంగు టెరిగె ॥101॥

ఆర్యావర్తంబి ప్పు డ
నార్యాక్రాంతంబు నై సనాతన కార్యా
కార్యపు ధర్మము చెడ యతి
పర్యాకుల చిత్తుడగుచు భ్రమియించుతరి౯ ॥102॥

అల్ హము, లల్లాహి, యల్లాహో, అక్బ
రర్ హమాన్ యి ర్రహీమను యెదగీతి
సోకగాయతి రాజ సూక్ష్మ దేహంబు
వీక సమాధిలో విగ్రహంబయ్యె ॥103॥

విశ్వాంతరాళాన వెలుగొందు నారాయ
ణేశ్వరు విష్ణువిశ్వేశు నావాసు
దేవ తత్త్వంబె ప్రతిధ్వనింపంగ
ఆవెడద కనుల నశ్రువు లొలికె ॥104॥

పరమాత్మ తేజంబు బాహిర ధ్వనుల
ధరణి పై భాష లై పరగంగ ప్రజల
పరిణామ మానంద భరిత మై వెలుగ
పరికింప మోకాలు ధరబూన్చి మోము ॥105॥

అల్ల నిస్సంశయ స్వాంతుడైవంచి
అల్లాహి అల్లాహో అక్బరనంగ
ఎవ డఖండ బ్రహ్మాండముల్ సృష్టి చేసె
ఎవ్వడవ్యాజ వాత్సల్య దృష్టి పరగు ॥106॥

ఎవని తుదితీర్పు జీవుల కెల్ల రాచ
శాసనం బాత డొకడెరక్షాకరుండు ॥107॥

లన్యథా శరణం నాస్తి అల్లా నీవె
మాకు గలియనుచు నుతింతు మహరహంబు
నీ యనుగ్రహ మహిమ చే నిను భజించు
దేవదూత పథంబిందె తెలియవచ్చె ॥108॥

నీ ము ఖోద్భ వంబైన అమృతరసధుని
ఈఖురానె బ్రతుకు తరియింపఁజేయు
నన్ను భక్తునింజూచి రామానుజుండు
తన్మయుండౌచు నతనిపాదముల ముట్టె ॥109॥

ఏమిది, యెవరిదీ స్పర్శ, హృదయ మేదొ
ఉన్నదున్నట్టు లుప్పొంగు చుండె, నని న
మాజు నిలిపి సుల్తాను సంభ్రమత లేచి
కలయ ఁజూడగ ఁగ్రొంగొత్త తలపు తెగసె ॥110॥

తత్క్షణంబెయెదుట సాక్షాత్కరించు పై
గంబురుగని మాట కట్టు వడగ
కనుల నీరు జార కర మెత్తి యెట్టులో
బ్రతుకు పండె మీ ఖురాను మహిమ ॥111॥

అల్లా దయ యింతింతని
వల్లింపగ లేను గాని భాగ్యనివశులై
కొల్లగొను క్రూర కర్మల
మల్ల నృపులగొలుచు నను మన్నింపుడనన్ ॥112॥

జరిగినదంతయు నేడు నె
మరువేయగ బాధ కాని మదిమార్చెడినుం
దర సురుచిర రూపంబున
మరులుగొలుపు నొక్క బొమ్మ మాకులభించెన్ ॥113॥

ఆటబొమ్మగ నదిబిడ్డయీ సం దీర్చి
చూరగొని పుణ్య భూములు చుట్టి చుట్టి
వచ్చిదాని ముందర నిల్వ పలుకరాని
యేదొ! యొకతృప్తి మామదికిచ్చు చుండు ॥114॥

చూడరండని లోనికి చూడ సుతయె
సకల భూషణాలంకృత స్వచ్ఛ మైన
పై డిబొమ్మనుఁ దెచ్చె నా పసిడి బొమ్మ
యెల్లరనయన కాంతుల కిక్కు కాగ ॥115॥

బిడ్డ! యీబొమ్మ సొగసులే ప్రీతికరము
దీనికంటె విశేష మై దివ్య మై య
ఖండ సత్య సౌందర్యముల్ కలవు చూడ
నేర్చుశక్తి రక్తగతమ్మై నీకునుండె ॥116॥

అనగనతని యందేశక్తి యడగెనో తె
లియదు మంత్ర ముగ్ధ యగుచు ప్రేమ చెంచు
కొన్న దివ్య విగ్రహము గై కొని మహమ్మ
దంఘ్రి పదములనిడినిల్చు నతివఁ జూచి ॥117॥

నిర్వికార నిరాకార నిర్విశేష
నిర్గుణనిరంజన బ్రహ్మ నిలయ మైన
సచ్చిదానంద మల్లాను సతతమనుభ
వించు పెద్దలమార్గంబు విడువఁదగునె? ॥118॥

ఏది పొందిన నిక ఁబొంద నేది లేదొ!
ఏది తెలిసిన ఁదెలియ నింకేది లేదొ!
అట్టి పూర్ణమౌయానందమందగలుగు
ప్రేమ నీయందె నిబిడమ్మై విరియునంచు ॥119॥

యవన కన్య శిరంబున హస్తమిడగ
తండ్రితో పాటు దేవ దూత యు మిగిలిన
బరిసరప్రాంతమంతయు భవ్యమగుచు
దివ్య సౌందర్య కాంతుల దేజరిల్లె ॥119॥

అయ్య! నీబిడ్డ హృదయమే యతిమృదులము
నిర్మల గుణాభిరామ మై నెగడె నిత్య
మఖిల భూత హితార్థ మైయర్భలందు
నని మహమ్మదు పైగంబ రానతిచ్చి ॥120॥

క్షణములో మాయ మై పోయె స్వస్వరూప
మంది యతివరుండా విగ్రహంబు తోడ
మేలుకోట కే తెంచె నెమ్మే ను లే చె
సిద్ధులకసాధ్య మే లేదు సృష్టియందు ॥121॥

ఉత్తరా పథ మెల్ల దివ్యోత్స వాల
వీధి వీధుల నూరేగు విష్ణు మూర్తి
ఖడ్గ జీవను లౌ తురుష్క హృదయాల
రాగమొలకించు సుందర ప్రభలదేలె ॥122॥

ఇదిబదరీనారాయణ
సదనోత్సవ విగ్రహంబు సకళుండై మ
హ్మదు పుత్రీ హృదయంబున
బదిలంబగు భక్తిపాశ బద్ధుం డయ్యెన్ ॥123॥

నేడు మననీటి కిన్ వచ్చె నఖిల జగతి
సంతసంబంద నూరేగు సమరసాన
వివిధ మతముల జాతులు వృద్ధి బొందు
మేలుకోట ధర్మమునకే మేరువగును ॥124॥

వార పక్ష మాస వర్షాంత మీస్వామి
కాగ వెూక్తి వేడుకలిటనడచు
మధురభక్తి మెరయ మహ్మదు కూతురా
ళ్వారుల గతి పూజలందు (గాక ॥125॥

చెలువ నారాయణ స్వామి చెంతయునన
కాంత దివ్యరసాంగి రాగమయి వెలుగ
ఆలయమున( బ్రతిష్ఠించి యర్చ సే సె
జగతి యే మెచ్చె రామానుజ రసకృతికి ॥126॥

# అధ్యాయము - 17

రాయిభువన మోహన రూపమ్మై యలరగ
నీరు తీర్థమ్మై ప్రాణాల నిలుపనేర్వ
శబ్దమే మంత్ర మ్మై మన శ్శాంతిగూర్ప
గురుడు పరమాత్మయ్మై వెలుగొందుటరుదె ?॥



శ్రీరంగనాథుడు

# 17. తత్త్వము

కాడు వీడయ్యె పూదిన్నె కమ్మనైన
ముద్దు గుమ్మల గుడియయ్యె మూగుచున్న
వేదబమ్మల కొలువన వేంకటప్ప
చెలువ నారయ్యగ నిట వేంచేసెనంట ॥1॥

తురకపిల్లల మురిపించు దొంగ సామి
ముద్దులముఖంబు మఱియు నా పెద్దకనుల
అందమున్‌జూడవలెనని హరిజనుడట
పగటి కలల మున్ముందుకు వచ్చుచుండ ॥2॥

తొలగు తొలగు మనెడి పలుకులు విని యతి
పడగ విప్పిన ఫణిభాలిలేచి
చూడ, ముట్టనయ్య చూచిపోదుఁజెలువ
య్య నొకసారియంచు నతడు వేడ ॥3॥

ఎంత ధైర్యంబు రా, నీకు నీముఖంబు
చూడగనె కట్టు బట్టల తొడగంగ
లోఁబడవలె మేమె మఱి చెలువని మోము
చిట్టి చిందునో కందునో చెప్ప లేము ॥4॥

పో పొమ్మని గర్జించె డి
ఆ పండిత వేషుఁ జూచి ఆచార్యుండే
తాపిత హృదయుండై యు
ద్దీపిత నయనంబులఁ జనుదెంచి దరిద్రున్ ॥5॥

మోకాలి కెగువ నతుకుల
కోక ,నడుమునకు బిగించి కోలున గజ్జెల్
డాకేలున గల్లన తల
పై కెంజడలూగు, మసన భాగ్యునిఁజూచెఁ ॥6॥

చూడ వాని నే త్రంబుల స్ఫుటమగుహరి
భక్తి భావంబుఁ దెలిసి నంభ్రమమునయతి
రంగరంగాయటంచు నాచరణమంట
పండితావళి గుండెలే బ్రద్దలయ్యె ॥7॥

కటకటా! యిట్టి దృశ్యంబుగాన మెపుడు
శ్రుతుల చదువుటే గాని గురుడు యతివరు
డగ్రకులజుండు సాధు బృందార్చ్య తుండె
చోద్యమిటు లౌటయిందాక చూడ మనిరి ॥8॥

తప్పుకొన ఁజూచు భక్తుని దారి కడ్డు
పడి సనాతన కవి బుధ పండిత ప్ర
కాండులంజూచి చిత్తంబుకందు చుండ
అల్లనల్లరామానుజుండాడ దొడగె ॥9॥

వర్ణాశ్రమ ధర్మంబుల
నిర్ణయ ముచితంబె కాని నిరుపమ భక్తిఁ
వర్ణింప కష్టమది రస
పూర్ణంబచ్యుత కృపాబ్ధి బుధులెఱుగఁదగుఁ ॥10॥

ధర్మమందున భేదంబు దల కొనంగ
భక్తియొకటియే దానిని ఁబరిహరించు
భక్తియన సేవయే కాదు ప్రజలఁగావ
బుట్టిన పరిపూర్ణ జ్ఞానము దయ యిదియె ॥11॥

దేవమనుజతిర్యక్కులందరు తెలుసు
స్వార్థ సంకుచితస్వభావాల తొలచ
కడకు క్రిమికీట కాదుల కనికరించు
భక్తియొకటియే జనులకు భద్రమయ్యె ॥12॥

హరిశరీరమీబ్రహ్మాండ మంతయు గుణ
కర్మములఁ బట్టి భిన్న మార్గంబులప్పు
టప్పటికి మారుచుంట సహజమిది గ్రహి
యించి యంతర్ముఖానజీవించుటొప్పు ॥13॥

ఆలయ ప్రవేశ మందరి జన్మ హ
క్కంచట పొమ్మన మన మెవ్వరయ్య?
బిడ్డలందర హరిప్రీతితో నొడిఁ జేర్చ
సోదరుల కసరుట సూక్తమగునె? ॥14॥

ఊరివారికి కేలూత నొసగు వారి
నూరివెలుపల వెలివేయు టుచిత మగునె?
అందరొక చోట బ్రతుకుటానందమగును
వేరువేరుగ విడిపోవ విధి విషమగు ॥15॥

నీరుఁ గట్టి మీ పొలములనిలుపు వారు
పారవేసిన సద్దితో బ్రతుకువారు
మలము తొలచుచు తల్లిగామనుచువారు
పరులకై బ్రతికెడి తిరుక్కులరువీరు ॥16॥

వీరి నే విడి హరిని మెప్పింపఁగల మె?
అంబనే కసరిన మనుష్యత్వ మగునె?
మూల మడగార్చ ఫలపుష్పములు పొడమునె?
వీరెలేకున్న సంఘమే విలవిలబడు ॥17॥

శ్రుతులవల్లించు పెద్దలు స్మృతిరహస్య
మెఱిగిన విచార శీలురు నెక్కడైన
మనిషి మనిషినే కాదన్న మాటకలదె?
దయయెతప్పిన శీలంబు ధర్మమగునె? ॥18॥

పల్కుడని నిలదీయ నాపండిత ప్ర
భువులు లోలోన గొణగి కేల్మోడ్పుగ యతి
ముసుగులో గుద్దులాటలు మోస మనగ
వారు జంకుగొంకులు మాని పలికి రిటుల ॥19॥

వర్ణ సాంకర్య దోషాన ప్రభవ మందు
పంచముల కాస్తి వైహాక్కుపట్టదయ్యె
రుద్ర భూమి నికృష్టులై శ్రుతివిదూరు
లై మనుడని మను స్మృతులాన తిచ్చె ॥20॥

ఇట్టివారి సంసర్గమే పట్టులందు
కూడ జాతికి తగదంచు ఘోషపెట్టు
స్మృతుల శాసన ముల పెడచెవినిబెట్ట
మనకె కాదీ వ్యవస్థకే మారకమన ॥21॥

పైబడుకినుక తెలినవ్వు పలుచకాగ
ఛాందసుల జూచి రామానుజ ప్రవరుడు
ఎప్పుడో యెవ్వరో చేయుతప్పులకిట
వీరి నీయెడ శిక్షింప విధి విహితమె? ॥22॥

ఇంతకున్ నిలుకడలేని స్మృతులఁ జూచి
స్థిరమగు శ్రుతి పురుషుని మఱువఁదగునె?
ఆదయామయుండందరియాత్మలందు
నిలిచె నను సత్యమెఱుగక పలుకఁదగునె? ॥23॥

రుద్రభూముల కాచు పరోపకారి
కల్మష హరుండు నిత్యమంగళ కరుండు
చెంతఁ జేరిశ్రీహరిని దర్శింప రాగ
వలదు పొమ్మని కసరగ భక్తియగునె? ॥24॥

మనతిరుప్పాణియాళ్వారు లనుసరించు
భాగవత సంప్రదాయంబు వదలఁ దగునె?
ఆ ప్రభావంబు తెలిసియు మీ ప్రవర్త
నంబుమారదే యంచు శోకంబు చింద ॥25॥

కాదు కాదు దేవ! కర్మ బద్ధుల మై అ
హంబు త్రిప్పినట్టు లాడి మే ల్మె
ఱుగులఁజూచి మురహరుని వీడినామని
యతి పదాల పై బుధాళి పడగ ॥26॥

చరణ ద్వంద్వము పైఁబడి
దురపిల్లెడి శిష్యుల గను దూరీకృతు తా
నిరహంకారుల దుర్భర
దరిద్రుల తిరుక్కులజులఁదయబరికించు ॥27॥

ఎంత యడగార్పఁ గా నహంబంతకంత
బంతిగ నెగిరి బండగా ఁబడుశిరాన
బంక ముద్దగా నొకపరి పయిఁబడునిది
ఏమి నీలీల యో రంగ ! యెఱుగ మనగ ॥28॥

యతివరేణ్యుని స్పర్శలో నంటరాని
వారి తమమింకె కన్నుల ప్రజ్ఞ మెరసె
చెలువ నారాయణ స్వామి చెరతొలంగె
అంటరాని తనంబట నంటదయ్యె ॥29॥

భేదభావంబులాత్మ లో విఱిగి పడగ
కర్మలోనున్న గౌరవ గరిమ పెరిగె
శుచిరుచులు భక్తి విశ్వాస సుకృతు లుబికె
పరమ చైతన్య భరితమై పరగె జాతి ॥30॥

రండురండెల్లర కును నారాయణుండె
ఆశ్రిత జన వత్సలుడు రక్షైక దక్షు
డితని దర్శింప నలసత్వ మింకు నంట
రాని తన మంటదనుచు రామానుజుండు ॥31॥

అహమె చైతన్యమై వెలుంగై వెలింగె
దేవ మనుజ తిర్యక్కతి స్థావరాళి
భక్తి చే భేద మే లేక ప్రబలుటెరిగి
శ్రీహరి విలాస మున్ శే ముషీ ప్రియుండు ॥32॥

పైకి కన్పించు భేదంబు పాలిపోవ
శ్రద్ధ భక్తి ప్రపత్తి విశ్వాసగరిమ
నాటినుండియు ప్రబలి వైష్ణవ సమాజ
మునకు పెట్టని కోట య్యై ముదముగూర్చె ॥33॥

యతిసంఘ సంస్కరణ శ
క్ర్యతి శీఘ్రముగా జగత్తునలమె, నృపుడు, కీ
రితి నారాయణ నిలయం
బతి రమ్యముగా రచించెనమరులు పొగడన్ ॥34॥

తొండనూరున తండోపతండములుగ
జైనులేతేర పంచ సంస్కార విధుల
వైష్ణవులఁజేయ కుడి చేతఁబట్టె చక్ర
మనగ నంబి నారాయణుం డ్డవతరించె ॥35॥

గదగు వీరనారాయణుండుదయమ్మై స
వైదికోజ్జ్వల భక్తి ప్రపత్తులుత్క-
టమ్ముగాన్ వేదబాహ్యమతమ్ములడచె
యతివరు ప్రజ్ఞ దశదిశావ్యాప్త మయ్యె ॥36॥

బే లూరే శిల్ప కళా
శ్రీలకు నెలవయ్యె సత్య శివ సుందర త
త్వాలయ మై నారాయణు
కాలాతీత ప్రకృతికి కైయద్దమిడెక్ ॥37॥

విష్ణువర్ధన రాజ్యంబు విస్తరించె
గదగు బేలూరు తలకాడు లెదఁగదల్ప
మేలుకోట తొన్నూరు లే మేరువులన
హొయసలేశు యశో రమనుర్వి నలమె ॥38॥

రంగ! నీయాజ్ఞ మేర కర్ణాట భూమి
కంటి, కంటి సుందరవనా క్రాంత గిరుల
మీ రస స్వరూపాల నిర్మింపఁ గంటి
నాలయంబుల శ్రీవైష్ణవాగమోక్తి ॥39॥

దేవమానవ తిర్యక్ష డావృత విభ
వంబు నాల్గువర్ణముల గుణంబుఁగంటి
జైన సంబోధితాత్మ ను సంస్కరింప
గంటి నీనిగమ శ్వాసగరిమఁగంటి ॥40॥

కాని మాటి మాటి కి మది కలవరించె
ఏటికో కురేశ పూర్ణు లెదుటబడిరి
ఏదొకీడుశంకించె నే నేమి సేతు
నిబ్బ రంబుగ నీవలె నిలువ లేను ॥41॥

కాని నాకు నేనె కడు స్వేచ్ఛ పూని యే
మియును జేయలేను, మీరనుగ్ర
హించునటులె నడతు నెదు రైన వెతలెల్ల
నోర్వలేక నలుగు చుంటినయ్య ॥42॥

నీవు నన్నుఁజూచి నటుల నేను నిన్ను
జూచి సేవింప లేను నీ సూత్రచలన
గతినెరింగెడి నేర్పరిఁగాను కాని
అందుకో లేని నెయ్యాన నలమటింతు ॥43॥

రంగ! నిను జూచి కొన్నియేండ్లయ్యె నయ్య
అచటి సేవలేమయ్యెనో ! ఆదుకొనెడి
భక్త బృంద మే మయ్యెనో! పరితపించు
మదిని కరుణింప రాదె దాసు నను చుండ

పరుగు పరుగున వచ్చి దాశరథి దేవ!
రంగపురి వార్త లంచు నోర్గదప లేక
తనువు చెమరింప కన్నీరు దొనకరింప
గద్గదంబున నెటులొపల్కిందొడంగె ॥45॥

గురు దేవ! మహాపూర్ణులు
హరిపదమును సేరిరంట నావిరహజ్వా
లలలోఁదపియించుచు మీ
కురేశుడు మిమున్ దలచుచు ఁగుతకుత కుమిలెఁ ॥46॥

ఆ పలుకుల విని బోరన
వాపోయిరి మట్టునున్న భక్తజనంబుల్
పై పడువెతఁగనుజొప్పల
పై పొర క్రమ్మగ యతిపతి ప్రతిమగనిలిచెఁ ॥47॥

కటకటాయని, నీరు వేగముగ చిముక
రించు పరిజనంబుల క నుల్విచ్చి గురుడు
వేడినిట్లార్పు లెగయు, నీక్రీడ యేమొ!
తెలియలేక దేవా! వెత నలుగుచుంటి ॥48॥

నే డే శ్రీరంగ విభుని
జూడగఁబయనింతు మనగ చుట్టుంగలయు
వ్వాడ జనమ్ముగ దెలిసి గుమి,
గూడి గురు పదాల బట్టి గొల్లున నేడ్వన్ ॥49॥

దేవర పదముల చూడక
సేవింపక క్షణము కూడ జీవింపగలే
మీ విధి విహీనులదయ్యె
మీవెంటనె నడువ నిండమృత పదమందన్ ॥50॥

దారికడ్డముగ సతీ సుత పరివార
జనమునాయూరి పెద్దలే సాగిలఁబడ
విష్ణువర్ధన నృపతి యే వెఱగు పడుచు
నాయపూర్వ దృశ్యంబుగన్నారఁ గాంచె ॥51॥

భోగ భాగ్యంబులుండినన్ బూర్వపశ్చి
మాబ్ధి దేశాల నేలినన్ నమర గణము
లాత్మ వశమైన నీరీతి యఖిల జన మ
నోహరుండైస్తుతి ంగను టనూహ్య మౌర ॥52॥

పులకిత శరీరు డై మౌన మూర్తి య్యైన
బిట్టి దేవునిఁగనియతి వృద్ధుడనియె
రాక పోకలు జీవికి లోక మందు
సర్వ సామాన్యము కదా విచారమేల? ॥53॥

ఇంటికు చేయూ లంగని
యింటి పురము కోయిల పోదు మయ్యా లక్ష్మీ
కంయని సేంచెడి ఘా
కాంతుల కా దర్శనము కడుశుభ మనగ ॥54॥

వెంట నడచెడి దేవు డే యింటిని విడ
పోడలరికెడి ప్రేయమే వాడకున్న
వేరె దూరంపు వేల్పుల వెదుక నగునె?
యీ పదంబులే శరణని నృపుడు వ్రాల ॥55॥

ఊరిజనులంరక్తి యు ర్వీశు గురుభక్తి
చేరువ చెలువయ్య చిలిపి నవ్వు
గుట్టుఁదెలిసి గురుని గూడుగట్టినయోగ
శక్తులు నిరబారె స్థపతివచ్చి ॥56॥

వేగరామానుజ ప్రతిబింబ మొకటి
అద్భుతంబుగ నిర్మించి ఆలయాన
మాయమయ్యె నారాయణ మాయనెరిగి
గురువరుండా శ్రితజనాలఁ గూర్చి పలికె ॥57॥

నా ప్రాణ శక్తులన్నియు
నీప్రతిమాంతర్గ తంబు లెల్లప్పుడు నే
మీప్రగతిన్ వీక్షింపుచు
నీప్రాకార ప్రదక్షిణేచ్ఛఁజరింతున్ ॥58॥

పిలిచినవెంటనె పలికెద
కొలిచిన దీవింతుపట్టి కోర్కె లన్నిటన్
దలచిన నీడేర్తు నెదుట
గల నారాయణుడె సాక్షి కలగకు డనగా ॥59॥

ఆలయంబున నర్చకు లర్చసేయు
దేవుడై సదానంద మూర్తిగ గురుండు
నిశ్చల ధ్యాన యోగీంద్రు నిరతి మెరసె
పరిజన వ్రాత మానందభరిత మయ్యె ॥60॥

# అధ్యాయము - 18

కరగినవగలు వచ్చి బంగారమగును
హద్దు చెడని యలలుసము ద్రంబునగును
విరులు ఫలములై పూర్ణమై విభునిఁజేరు
అంతరిక్షమునంత ప్రభాళి వెలిగె ॥

# 18. ప్రస్థానం

ఆంతరంగిక శిష్యులే యనుసరింప
చెలువు నారాయణ స్వామి చరణమంటి
పయనమయ్యె రామానుజ ప్రవరుడు వెస
రంగవిభు భక్తులం జూడ ప్రాణ ముబికె ॥1॥

పాలకడలిని గిలకొట్ట పైకి దేలు
వెలుగు వెన్నలే నవనీత విధుడనంగ
అనుభవానంద వదనుడై యతివరేణ్యు
డరుగు దెంచి శ్రీరంగపు హద్దులరసె ॥2॥

హద్దు మీరిన యుత్సాహమలలరేగ
స్వాగతంబిచ్చె కావేరి, పట్టణప్ర
జ ప్రముఖ కవిబుధ గురు సమితివచ్చి
గురుని తలపుల రూప మే గుంపు కాగ ॥3॥

ఆత్మ పరుగిడ వార్థక్య మడ్డు పడగ
ముందు పడలేక రంగని ముందె నిలచి
పరిసర ప్రాంత మంతయు మఱుగువడగ
రంగనాథు రాజీవనేత్రాల ఁజూచె ॥4॥

చూచి యానంద బాష్పముల్ సురియుచుండ
స్వామి మీయాజ్ఞ యంచు సాష్టాంగము వడి
లే చి మరిమరి మ్రొక్కుచు ఁజూచిన కడ
జూచుతిరిగిన కడ తిర్గుచుఁదను వెల్ల ॥5॥

కన్నులై, భ క్తబృందమున్ గాంచుచు యతి
ఆలయింబెల్ల నా తడై యనుభవించు
ముందు పడలేక మూలలో ముదిమి గనియ
ఎక్కచిక్కు నెముకలగూడక్కడఁగనె ॥6॥

కంకలమువిని గురుని రాకను గ్రహించి
గురువరా! యని మొందున కొరిగిపోవ
యతివరుడు కురేశాయని యతనినితోడ
జేర్చి నీర్జల్లి రంగ! రక్షింపవె యన ॥7॥

లేచికూర్చొని వేగ కే లిటునటుతడ
వి కడకెటులో! రామానుజవినుత చరణ
యుగళిఁ బట్టి కురేశు డయ్యో యటంచు
నేడ్చుచు మన మహాపూర్ణుడింక లేడు ॥8॥

పంచసంస్కార విధుల తో బ్రబలు మీకు
వైష్ణవ రహస్య మే గురువరు డొసంగె
యామనాచార్య గురుపీఠ మధివసింప
నెవడు కారణంబా శక్తియిపుడు లేదు ॥9॥

మీరు నేను నింతవార మై మనుట కె
వ్వనికృప యెవని గురు భక్తి యే వి
ధి ప్రకో ప మై తుదిన్ మృత్యువై పెడ
దారి కీడ్చి తీర్చె దారుణముగ ॥10॥

ఈశ్వరేచ్ఛ నెటుగ కే మిమ్ముఁ గావ మీ
వేషము ధరియించి వెడలనడచె
మిమ్ము, రాచ శాసనమ్ము న గ్రుడ్డి య్యె
కాయమీగె పూర్ణుడైయతండు ॥11॥

ఏనుమాత్రమిట్టి లీలోకమున్ నీడ
లేకమిమ్ము( జూడలేక రంగ
విభుని చేర లేక విసిగింప ముదిమితో
వేగుచుంటి దేవ! ఈగతినన ॥12॥

చింతింపకు మయ్యా! యీ
చింతలవిడనాడి హరిని చింతింపుము ప్రా
ర్థింతు నవశ్యము నీకా
యంతర్దృష్టి ప్రసాదమౌ నని యలియున్ ॥13॥

కన్నులు పులుము కొంచు రంగాయనంగ
నద్భుతము దేవ! యుత్సాహ మతిశయించె
దేహమందు క్రొంగ్రొత్త శక్తి కను పించె
ముప్పువచ్చినన్ మీయాపు మోహన మన ॥14॥

నీవుంటి రంగడుండె జ
నావళి దు ఖంబు లార్ప నాలస్యం బే
లా! వెళ్ళి వేడుమాయన
ఆవిశ్వాత్మునిటులాత డర్పించి వెసః ॥15॥

తిరిగి వచ్చి గురుని కె టుగి జీవకళల
రంగ విభుని సుందర సువిశాల
నేత్ర పద్మ రుచుల నేగంటి, వేడిల
చర్మచక్షు లడచు జనుల (గావ ॥16॥

స్వామి! జీవి తాంత సంధ్య యుసౌహార్ద్ర వ
కన్నులార మమ్ము గంటి, మీకృ
పాకటాక్ష మహిమ లోకైక నాథు నా
రాయణాపరమపద మే యగునటె ॥17॥

భూనభోంతరాళంబుల పూర్ణమై మ
హాద్భుత ప్రభనానంద మందఁ జే సె
అదిగదిగొ మహా పూర్ణాదులచ్యుతస్వ
రూపులైవచ్చి నన్నెదుర్కొని పిలుతురు ॥18॥

పోవు చుంటి దేవ! వికుంఠ పుర విమాన
యాన మనుచును రామానుజాం ఘ్రి నతడు
వ్రాలె బోరన వాపోయె భక్త జనము
నశ్రుతర్పణమొనరించె యతి మనమున ॥19॥

నిజమగువైష్ణవుడితడే
నిజనేత్రంబుల డులిచిన నిష్కారుణులకుఁ
విజయోత్సవ మాశించిన
సుజనుండు కురేశుడంచు శోకము పొంగఁ ॥20॥

ఎవడసాధారణమనీషి, యెవడకుంఠి
తగురుభక్తి తత్పరుడు, బోధాయన మెవ
నికి కరతలామలక, మె వని యనుభవము
సూత్రభాష్య పరిష్కార శుద్ధిఁజేసె ॥21॥

అతని సుతులీ పరాశర వ్యాసులె, దిగ
జారి బిక్కు బిక్కున మూల చతికిలబడ
పితృ వియోగంబులో వీరె వివశులైరి
బంధ మడపలేమని యతివరుడు దరియ ॥22॥

గురు పదములు చూడగనే
యిరువుర మదికుములు దు ఖ మెగసి, మొఱవలై
వెలుపడకన్గొలకులలో
గురుదేవా! యంచు గోలుగోలున నేడ్వఁ ॥23॥

వారినాదరాన దరికిజేరఁదీసి
పరమ పదమందు తండ్రికై బాధ పడుట
సహజమే గాని తత్త్వ విచార విదులు
ప్రాజ్ఞులగు మీరు దు ఖింప వరుసగాదు ॥24॥

యామునుల కోర్కె దీర్ప యీయవని పైన
రంగనాథుని వరము తోఁబ్రభవ మందు
మా కురేశుని ద్వయమంత్ర మామహర్షు
లగుపరాశర వ్యాసులిట్లగుటతగదు ॥25॥

అనుచు భాష్య పీఠాధి పత్యంబొసగుచు
ద్వయమహామంత్రము పరమ పావనచర
మస్తుతి శ్లోక తత్త్వార్థ మహిమమెరయు
కాలపురుషుని ముమ్ముందు గతినెరింగి ॥26॥

విష్ణు చిత్తునితోఁబాటువేరు, వేరు
ఆళవారుల విగ్రహాలాలయాన
నిలిపి అధ్యయనోత్సవంబులిరువదియొ
క దినము లొనర్పఁజేసె మార్గ శిరమందు ॥27॥

వైష్ణవాలయంబుల ఆళవారలు నుతి
యించు తమిళవేదము పఠియింప ఁజేసె
ఆడ బిడ్డగోదాదేవి యాచరించు
వ్రతమును సమాప్తమున్ జేయ యతితలంచె ॥28॥

రంగ పతితో తనకు కరగ్రహణ మైన
వృషభ గిరి నాథు తీపితోఁదృష్టి పరతు
నన్న యాండాళు బాస తానాత్మనెంచి
వెన్నపాలుగుడాన్న మర్పించె హరికి ॥29॥

అఖిల వైష్ణవ దేవాలయాల పొంగ
లిప్రసాదమందఱకు నర్పించు టొక్క-
కట్టుబడియయ్యె మధురానగర సమీప
వృషభ గిరి దర్శన క్షేత్ర విభవమందె ॥30॥

వైష్ణవ మఠాధి పతులుడెబ్బది నలుగురు
సంయమి ప్రవరులు సప్త శతము హరి ప
దార్చకులు ద్వాదశ సహస్ర మనుసరింప
రాజ తేజస్వియై యతి రాజు వెలిగి ॥31॥

ముదిమిగవియగ చర్మంబు ముడుతలువడ
కనుబొమల్ తెలి పోచల ధనువు కాగ
ఆత్మ పరిపాక శక్తి దేహమ్ము నలమి
వెలికి చిమ్మ రామానుజు వృద్ధుడంత ॥32॥

రంగనాథుని౯జేరి సాష్టాంగ దండ
మున్ సలిపి లేచి భక్తి కేల్మోడ్చి దేవ!
శ్రీనివాసుడే బ్రహ్మము జీవతతికి
భక్తి రూపాత్త శేముషీ పథమె పథము ॥33॥

ఆళవార లనుభవామృత గీతలు
శ్రుతి నిగదిత దివ్యసూక్తులన్ బ
రస్ఫుర సుముఖోజ్జ్వల సగుణ నిర్గుణా
చార రీతులగురిజగతి కొకటె ॥34॥

మీయనుగ్రహబలమీవిశిష్టాద్వైత
వ్యాప్తికుపక రించె వ్యాసుడాప
రాశర ప్రముఖుల ప్రాణతత్త్వంబుగా
కలుగుతత్త్వ మిదియె తెలియజగతి ॥35॥

స్వామీ! యీకింకరు డిక
నేమాత్రంబును మిమువిడి యిటజర్జరితుం
డై మన లే డీపారల
వే మాన్పింపవె యటంచు వినుతింపగనే ॥36॥

ధర్మోన్నష్టః యని దివి
మార్మికముగఁబలుక రంగ మందిర మెల్ల
మార్మో గెయతి వరేణ్యుడు
నిర్మలమౌ యోగగరిమ నిక్కంబెరిగె ॥37॥

పింగళి పుష్యద్వాదశి
వేంగడపతి పాన్పునగుచు విమలోద్దీప్తి
పొంగగఁదాష్టిర వాసర
సంగతిగల దృశ్య మెరిగె సద్గురు డంత ॥38॥

అతినిశ్చల మతియై లే
చి,తన పరిజనాళి ఁజేర శిష్యున్ పిల్లాన్
బుతరతునిన్ జ్ఞానసుతు న
మృత మూర్తి శిరంబు దువ్వెమృదుల స్పర్శ ॥39॥

అతని కనులు విద్యుద్దీప్తు లౌచు భూన
భోంతరాళంబు లొకటి గా వ్యాప్తి చెందు
వైష్ణవ ప్రభఁ గాంచె సంభ్రమమున నుతి
సలిపె శ్రీమతే రామానుజాయ యంచు ॥40॥

అంతనూరేంద్ల నార్జించినట్టి యోగ
శక్తులెల్ల నీవశమయ్యె శంకలుడిగి
ఉత్తరోత్తర ప్రబలమైయుర్వి మెరయు
నీ మతప్రవృద్ధికి శ్రమియింపు మయ్య! ॥41॥

భాష్య సింహాసనా ధీశ వర్గ పతులు
నంయ మీంద్రసమూ హంబు సతము హరిని
కొలుచు వేలాది భటులు నిన్గొలువ నీకు
యామన శ్రీబలంబు లేయండ యగును ||42||

నేటినుండి మతంబును నియతి నడుప
నితడె వారసుడిది రంగ పతి యనుజ్ఞ
యింక వైకుంఠ పురిభజియింపఁబోదు
ననుగురుంజూచి పరిజనం బార్తి మునిగె ||43||

ఈవార్త దేశమంతయు
దావాగ్నిగ చుట్టు ముట్ట తపియించిన భ
క్తావళి, గతిదప్పిన యా
శ్రీవైష్ణవ సంయమీంద్రు లే తేర వెసఁ ||44||

పురమేకూరుకు పోయెను
పురవరుడే రంగ విభుడు బొమ్మగనిలిచెఁ
దరిసిన జనవాహినుల య
తిరాజు కై దండనిలిపి దృఢవాక్కులతోఁ ||45||

అరువది యేండ్లకు మును పే
పొరపొడమిన నాదు ముదిమి పోఁదోయుచు శ్రీ
హరి లీలానిత్యవిభూ
తు లేప్రసాదించి నన్ను తూగించె నిటఁ ||46||

ఇప్పుడా మ హాస్వామియే యింకఁజాలు
రమ్మని వికుంఠ మునకు ద్వారంబుతెరచె
నతనియాజ్ఞనుజవదాట నగునె? మనకు
మీరుకొలిచెడి రంగడే మీకనంగ ||47||

రంగడెవడొ! రాముడెవడో, ప్రతినిమిషము
సత్య సౌజన్య రక్తి సాక్షాత్కరించు
నిత్యకల్యాణ గురుని సన్నిధిని వీడి,
నీరువిడిచిన చేపలై నిలువ లేము ॥48॥

తల్లి లేని బిడ్డల కేది దాపు? అకట
తండ్రి లేనియాత్మజులకు త్రాత యెవడొ!
గురుడులేని జిజ్ఞాసికి కుదురు కలదె?
స్వామి రామానుజుడు లేక బ్రతకఁ గలమె ॥49॥

అనిపలవించెడి పామర
జనులన్ పండితుల జూచి స్వాంతము మేల్కొ
టనిలుచు దృశ్యమునిలువగ
కనులయెదుట రంగ ! నీదు గారడి యెటులో! ॥50॥

రమ్మని పిలిచి నన్ను జనమ్ము చేత
పోవలదని బంధింతు, ప్రభూ! విరుద్ధ
మైన యీరాకపోకల కర్త మేమొ!
రెండునుం బ్రియంబౌచు స్ఫురించునీకు ॥51॥

ఏదిగొనుటొ! యేదివిడుటో యెరుగ నైతి
స్థూలదేహమో శ్రీపెరంబూరఁగూడె
సూక్ష్మ తనువహో! మేల్కొట సుకృతిగాంచె
కారణ శరీర మిందు రంగ! నిను గొలుచు ॥52॥

అనరరంగ విభుని సదనం
బుననుండియు స్థపతి యొకడు ముందున కరుదెం
చి "న మోయతి రాజేంద్రా!"
యని యవనత వదనుడగుచు నండనిలువగాఁ ॥53॥

[illegible] నారాయణ స్వామి చెంత నవత
[illegible] మహాత్ముడే యరుదెంచు టెరిగి
[illegible]దీర్పు మని రామానుజుడు ద
[illegible] నిజ ప్రతి బింబమే ప్రభవ మయ్యె ॥54॥

[illegible]! యెయ్యదిప్రతి బింబమో! తె
[illegible]క పరిజన వ్రాతంబురిచ్చవడగ
[illegible]ముగించి సెలవు గైకొని, యతికి న
[illegible]ప్రతి సలిపి, సురశిల్పి మాయమయ్యె ॥55॥

[illegible] రామానుజ ప్రభు శిరంబు
[illegible]ంచు సురమునఁజరణయుగళి
[illegible] పూర్ణు సూరుద్వయి నాశ్రయింప
[illegible]రంగనాథుని చూపులఁబడ ॥56॥

[illegible]మెరింగిన యింగి తజ్ఞ
[illegible]దాశరథి మె మదియుక్కి పడగ
[illegible] నోర్వక మామ! మాబ్రతుకులింక
[illegible]లోయని కేలెత్తియేడ్వగ యతి ॥57॥

[illegible] దేహదేహిన్యాయ బలిమి తలచి
[illegible] ప్రియుల మనః పరిస్థితిగతి
[illegible]మెరుగు దాశరథి కిదియు
[illegible]! కాదొ! చెప్పని స్థాయినాది ॥58॥

[illegible]కదలగ
[illegible] మదిచెదర మరల చిక్కులడంగాక
[illegible] మయ్యా! క
[illegible] రంగ తత్త్వమెఱిగి మనుమిక! ॥59॥

కనక దైత్యుగోటికొన మీటె నృహరి యై
కామితలల నరకె రాముడై అ
హమ్మనుశిశుపాలు నడచె సుదర్శన
కృష్ణజిష్ణు విష్ణు లీలలివియె! ॥60॥

ధనము విడిచి తనువు దండింప బనిలేదు
ఇల్లు విడిచి అడవి కేగ వలదు
దాస్య వృత్తి జీవితరియింప సులభమౌ
సకల సిద్ధులు హరి శరణున కగు ॥61॥

ప్రేమింపుము నీ వారిని
ప్రేమింపుము నీదు ఁబనుల ప్రేమింపుము నీ
భూమండ ల మన్నా ని
ష్కామంబగు కర్మయోగ సారంబిదియే! ॥62॥

నేను లేనిచోట నీవు; నీవును లేని
చోటనేనులేను సుస్థిరమగు
రంగనిశిరమున శిరంబు వంచితిఁజూడు
మని యతి తుది చూపు నతనిఁజూడ ॥63॥

చూపులారంగ నాథుని చూపులఁబడ
ఊర్ధ్వలాశేష తల్పుని యూర్ధ్వకాగ
హరిహరీయని శిష్యులేయడల గాలి
తెరలు పైబడ దలచె దాశరథి హరిని ॥64॥

అమృతస్పర్శ విలమై
అమేయ గురువాక్కులాత్మ నలరింపగ; రం
గముఖాన వెన్నెల వెలుగు
లమరగ దాశరథి విని మహానంద ఋతుల్ ॥65॥

గాలి మేపరి తాలుపు జ్ఞానమయ్యె
గాలి మేపరి శ్రీ భాష్యకారుడయ్యె
గాలియానంద తీర్థ మైగాచు జగతి
జ్ఞాన భక్తి కర్మ సముచ్ఛయాన బతుకు ॥66॥

॥ఓం శాంతి శాంతి శాంతిః॥